ప్రథమ ముద్రణము - 5000 ప్రతులు.
సెప్టెంబరు 1958



దక్షిణభాషా పుస్తకసంస్థ సహకారమున ప్రకటితము

A CHINESE CHILDHOOD

By

CHIANG YEE



**Printed at the Vemkatram Power Press - Eluru
and Published by Venkatrama & Co.
Vijayawada - Madras - Secunderabad.**

# పరిచయం

దక్షిణభాషా పుస్తకసంస్థ సాయం ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథ సంచయములోని తొలి ప్రచురణ ఇది. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం - నాలుగు దక్షిణాది భాషలలో విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహదమిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింపచేయాలనే సత్సంకల్పంతో, సముదార దూర దృష్టితో ఫోర్డు ధర్మనిధివారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణదేశంలో ఉన్న ఏడు విశ్వ విద్యాలయాల ఉపాధ్యాయులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచిమంచి పుస్తకాలను, ప్రచురణకర్తలచే అందంగా అచ్చువేయించి అందరికీ అందుబాటులో ఉండే సరియైన ధరలకు అంద చేయాలనే ఆదర్శంతో మూడేళ్ల కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకు లభించిన ప్రథమ ఫలాలివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢశైలిలో ఉండే విద్వత్కావ్యాలజోలికి పోకుండా కేవలం మాతృ భాషలో మాత్రమే అక్షరాస్యులైన, ఆంగ్లభాషావాసన లేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకాన్ని అలరించి, ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగా అందించగల సులభ సుందర శైలిలో ఉన్న ఉత్తమ గ్రంథాలను మాత్రమే ఎన్నుకున్నారు.

ఉన్నత సారస్వతశ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలనూ కూడా ప్రచురింపచేయుడం వీరి ప్రధాన లక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే "ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం" అనేదే దక్షిణభాషా పుస్తకసంస్థవారి పరమాశయం. ఇందులో వీరెంతవరకు కృతకృత్యులైనదీ ఇప్పుడీ గ్రంథాలనుబట్టి ప్రజలే నిర్ణయించ వలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషిఫలితం బహుశా వచ్చే పది సంవత్సరాలవరకు అంతగా కనబడకపోవచ్చు. కాని ఈ ప్రణాళిక అద్భుత మైనదని, అత్యంత ప్రధానమైనదని మాత్రం దూరదృష్టి గలవారందరూ ఒప్పుకొనకతప్పదు. ఇందుకుగల అవకాశాలు అనేకం. అందమైన అచ్చుప్రో

చౌకగా అందరికీ అందుబాటులో ఉండే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల కుగ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు కొత్త వెలుగునీ, విజ్ఞానాన్ని అందించగలవు.

దక్షిణభాషా పుస్తకసంస్థవారి కార్యక్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం - నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండడం వింతకాదు. ప్రాచీనకాలంలో వింధ్యకు దక్షిణానఉండే దేశమంతా దక్షిణాపథమనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృతికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈ నాలుగు భాషలను వాటి ప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుక చేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకే కోవకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాషలనడం నా అభిమతం కాదు. ఈ రోజులలో 'ద్రావిడ' పదం జాతి, భాష, పరమైనదిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నా యీ సంకోచానికి కారణం. ఈ నాలుగుభాషలకు మధ్య సహజమైన సన్నిహిత సంబంధాలు చాలా ఉన్నవి. పైగా ఆర్యావర్తంలో వ్యాప్తిలోఉన్న సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్ప సంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారాలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణభాషా పుస్తకసంస్థవారి ప్రోత్సాహంవల్ల ప్రచురితమయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థాన భాషా వేషానురతి శ్రుతి మించిపోకుండా సమగ్ర భారతసంస్కృతిని ప్రతిబింబింపజేసే పుస్తకాలను విశ్వమానవ సౌభ్రాత్రాన్ని, ప్రపంచ కల్యాణాన్ని కాంక్షించే ఉత్తమ గ్రంథాల అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

పా. వేం. రాజమన్నారు.

---

# గ్రంథపరిచయం

“చైనాలో నా బాల్యం” అన్న యీ పుస్తకం పిన్నలకు, పెద్దలకు కూడా ఆనందం కలిగించేది. వారు ఉభయులు నిరాడంబరజీవితమును మెచ్చుకుంటారు. ఈ గ్రంథరచయిత చియాంగ్ యీ 1939 లో యీ రచన చేసేనాటికి ఇంగ్లాండుదేశములో ఆరుసంవత్సరాలు ఉన్నాడు. రెండవ ప్రపంచ యుద్ధమేఘాలు ఆవరించియున్న రోజులవి. ఈ గ్రంథం యుద్ధ కాలంలో ప్రచురింపబడింది. దీన్ని చదివిన మేధావులందరికీ తమజీవన పద్ధతులనుగూర్చిన అపోహాలన్నీ మటుమాయమయినాయి. యుద్ధకాలంలో ప్రత్యక్షంగా ఉన్న మృత్యువు, సంక్షోభం - వీటినుంచి ఈ గ్రంథం శాంతి ప్రశాంతి కలిగించింది.

ఈ గ్రంథంలో మూడుతరాలలో ముప్ఫయిమందికి మించిఉన్న ఒకపెద్ద కుటుంబగాథ వివరింపబడింది. కుటుంబంలో ప్రతివారు తాత గారిని ఎక్కువగా గౌరవించడం, ఆయన ప్రశాంతంగా జీవితంగడపడం మెచ్చుకోదగిన విషయాలు. రచయితతండ్రి చిత్రకారుడు; అన్నగారు కవి. వారివంశానికి మూలపురుషుడు మొదటిలో ఒకరాష్ట్రానికి గవర్నరుగాఉండి చివరికాలానికి ఏకాకిగా ఒకగృహంలో ఉండిపోయినట్లు కథ. ఆ యింటికి మూడు హేదారులు. ఒకటి ఆయనకు, మిగిలినవి ఆయన ఇద్దరుస్నేహితులకు. వేలసంఖ్యలో పెరిగిపోయినా, ఆ కుటుంబంవారంతా “మూడుబాటల నిలయం” అనేపేరు పెట్టుకున్నారు.

ఈనాటి భారతీయకుటుంబ జీవనానికి, ఇందులో వర్ణింపబడిన చైనా కుటుంబ జీవనానికి అనేక సాదృశ్యాలు ఉన్నట్లు స్పష్టమౌతుంది. కుటుంబంలో పెద్దలను గౌరవించడం అటువంటి సాదృశ్యాలలో ముఖ్య మైనది. మనకంటె ఎక్కువగా వారు వంశవృక్షపు గ్రంథాలలో వంశంలోని

పూర్వీకుల చరిత్రలు వ్రాసి ఉంచి, కుటుంబంలో వయసువచ్చిన బిడ్డలకు ఆ గ్రంథంతో పరిచయం కలిగించడం జరుగుతుంది. అందువల్ల వారివంశ చరిత్ర తెలియడంతోపాటు కుటుంబసంప్రదాయాలు, వాటి రక్షణబాధ్యత తరువాతి తరాలవారికి తెలిసివస్తాయి. వారు జాతి ఆచారాలను అత్యంత శ్రద్ధాభక్తులతో కళాత్మకంగా అనుసరించడం మనకు లేని క్రొత్తవిషయం. వివిధ ఋతువులలో వారు జరుపుకొనే ఉత్సవాలు, విందులు వేడుకలు ఒకానొకప్పుడు భారతీయ జీవనంలో ఉండి యీ నాడు మృగ్యమయి పోయినవి. కళాత్మక ఆనందమయ జీవనానికి మన మీ నాడు దూరులమై నిస్తబ్ధ, నిస్సారజీవితం గడుపుతున్నాం. చైనావారి సాంఘికజీవనం, ఆచార వ్యవహారాలు ఒక ప్రత్యేకతను సూచిస్తాయి. ఆ విషయంలో యీగ్రంథం మనం తప్పకుండా చదువదగినది.

ఈ గ్రంథం అతి ముఖ్యమయిన, సున్నితమయిన అభిప్రాయాలను వ్యక్తంచేస్తుంది. ఆనందమయమైన బాల్యజీవితాన్ని స్ఫురింపజేస్తూ, కుటుంబ సంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు, కళారాధన మొదలయిన విషయా లలో క్రొత్త ఊహాలను రేకెత్తించే యీ గ్రంథాన్ని సావకాశంగా పఠించాలి.

జె. యం. లోబో ప్రభు.

---

# ఉపోద్ఘాతం

నేను ఒంటరిగా ఆలోచిస్తూ కూర్చునప్పుడు నా చిన్ననాటి ముచ్చటలు జ్ఞాపకానికి వస్తాయి. ఒకొక్కప్పుడుజరిగిపోయిన సంతోషకరమయిన సంఘటనలు ఆలోచిస్తే నవ్వువస్తుంది. అప్పటి సంఘటనలలో కొన్ని జ్ఞప్తికి వచ్చినప్పుడు, మనసుకు విచారంతోచి ఆ విషాదకర సంఘటనలు ఇప్పుడు నాకళ్ళయెదుట జరుగుతున్నట్లు అనిపిస్తుంది.

నా చిన్నతనం ఆదర్శప్రాయమయిందని గర్వంగా చెప్పుకోవచ్చు. చైనా - విశాలమైన దేశం, ఒక ప్రాంతానికీ మరొకప్రాంతానికీ ఆచార వ్యవహారాలలో మార్పులు, వ్యక్తుల జీవితంలో తేడాలు కన్పిస్తాయి. చైనాలో కుటుంబాలు పెద్దవిగా ఉంటాయని ఒక నమ్మకం. కాని కొన్ని కుటుంబాలలో, ఆలుమగలు-మహా ఉంటే ఒక పిల్లడు ఉంటారు. ఒకే ఇంట్లో ముప్ఫయి, నలభైమంది ఉండే పెద్దతరహా కుటుంబాలుకూడా లేకపోలేదు. నేను - అలాంటి ఒక పెద్దరకపు కుటుంబంలో పెరిగాను. నేను నా తోటివిద్యార్థులతో మా కుటుంబాన్ని గురించిన సంగతులు చెపుతూంటే వారు విస్తుపోయి వింటూఉండేవారు. పెద్దకుటుంబాలలో పెరగడం వారి అనుభవానికి వింతగా తోచేది.

నా తలిదండ్రులు చిన్నతనంలోనే గతించారు. నా పినతండ్రుల పిల్లలు వారి తలిదండ్రులదగ్గరకు పోవడం, వారు ఆ పిల్లలను లాలించి బుజ్జగించడం చూచి, నా ఒంటరితనానికి నేను పడినదుఃఖము ఇప్పటికికూడా మరుపురాదు. ఇప్పటికీ నాచిన్నతనంలోఉన్న పిరికితనము- సహవాసగాండ్రు లేని ఒంటరితనము, ఇవన్నీ తలచుకుంటే సంతోషం - విచారంకూడా కలుగుతాయి. మొత్తంమీద నాచిన్నతనం సుఖంగా గడచిపోయింది.

మార్పు నా మనసుకు కలతగానే ఉండేది. "ఇదివరలో నేనెరిగినవి, చూచినవి కొన్నాళ్ళ తరువాత ఎందుకు మారాయి?" అని నేను మా నాయనమ్మను అడిగేవాణ్ణి. ఇదివరలో ఉన్నట్లే, జరిగినట్లే ఎప్పుడు ఉండదని గ్రహించాలని ఆవిడ నాకు సమాధానం చెప్పేది. ఆమె చెప్పింది ఎంతో సత్యము!

నేను నా దేశంవిడిచి విదేశాలకు వెళ్ళానని తెలిస్తే మా నాయనమ్మ నాలో వచ్చినమార్పుకు సంతోషపడేదని, ఆశ్చర్యపడేదికాదని నా ఊహకు తోస్తుంది. కాని ఆమె బ్రతికిఉంటే, నేను విదేశాలు తిరగడానికి

ష్టపడేదో లేదో నేను చెప్పలేను. మానవుని జీవితంలో మార్పు రావడానికి కారణాలు, వాటి ప్రయోజనాలు ఎవరు చెప్పగలరు? విధి నిర్ణయంగా వాటిని గ్రహించవలసిందే. నేను ఈ లోకంవిడిచిపెట్టి మా నాయనమ్మను చేరేలోగా ఇంకా ఎన్నెన్ని మార్పులు రానున్నవో ఊహించుకోలేను!

జరిగిపోయినదానికి ఇంతగా ఆలోచన మంచిదా? నేను ఇంగ్లండు దేశంలో ఉన్న గత ఆరు సంవత్సరాలలోను తరుచుగా గతకాలాన్ని గురించి గొప్పగా పొగడడం, వర్తమానాన్ని గురించి విసుగుపడడం విన్నాను. నాస్నేహితులు చాలమంది 'గడచిపోయినదాన్ని గురించిన ఆలోచనకు కాలంవ్యర్థం చేయడంకంటె భవిష్యత్తును గురించిన ఆలోచన చేయరాదా' అని వాదించేవారు. ఇది ఇరవయ్యో శతాబ్దం. అభ్యుదయ యుగం అంటూఉండేవారు. నామటుకు నేను పరిణామానికి వ్యతిరేకిని కాను. ఏదైనా ఒకదానిలోవచ్చే క్రమాభివృద్ధిని పరికిస్తూ దాని భవిష్యత్తు గురించి ఊహించడం నాకు పరమఆనందం. నవీనం అన్నిసందర్భాలలో ప్రాచీనంకంటె ఉత్తమమైనదని అంగీకరింపను. బాల్యం విషయంలో ఆ వయసులోనిసుఖం, ఆనందం – జ్ఞప్తికివచ్చినపుడల్లా తీయనితలపులు రాకమానవు. ఆ ఆనందాన్ని అధిగమించేది ఇంకొకటి ఉండదు.

నా బాల్యాన్ని గురించిన ఈ రచన సంఘటనలక్రమాన్ని బట్టి రచించినదికాదు. అలా వ్రాసిఉంటె పాశ్చాత్యులకు చాలమందికి అర్థమే కాదు. ఈ పుస్తకంలోని కొన్ని వివరాలు వింతగా కనిపించుతాయి. నా బాల్యం – అంటే ఐదుమొదలు పదిహేను సంవత్సరాలవఱకు – కుటుంబవిషయాలకుమాత్రమే పరిమితంచేసి విషయాలు వ్రాశాను. నాచిన్న నాటి ముచ్చటలు ఇప్పుడు వ్రాయగలిగినందుకు చాల గర్విస్తున్నాను.

చైనాలో త్వరితగతిని విపరీతపరిణామాలు కలిగినప్పటికీ, చైనా ప్రజల జీవితంలో పెద్దమార్పు కలుగలేదు. చైనా ఐదువేల సంవత్సరాలుగా మారుతూనే ఉన్నది. అయితే గతంలో వచ్చిన మార్పులు ఋతువులతో కలిగే మార్పులవలె కనిపెట్టరానంతగా ఉంటే, ఇటీవలి పరిణామాలు విస్పష్టంగా అతిత్వరితంగా జరుగుతున్నాయి. పరిణామవేగమే దీనికి కారణం.

— మూలగ్రంథ రచయిత.

# 1. నా జన్మభూమి

నేను కియాకియాంగ్ అనే ఊళ్ళో పుట్టాను. అది కియాంగ్‌సీ రాష్ట్రంలోని ఒక చిన్నజిల్లా. హాన్ వంశం నాటి నుంచీ అనేక ముఖ్యమయిన చారిత్రక సంఘటనలు ఇక్కడే జరుగుతూ వచ్చాయి. సుప్రసిద్ధుడయిన చౌయూ సేనాని ఈ పట్టణంలోఉండి పరిపాలించాడు. ఆయనభార్య షియో చియో పేర ఒక వీధికూడా ఉన్నది. చైనాచరిత్రలోవచ్చే అన్ని రాజవంశాలతో మా కియాకియాంగ్ పట్టణానికి సంబంధం ఉంది. ఇంతటి ప్రాముఖ్యము దీనికి ఎలావచ్చిందంటారేమో! ఈపట్టణానికి పడమరవైపున యాంగ్‌ట్సీనది, దక్షిణాన ప్రసిద్ధికెక్కిన 'లూ' పర్వతం, ఆగ్నేయంగా చైనాలోని పెద్ద సరస్సులలో ఒకటైన ప్యాంగ్‌సరస్సు - ఇవన్నీ మాపట్టణం గొప్పదనానికి కారణాలు.

మింగ్‌వంశానికి మూలపురుషుడయినరాజు ఈ పట్టణం పరిసరాలలోనే అనేక యుద్ధాలుచేసినట్లు ఆధారాలు యీ నాటికికూడా లూ పర్వతంమీద ఉన్నాయి. అయితే ఆ యుద్ధాలు, చిహ్నాలనుగురించి నేనంతగా పట్టించుకోలేదు.

ఈపర్వతపు మనోహరదృశ్యాన్ని వేలకొలది సంవత్సరాలనుంచి కవులు వర్ణిస్తూవచ్చారు. చిత్రకారులు కూడా దాన్ని చిత్రించారు క్రీ. శ. 4 వ శతాబ్దంనాటి 'కూకైచీ' చిత్రకళనుగురించి వ్రాసిన గ్రంథంలో లూ పర్వతపు సౌందర్యాన్ని వర్ణించాడు. కాని ఆయన చిత్రించిన దృశ్యాలలో ఒక్కటయినా దొరకలేదు.

'ఐదువంశాల'కుచెందిన చింగ్ హావో (క్రీ.శ.905– 960) చిత్రించిన 'లూ పర్వతంమీాది మంచుదృశ్యం' అనే వర్ణచిత్రం' అమూల్యమయినది. అదొక్కటే దొరికింది.

1935–36 లో బర్లింగ్ టన్‌లో జరిగిన అంతర్జాతీయ చైనా చిత్రకళాప్రదర్శనంలో యీ లూ పర్వతపు ప్రకృతి దృశ్యాలు ప్రదర్శించబడ్డాయి. ఈ వివరాలమూలంగా మా పట్టణం చరిత్రతో, కళలతో ఎట్టిసంబంధం కలిగి ఉన్నదో పాఠకులకు అర్థమవుతుంది.

యాంగ్ ట్సీ నదికి దక్షిణపు ఒడ్డునఉన్న చిన్న పట్టణంలో నేను పుట్టాను. పధ్నాలుగు సంవత్సరాలు వచ్చేదాకా నేను యీ పర్వతాన్ని చూడకపోయినా మేము ఆ పర్వతందిగువనే కాపురం ఉన్నాము. చైనాను ప్రజాస్వామ్యంగా మార్చిన 1912 విప్లవము రోజులు అక్కడే గడిపాము. ఆ నదిఒడ్డున నేను ఎన్నిసారులు నడిచానో! ఒడ్డున నిలుచునిచూస్తే – పెద్దవి, చిన్నవి తెరచాపలతో కూడిన పడవలు అనేకం కనిపించేవి. నది కెరటాలపైన గాలి వాలులో తెరచాప లెత్తుకొనిపోయే పడవలు – అంత అందమైనదృశ్యం ఇంకెక్కడా చూచిఉండరు. యాంగ్ ట్సీ నది నీరు పచ్చవాగుగా ఉంటుంది. ఆ నదీజలంలో ఉండే అపరిమితమైన ఇసుకరేణువులే ఆ రంగునకు కారణం. ఆ నీళ్లు ఎప్పుడూ కెలికినట్లే ఉండేవి.

ప్యాంగు సరస్సు ఈ పట్టణానికి దిగువగా ఇరవై మైళ్ళలో ఉంది. ఆ సరస్సులో ఈ నది కలసినచోటు చాలా

మనోహరంగా ఉంటుంది. రెండూ రెండు తిన్నని రేఖలుగా తీరి ఉంటాయి. సరస్సునీరు ముదురు నీలపురంగు. నది నీరు పచ్చనిరంగు. అవి వేరువేరుగా కనిపిస్తూనే ఉంటాయి. మా పట్టణం చుట్టూ ఒక గోడ. దానికి దక్షిణ దిక్కుగా ఒక ద్వారం. ఆ ద్వారాన్ని ఆనుకొని కాంగ్‌టాంగ్ అనే సుందరమైన సరస్సు. ఆ సరస్సుతో నా అనుభవాలు మరొక మాటు విపులంగా వర్ణిస్తాను. కియూకియాంగ్ జిల్లాలో తయారయేవి, పండేవి ఎక్కువగా లేకపోయినా ఈ రేవుగుండా పింగాణీ సరుకులు, ప్రత్తి, టీ మొదలైనవి ఎగుమతి అవుతాయి. కియూకియాంగ్ చూచిన ప్రతి పాశ్చాత్యుడు పింగాణీ సరుకుమాట మఱచి పోలేడు. పట్టణం చాల చిన్నది. ఒక్కటే బజారు, అన్నీ పింగాణీసరుకు దుకాణాలే. హాన్ రాజుల కాలంనుంచీ పింగాణీ సరకుల తయారీకి ప్రసిద్ధిపొందిన 'చింగ్-టీ-చెన్' కియూకియాంగ్‌కి పదిహేనుమైళ్ళ దూరంలోనే ఉంది. కొన్ని శతాబ్దాలుగా అక్కడ తయారయిన పింగాణి సరుకులు చైనా సామ్రాజ్యంలోని ఇతరభాగాలకు, ప్రపంచం నలుమూలలకు పంపబడుతూ వచ్చాయి.

నేను చదువులో ఎక్కివచ్చి నాన్‌కింగ్‌లోని కళాశాలకు వెళ్లేవఱకుకూడా కియూకియాంగ్‌వంటి అందమైన పట్టణాలు ఇంకా ఉంటాయనే ఊహయేలేదు. చైనాలో ఒక సామెత వాడుకలో ఉంది. 'కాకిపిల్ల కాకికిముద్దు' అని ఆ సామెతకు అర్థం. మా పట్టణం మిగిలిన పట్టణాలకంటె

చాల గొప్పదని నాతలంపు. నావలెనే అందరుకూడా తమ జన్మభూమి అంటే అభిమానం కలిగిఉంటారు.

1912 విప్లవానికి పూర్వం మాపట్టణం ఎల్లా ఉండేదో తెలియదు. కాని పెద్దలు చెప్పేదానినిబట్టి నదిఒడ్డున విదేశీయులు కట్టిన కొత్తకట్టడాలు తప్పితే పట్టణం పెద్దగా మారలేదని తెలుస్తుంది. ఆకట్టడాలయినా సంధిరీత్యా మాపట్టణం పాశ్చాత్యులకు ప్రవేశంగల రేవుపట్టణంగా ఏర్పడినతరువాత కట్టినవే. పూర్వం పట్టణానికిచుట్టూ ఒక పెద్దకోటగోడ ఉండేది. ఆగోడపైకి ఎక్కి దానిమీదుగా నడిచి వెళ్ళడమంటే నాకు చాల సరదా. అలానడుస్తూంటే ఇళ్లదొడ్లు ఆవరణలూ, చాలదూరంవఱకు కనిపించే నదీ పర్వత దృశ్యాలు, చాల ఆకర్షణీయంగా ఉండేవి. 1923 ప్రాంతంలో ఆ కోటగోడను అనవసరమని పడగొట్టివేశారు. కాని నేను ఆగోడపైగా నడచి ఆనందించిన అనుభవంమాత్రం ఎన్నటికి మరచిపోలేను.



పూలమొక్కలు అమ్మేవాడు

# 2. చియాంగ్ వంశం

ఆ నాడు నా పన్నెండవ పుట్టినరోజు. బంధువు లందరినీ పిలిచి మహావైభవంగా ఉత్సవం జరిపిన తర్వాత (వేరే అధ్యాయంలో దాన్ని వర్ణిస్తాను) మా తండ్రి నన్ను తన గదిలోకి పిలిచాడు. మా తాతయ్య దగ్గరకుపోయి మా వంశవృక్షపు పుస్తకం చూడవచ్చేమో అడిగి రమ్మన్నారు. ఒక వయసు వచ్చిన తర్వాత చైనాలో పిల్లలకు వారి వంశచరిత్ర తెలిపే గ్రంథాలు పరిచయం చేయడం చైనాలో ఆచారం. ఒక్కొక్క కుటుంబంలో వయసు పరిమితి మారినా, సాధారణంగా పదిసంవత్సరాలు నిండాలి. మా తాతగారు నేను మా వంశవృక్షపు గ్రంథం చూడడానికి అంగీకరించారు. మా నాయనమ్మగూడ ఆ సమయంలో చూడాలని కుతూహలపడింది. మా కుటుంబంలోని వారంతా చూడడానికి వీలుగా మధ్యచావడిలో, మా పూర్వుల విగ్రహాలుపెట్టి ఆరాధించేచోట, నాకు మా వంశవృక్షపు గ్రంథం చూపించడానికి మాతండ్రిఏర్పాటుచేశాడు. కథలు చెప్పడంలో మానాన్నకు ప్రత్యేకనిపుణత, అందరినీఆకర్షించే శక్తి ఉన్నవి. మరీచిన్నవారుతప్ప మా కుటుంబంలోనివా రంతా అక్కడచేరారు. వృత్తిచేత చిత్రకారుడు కావడం మూలంగా మానాయనకు అందరితో కలసిమెలసి ఉండడం కంటె ఏకాంతంగాఉండడం అలవాటు. పండితులు, చిత్ర కారులు చైనాలో ఎక్కువగౌరవంకలిగి ఉండేవారు. వారు

కుటుంబ నియమాలకు అతీతంగా ఉంటారు. కాని మా సమా వేశాలకు మా నాయనకూడావస్తే అందరు మిక్కిలి సంతోషించేవారు.

ఆ దృశ్యాన్ని నేను మరువలేను. ప్రొద్దుగూకింది. చావడిలోని అన్నిదీపాలు వెలిగించారు. మాతండ్రి ప్రత్యేకపు దుస్తులుధరించి, మా పూర్వుల విగ్రహాలదగ్గర ధూపంవేసి నిచ్చెనమీదికెక్కి మా వంశవృక్ష గ్రంథాలుదాచిన కొయ్యపెట్టెను మిక్కిలి గౌరవంతో క్రిందికి దింపారు. అందులో ముప్ఫయి, నలభై, పెద్ద గ్రంథాలున్నాయి. చావడిమధ్యలోఉన్న మేజాబల్లపై వాటిని పెట్టారు. మా నాయనమ్మ మధ్యచావడిలో పూర్వుల విగ్రహాలకు క్రిందుగా, అలంకరింపబడిన తెరముందు ఠీవిగా ఒక ఆసనం మీద కూర్చున్నది. మా తాతగారు పెద్దతనంచేత రాలేక పోయినాడు. కుటుంబంలోనివారంతా ఒక ఇరవైమంది వచ్చి చావడిలో గోడప్రక్క కుర్చీలమీద కూర్చున్నారు. మా నాయన మేజాదగ్గర కూర్చున్నాడు. నేను ఆయన కుడిచేతివైపు నిలువబడ్డాను. ఎడమచేతివైపు మా పినతండ్రి పెదతండ్రి పిల్లలు – నాకంటె రెండునెలలు పెద్దది ఒకపిల్ల – ఎనిమిదినెలలు చిన్నవాడొక పిల్లడు – నిలబడ్డారు. మేము ముగ్గురం పురాణాలు కొద్దిగా చదువగలిగినవాళ్లము. మా వంశంలోని మహాపురుషుల కథలుచెపితే వినదగిన గ్రాహ్యత, వయసు మాకు వచ్చింది.

సంవత్సరాది పండుగ. మేమంతా క్రొత్తదుస్తులు తొడుగుకొన్నాము. నేను ఒక ఎఱ్ఱగౌను, దానిమీద ఒక నీలిరంగు శాటిన్ జాకెట్టు తొడిగాను. చైనాభాషలో దాన్ని "పేషిన్" అంటారు. దానికి చేతులు ఉండవు. చేతులున్న జాకెట్టును 'మాక్వ్యా' అని పిలుస్తారు. నల్లసిల్కుతో కుట్టిన ఆ జాకెట్టు నేను తొడిగినదానికంటె ఠీవిగా ఉంటుందని నాకు తెలియదు. నీలిరంగు నాకు చాలయిష్టంగనుక చేతులు లేకపోయినా అదే తొడిగాను. మా ముగ్గురుని కుర్చీలలో కూర్చోమని చెప్పినా, పుస్తకంలో మాటలు చూడవచ్చునుగదా అని మేము నిలుచునే ఉన్నాము.

మా నాయన ఆ పుస్తకంలోని పుటలుకొన్ని త్వరగా త్రిప్పివేశాడు. అది ఆ పుస్తకం అచ్చయిన కాలంలో ప్రసిద్ధులయినవారు వ్రాసిన ఉపోద్ఘాతం అయి ఉంటుందని అనుకొంటాను. మా వంశపు మూలపురుషుని పేరు వచ్చేసరికి మా నాయన గౌరవం ప్రకటించి కంఠస్వరం పెంచారు. "మనకు తెలిసినంతలో పీరే మన వంశానికి మూలపురుషుడు" అని మాతో చెప్పాడు. పేరు ఉచ్చరించలేదు చైనాలో పెద్దవారిని పేరుపెట్టి పిలవడం ఆచారంకాదు. మా నాయన "యువాన్‌చింగ్ కుంగ్" అని చెప్పాడు. యువాన్‌చింగ్ అనేది మా మూలపురుషుడయిన 'షు' కు గల మరియొక పేరు. 'కుంగ్' అనేది పెద్దలను చెప్పడానికి వాడే బిరుదు. మా మూలపురుషుని అసలు పేరు 'చియాంగ్‌షు' 'యువాన్ చింగ్' అని కూడా వాడుక. మా వంశంలో ఎవరుకూడా

ఆ మూలపురుషుని పేరుతో పిలువకూడదు. నేనయినా పాఠకులకు విశదంగా తెలియగలందులకు వ్రాశాను.

మా మూలపురుషుణ్ణిగురించి మా నాయన మాకు చెప్పడం ప్రారంభించాడు. 'యువాన్-చింగ్ కుంగ్ క్రీస్తు పూర్వం 1 వ శతాబ్దంలో నివసించాడు. అప్పటి ప్రభువయిన ఎమ్ ఆయనను ఎన్‌చౌ రాష్ట్రానికి (ఇప్పటికంటె చాలపెద్దది) గవర్నరుగా నియమించాడు. దురదృష్టవశాన ఆచక్రవర్తి ఎక్కువకాలం పరిపాలించలేదు. ఆయన తరువాత రాజ్యానికి వచ్చినవారి కాలంలో దేశంలో కల్లోలం బయలుదేరింది. మంత్రులలో బలవంతుడైన వాంగ్‌మాంగ్ యువరాజునకు ప్రతినిధిగా పరిపాలింపసాగాడు. యువాన్-చింగ్ కుంగ్ ఈ పరిస్థితిచూచి సహించలేక పోయాడు. అనారోగ్యం కారణంగా ఉద్యోగం మానివేసి తన స్వగ్రామమయిన 'టూలింగ్'కు వెళ్ళిపోయాడు. ఆయన తన ఇల్లుదాటి వెళ్ళి ఎరుగడు. ఇంటిముందు ఒక వెదురుతోపు. ఆయనకు ఇద్దరు స్నేహితులు. చియూచింగ్ ఒకడు. ఇంకొకడు యాంగ్-చుంగ్. వారిద్దరు తప్ప యింకెవరు ఆయనతో మాట్లాడడానికి వచ్చే వారుకారు. ఆ వెదురుతోపులో మూడే త్రోవలుండేవి. ఒకటి ఆయన తన స్నేహితులకోసం వెళ్ళడానికిదారి. మిగిలినవి రెండు వారు ఆయన దగ్గరకు రావడానికి దారులు.

మహాఋషులవంటి ఆ ముగ్గురి సమావేశం ఒక కవితాగోష్ఠిని పోలిఉండేది. కొంతకాలం తరువాత "మూడు బాటల నిలయం" అనేపేరు మా మూలపురుషుని యింటికి

సార్థకబిరుద మయిపోయింది. ఆయన కల్ల, కపటం ఎరుగడు. ఆయన అధికారంలో ఉన్నంతకాలం మంచి పలుకుబడి సంపాదించాడు. అందుచేతనే కుత్సితుడైన వాంగ్‌మాంగ్ మంత్రి ఆయనను ద్వేషించి ఆయనకు ఎలాగయినా అప కారం చేయాలని ప్రయత్నించాడు. వాంగ్‌తో పోటీపడడం ఇష్టంలేక యువాన్ చింగ్ కుంగ్ వ్యవసాయదారుడుగా మారిపోయినాడు. అంతేకాదు. తన వంశంవారంతాకూడా పొలాలు సేద్యంచేసుకొని బ్రతకాలని ఆయన ఆదేశించాడు. ఆయన రచనలేవీ పుస్తకరూపంలో నిలువలేదుకాని మా వంశవృక్షపు గ్రంథంలో మాత్రం ఆయన తనవంశానికి యిచ్చిన సందేశం పెద్ద అక్షరాలతో ముద్రింపబడియుంది. ఆయన వంశానికి చెప్పిన ముక్కలు నాలుగే. "దాతృత్వం" "సత్యం" "విశ్వాసం" "ఓరిమి" మనవంశంలో ప్రతి వారికి యీ గుణాలు ముఖ్యంగా అలవాటుకావాలని ఆయన ఆదేశం. అప్పటినుండి మనవంశానికి "మూడుబాటల నిలయం" అనేపేరు స్థిరపడిపోయింది.

ఈ మాటలుచెప్పి మా నాయన కొంచెంసేపు ఆగాడు. మానౌకరు ఒకడు టీ తీసికొనివచ్చి అందించాడు. మాకు అందరికీకూడ ఫలాహారం, పానీయం అందించారు. మా పిన తండ్రిపిల్లలు నేనుకూడా పానీయంకంటె రొట్టెలే ఇష్ట పడతాము. మా నాయన చెప్పినదంతా ఒకమాటు జ్ఞాపకం తెచ్చుకొన్నాను. యువాన్‌చింగ్‌కుంగ్‌కు పూర్వం, మావంశ చరిత్రకు ఆధారాలు లేవనిచెప్పాడు. కాని చైనా పూర్వ

చరిత్ర చూస్తే క్రీ. పూ. 1134-1120 వరకు పరిపాలించిన 'ఉవాంగ్' చక్రవర్తి సోదరుడు చౌ ప్రభువు కొడుకులలో ఒకడు 'చియాంగ్' అనేరాష్ట్రానికి యువరాజుగా ఉన్నట్లు తెలియవచ్చింది. ఆ యువరాజు వంశంవారు ఆ రాష్ట్రంపేరే తమ ఇంటిపేరుగా వాడినట్లు తెలిసింది. ఆ కుటుంబంవారు కాలక్రమంగా రాజ్యంఅంతటా వ్యాపించారు. అందుచేతనే యీనాడు యిన్ని 'చియాంగ్' కుటుంబాలు నిలిచి ఉన్నాయి.

మా వంశవృక్షపు పుస్తకం ప్రకారం 'యువాన్-చింగ్ కుంగ్'కు ముగ్గురు కొడుకులు ఇద్దరు కుమార్తెలు. కొడుకు లంతా వ్యవసాయంలో మంచినేర్పుగలవారై వంశాన్ని వృద్ధిలోకి తెచ్చారు. కూతుళ్లుకూడా వ్యవసాయదారులనే పెళ్ళాడి మావంశాచార ప్రకారమే తమ పిల్లలను వ్యవసాయదారులుగా చేశారు.

గ్రంథంలోని పుటలు త్రిప్పుతూ, మా పూర్వీకులను గురించి అనేక విషయాలు మాకుచెపుతూ ఒకపుట దగ్గరకు వచ్చేసరికి మానాయన ఒకపెద్ద నిట్టూర్పు విడిచాడు.

అది సుంగ్‌వంశం అంతరించిపోయిన రోజులు (క్రీ.శ. 969 — 1276) చైనా ఉత్తరభాగంలో మంగోలుల దాడి హెచ్చయింది. దానికి తోడు ఆ ప్రాంతంలో అంటువ్యాధి ముమ్మరంగా ఉంది. మా పూర్వీకులు తమ ఆస్తి అంతా తెగనమ్మి శోకంలో మధ్యప్రాంతానికి వెళ్లిపోవాలని నిశ్చ

యించారు. మా కుటుంబం కియాకియాంగ్ రావడానికి అదే ముఖ్యకారణం. యాంగ్‌ట్సీ నది ఉత్తరభాగంలో నివాసం ఏర్పాటుచేసుకొని కుటుంబాలు వేలసంఖ్యలో వృద్ధిపొందే వఱకు అక్కడే ఉన్నారు. కుటుంబాలు పెరిగిన కొద్దీ ఒకరి కొకరు దగ్గరగా ఇళ్లు కట్టుకొంటూ ఒక పెద్ద గ్రామంగా వెలిసింది. అన్ని కుటుంబాలవారు 'చియాంగ్' అనేపేరు పెట్టుకున్నారు. వారు చందాలు వేసుకొని డబ్బు వసూలుచేసి ఒక పెద్దదేవాలయం, ఒకపాఠశాల నిర్మించు కొన్నారు. ఆ పాఠశాలకు చియాంగ్ వంశపు 'ఐషూబ్' అనిపేరు.

మా వంశంలో నలభై ఏడవ తరంవాడొకడు యీ నాటి నవీనపట్టణం ఉన్నచోట నదికి దక్షిణభాగంలో స్థలం కొన్నాడు. అతనికి యీ పట్టణంలోనే వ్యాపారం ఉండి పోవడంవల్ల నదికి దక్షిణభాగంలో ఒక ఇల్లు కట్టుకున్నాడు. ఏడాది కొకసారి నదిదాటివెళ్లి పూర్వీకుల ఆలయంలో మ్రొక్కి వస్తూఉండేవాడు. వ్యాపారంకొఱకు ఇవతలకువచ్చి కట్టుకున్నా అతడు అసలు చియాంగ్ వంశంవాడే. ఏ ఇంటిలో అయినా సరే పూర్వీకుల స్మారకచిహ్నాలు ఉండి నెలకు రెండుసారులు తప్పకుండా వారికి మ్రొక్కడం మా చైనా దేశపు ఆచారం. మొట్టమొదటగా నదికి దక్షిణంగా కట్టిన ఇల్లు మేము ఉంటున్నదేనని మా నాయన చెప్పాడు. మొదట ఆ యింటికి చుట్టూ పెద్దతోట కొద్దిగదులు ఉన్నట్లు పూర్వపు గ్రంథాలలో ఉన్నదట. ఇప్పుడు ఆ యింట్లో పది తరాలవారికి పైగా కాపురముంటున్నారు.

మా నాయన మా వంశము కథ వరుసగా చెపుతూ ఇప్పటి తరంవఱకూ చెప్పి, ఏభై ఒకటవ తరంవా డొకడు మా మూలపురుషుడు చెప్పిన ప్రకారం నడుచుకొనక వంశానికి అపకీర్తి తెచ్చిన గాథ చెప్పాడు. అతడు ఆ కుటుంబంలో కల్లా చిన్నవాడు. పెద్దవాళ్ళు శ్రద్ధపట్టకపోవడంచేత ఎన్నో కష్టాలుపడ్డాడు. కుటుంబంలోని పెద్దవారెవరూ అతని విషయమై జోక్యం కలిగించుకోనందువలన మొత్తము వంశమే అపకీర్తిపాలయింది. ఆ విషయం చెపుతూ మానాయన "నేను పూర్వులను విమర్శించకూడదు. అయినా మీ నాయనమ్మ యీవిషయం మీకు తప్పకుండా తెలియాలని కోరుతుంది. మనలో ఒకసామెత ఉందికూడా. ఇంటిగుట్టు లంకకుచేటు.' అన్నాడు. (నేను ఈవిషయం వ్రాసినప్పుడు కూడా మావంశంలో ఒకని దుశ్చేష్టలు బయలుపెడుతున్నా నని జంకు నాకు ఉండనేఉంది.)

చివరకు మా పెదతండ్రులపేర్లు, నా పేరు వచ్చాయి. నాపేరు అచ్చులో ఉన్నదనేసరికి అమితమయిన ఉత్సాహం ఒకవిధమయినగర్వం నాకుకలిగాయి. నాపేరు అచ్చులో చూచుకోవాలనే ఉబలాటంతో మానాన్న కుర్చీదగ్గఱకు వెళ్ళాను. నాపేరు అచ్చులోఉంది. నేను పుట్టినతేదీకూడా ప్రక్కన వ్రాశారు. వెళ్ళికూర్చోమని మానాన్న అన్నాడు. నాకు మూడు సంవత్సరాలు నిండినతర్వాత నాపేరు అందులో వ్రాసినట్లు చెప్పాడు. వంశవృక్షపు గ్రంథం సంపుటాలు మూడేళ్ళకొకమాటు అచ్చువేస్తారు. పదేళ్ళ

కొకసారి గ్రంథం అంతాకలిపి అచ్చువేస్తారు. వంశంలోని వారందరికీ ప్రతులు అందిస్తారు. ఆ వంశంలోనివారే ఆ గ్రంథానికి అచ్చులుకూర్చుకొని ముద్రించుకుంటారు. గ్రంథానికి కావలసిన కొయ్యదిమ్మలన్నీ పూర్వీకుల దేవాలయంలో దాచిఉంచుతారు.

వచ్చే వసంతకాలంలో మమ్మలనందరినీ నది దాటించి అవతలఉన్న మాపూర్వీకుల దేవాలయానికి తీసుకువెళుతానని మాపూర్వీకులకు తొలిసారిగామ్రొక్కిస్తానని మానాన్న చెప్పాడు.



బుట్టలు అమ్మేవాడు

# 3. 'మూడుబాటల నిలయం'

చియాంగ్ వంశంలోని ప్రతికుటుంబం వారును 'మూడు బాటల నిలయం' అని పేరుపెట్టుకొంటూరు. మేము కాపురమున్న ఇంటిలో మా పెద్దల స్మారకచిహ్నాలుండే చావడిముందు ముత్యాలవంటి అక్షరాలతో 'సాన్‌చింగ్ టాంగ్' అని లిఖితమయిన పలకఒకటి వ్రేలాడుతూ ఉంటుంది. ఆ పలకమీాది అక్షరాలను లియూ యున్‌చియో అనే లేఖకుడు చిత్రించాడు. ఆమాటలకు 'మూడుబాటల నిలయం' అని అర్థం.

మాయింటి తలవాకిట ఒక గుండ్రని ఆకారంలో ఉల్లిపొరకాగితంతో అందంగా తయారుచేయబడిన కాగితపు దీపం ఒకటి వ్రేలాడుతూ ఉంటుంది. దానిమీాదకూడా ఆ అక్షరాలే చిన్నవిగా చిత్రింపబడి ఉన్నాయి. ఇంకా మాయింటిలోఉన్న చేతిదీపాలు చాలావాటిమీాదకూడా ఈ అక్షరాలే చెక్కబడిఉన్నాయి. రంగుదిమ్మలపై అమర్చిన ఎత్తుదీపాలు పండుగలు, పబ్బాలలో వాడడానికి దాచి ఉంచాము. పండుగలలోను, పెళ్లిళ్ళప్పుడు ఆదీపాలచుట్టు ఎఱ్ఱని కాగితాలుచుట్టి వాటిమీాద బంగారురంగు అక్షరాలు అంటించుతాము. అపరకర్మ దినములలో తెల్లని కాగితాలు, వాటిమీాద నీలిరంగు అక్షరాలు ఉంటాయి. ఆ దీపాలలో ఉండే కొవ్వువత్తులు వెలిగించనివ్వండని మా నౌకర్లను నేను బతిమిలాడిన సమయాలు అనేకం నాకు జ్ఞాపకం వస్తాయి. దీపాలు వెలిగించేపని అంటే నాకు చాలసంతోషం.

అంతేకాదు, ఆరుబయట చలిమంటలు వేయడము అంటే అపరిమితమయిన ఆనందం మంటచెయ్యడమనేది చైనావారి సంస్కృతి కంతటికి మూలాధార మయిందనీ, 'సూయ్ జెన్' అనే చక్రవర్తి ఐదువేల సంవత్సరాలక్రితం మంటచేసేపద్ధతి కనిపెట్టాడని, కొయ్యపుడకల రాపిడితో నిప్పుచేయడం చైనా వారంతా ఆయనదగ్గర నేర్చుకుని వంట వండుకోనడం మొదలుపెట్టారని మా తాతయ్య నాతో చెప్పాడు.

మా యిల్లు ఎప్పుడు ఎవరుకట్టారో నేను తెలిసికోలేదు. కాని మాయిల్లు ఏఆకారంలో ఎలాఉండేదీ వర్ణించి చెప్పగలను. మేడలుకావుగనుక అంతస్థుల ఎత్తుతో పనిలేదు. మా యింటికి నలుచదరంగాఉండే పెద్దప్రాంగణాలు మూడు ఉన్నాయి. వాటికి 'తీన్ చింగ్' అనీ, 'స్కైవెల్సు' అని కూడా వాడుక. ఒకప్రాంగణానికి, ఇంకొక ప్రాంగణానికి మధ్య ఒక్కొక్క పెద్దచావడి ఉన్నది. గుండ్రని ఎత్తయిన కొయ్య స్తంభాలపైన ఆ చావడులు కట్టారు. ఆ స్తంభాలకు కావలసిన కలప అంతా 'లూ' పర్వతంమీదినుంచి తెచ్చినదే. ఒకొక్కక్క చావడికి చెరియొకప్రక్కను నాలుగేసి పెద్దగదులున్నాయి.ఆ గదులలోనే మా కుటుంబంలోని పెద్దలంతా కాపురముండేది.

ఈ పెద్దగదులకు రెండువైపులకూడా గదులున్నాయి. మొత్తంమీద అంతాకలిసి నలభైరెండు గదులున్నాయి. ఈ గదులకంటె పెద్దవయిన రెండు వంటశాలలు, మంచినీరు నిలువచేసుకొనేగది, కట్టెపుల్లలు నిలువచేసేగది వేరుగా

ఉన్నాయి. గదులలో కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి ఉన్నా కిటికీలలోనుంచి వాటికి కావలసినంత వెలుతురు వస్తుంది. మా నాయనమ్మ గది ప్రక్కనేఉన్న ఒకగదికిమాత్రం కిటికీలు లేవు. పైకప్పులలో అమర్చిన అద్దంలోనుంచే దానికి వెలుతురు వస్తుంది. చావడులలోతప్ప ప్రతిగదిలోను సామానులు పెట్టుకొనే అటకలు ఉన్నాయి. ఈ గదు లన్నిటినికలుపుతూ వసారాలు ఉన్నాయి.

సింహద్వారం ఎడమప్రక్కగా కాపలావాళ్లకోసం ఒక గది ఉన్నది. కాని మా తాతయ్య ఆడంబరం ఏమీ లేకుండా ఉండాలన్న కారణంగా కాపలావారెవరూ ఉండే వారు కాదు. నౌకర్లకు ఒకటి రెండు తప్ప ప్రత్యేకంగా కాపరానికి ఇళ్లఏర్పాటులేదు. పడకగదులకు ప్రక్కగా ఒక గదిలో ఆడనౌకరు, అతిథులుండేగదికిప్రక్కగా మగనౌకరు ఉండేవారు. ప్రతిచావడికి ముందువెనుకల తలుపులఏర్పాటు, ఆ తలుపులు బందులతో మడవడానికి వీలుగాఎనిమిది భాగా లుగా ఏర్పాటుచేయబడ్డాయి. తలుపుఎత్తులో సగభాగము చెక్కతో మూసివేసిఉండి పై కటకటాలభాగమునకు మాత్రం మేము రంగురంగు కాగితాలు అంటించేవాళ్లము. ప్రతి చావడిలో ఒక అరల బీరువా, ఒక చదరపుబల్ల, దానిమీద మేజాగుడ్డ, పింగాణిబొమ్మ లేదా కొయ్య బొమ్మ అలంకరింపబడి ఉండేవి. దానిపై పూలగుత్తులుపెట్టే ఒక పాత్ర, గోడలకు కొన్ని బొమ్మలు, పనితనంతో చెక్కిన కొన్ని అక్షరాలు ఉండేవి. గోడలకు అలంకరించిన

బొమ్మలుకూడా అన్ని ఋతువులకు సంబంధించిన పూలు, పక్షులు మొదలైనవాటితో నిండి అందంగా ఉండేవి. మా తాతయ్యకు చిన్నతనంనుంచి చిత్రాలంటే ఎక్కువ ఇష్టము. మా నాయన చిత్రకారుడే కాబట్టి మా యింటినిండా చిత్రాలే. మానాయన నెల కొక చిత్రాన్ని మార్చుతూ ఉండేవాడు. నాచిన్నతనంలో మానాయన నాకీ చిత్రాలు తగిలించడం, చుట్టి జాగ్రత్త పెట్టడం – ఈపనులు చెపుతూఉండేవాడు. గోడలకు తగిలించిన చిత్రాలు నాకు అందేవికావు. కాబట్టి ఆచిత్రాలు దాచిఉంచే పెట్టెలకుమాత్రం కాపలా ఉండడం నావంతు. మానాయన కూడా ఆ పనిని యింకెవరికీ చెప్పేవాడుకాదు. ఈ విషయం తలచుకొన్నప్పుడల్లా నాకు చాల గర్వంగా ఉంటుంది.

ప్రతిచావడిలోఉండే బొమ్మలు ఒకే ఎత్తుకలిగి ఉండేవి. ఒకగోడకు అన్నిరంగుల చిత్రాలు తగిలించేవారు. రెండవగోడకు అన్నీ అక్షరాలు చెక్కిన పటాలు తగిలించేవారు. చిత్రాలన్నీ కుడిచేతివైపు, అక్షరాలన్నీ ఎడమచేతి వైపు తగిలించడానికి కారణమేమిటో నాకు తెలిసేదిగాదు.

మాతాతయ్య గదిలో మానాయన స్నేహితుడు వ్రాసిన చిత్ర మొకటి ఉంది. మానాయనమ్మ గదిలో మానాయన చిత్రించిన పూలబొమ్మ ఒకటి ఉంది. మా సోదరిగదిలో పూలు, పిట్టలుకలిపి మా నాన్న చిత్రించిన బొమ్మలు నాలుగున్నాయి.

మా అన్నయ్య గదిలో అన్నీ అక్షరాలు చెక్కిన బొమ్మలే. పూలు పిట్టలున్న బొమ్మలు తనగదిలో ఉండడానికి మా అన్న ఇష్టపడేవాడు కాదు. మా అన్నయ్య స్నేహితులు పూలు పిట్టలు ఉన్న బొమ్మలు చూచి "ఆడవాళ్ళలా ఈ బొమ్మలు గదిలో తగిలించా" వని వేళాకోళం చేసేవారట. అందుకని మా అన్నయ్య ఆ బొమ్మలను తగిలించేవాడు కాదు. ఈ సంగతి విని మా నాన్న నవ్వుకున్నాడు.

మా నాయన తనగదిలో ప్రసిద్ధచిత్రకారుల చిత్రాలు ఒకటి రెండు తగిలించేవాడు. కాని ఆ చిత్రాలను, తరుచు మార్చుతూ ఉండేవాడు. తనచిత్రాలు ఒకటి రెండు ఎప్పుడయినా తగిలించినా అంత తృప్తికరంగా లేవనుకొని మళ్ళీ తీసివేసేవాడు.

అతిథులకొఱకు మా యింట్లో రెండుగదులు ఏర్పాటయి ఉన్నాయి. మా కుటుంబానికి పరిచయులైన వారు, పనిమీదవచ్చినవారు, ఆ గదులలో బసచేసేవారు. పరిచయపు ఉత్తరాలు తెచ్చినవారు, తదితరులు ముందున్న చావడిలో దిగేవారు. ఒక్కొక్కహాలులో నాలుగు బల్లలు, ఎనిమిదికుర్చీలు అమర్చిఉండేవి. గోడలకు చిత్రాలు అలంకరింపబడి ఉండేవి. మొదటి రెండుచావడులలో విందులకు నాలుగుబల్లలు ఏర్పాటుచేయడానికి, మూడవదానిలో అయిదు బల్లలుకూడా వేయడానికి చోటుఉన్నది. ఒక్కొక్క బల్లచుట్టు ఎనిమిదిమంది కూర్చుంటారు. పెళ్ళిళ్లు

మొదలయిన ఉత్సవసమయాలలో మడతతలుపులు మడిచి వేసి, సింహద్వారం మొదలుకొని చివరివఱకు ఒకేబారుగా బల్లలు, కుర్చీలువేసి విందు ఏర్పాటుచేయవచ్చు. వేసవిలో కూడ వెలుతురు, గాలికోసము మడతతలుపులు తీసివేసేవారు.

మూడుఅడుగుల ఎత్తు, నాలు గైదు అడుగుల కైవారంగల పెద్ద మట్టిజాడీలలో పెరటిలో బంగారురంగు చేపలు పెంచేవారు. నన్ను మీదికెత్తి ఆ బంగారుచేపలను నాకు చూపించుమని మా నాయనమ్మను, మా అక్కయ్యను ఎంతగా వేధించేవాడనో ఇప్పటికీ జ్ఞాపకము. ఈ పెరటిలో గడ్డి మొలచేదికాదు. దొడ్డిఅంతా సున్నపురాళ్లతో చదును చేయబడి ఉండేది.

వర్షపునీరు పోయేటందుకు ఈ పెరటిమూలలో కంతలుండేవి. మా నాన్న యీ కంతలున్న మూలలు కూడా చాల అందంగా కనబడాలనే కోరికతో మూడు నమూనాలు తయారుచేశాడు. తాబేలు, కప్ప, పీత ఆకారాలు తయారుచేసి బయటకుపోయే నీరంతా వాటికాళ్ళ మధ్యగా పోయేటట్లు చేయాలని తాపీమేస్త్రీలకు చెప్పి అలా ఏర్పాటు చేయించాడు.

మా మేనమామల ఇండ్లలో, మా బావల ఇండ్లలో కూడా యీ పద్ధతి తర్వాత ప్రాకింది. కొంతకాలమయిన తర్వాత పెద్దవాళ్లు వీటిసంగతి మరచిపోయేవారుకాని మాకు పిల్లలకు ఈ ఆకారాలు చూచినప్పుడు కలిగే ఆశ్చర్యము, ఆనందం అపరిమితం. మా ఇంటిలో ఇంకా ఉన్న చిన్న

దొడ్లలో చిన్న మొక్కలు, పిల్లవెదురు మొక్కలు అన్ని కాలాలలో వేరువేరు పూలు పెరుగుతూ ఉండేవి.

మా పెద్దయింటికి కుడివైపున ఇంకొక చిన్న ఇల్లు ఉంది. దానిలో ఒక పెద్దచావడి, దానికి రెండువైపులా గదులు ఉన్నాయి. అందులో మా మూడవ పెదతండ్రి కాపురముండేవాడు. దానికి ఎదురుగుండా ఉన్న కుటీరంలో మా నాలుగవ పెదతండ్రి, పిల్లలు కాపురముండేవారు.

ఆ ఇంటికి ప్రక్కనే ఒక పెద్దతోట ఉండేది. పెద్ద ఇంటితో ఈ తోటకు సంబంధముండేది. కాని మా తాతయ్య రాకపోకలకు వీలుగా మధ్యలో ఒకదారి ఏర్పాటుచేయబట్టి వేరయిపోయింది. దీనిమూలాన సింహద్వారానికి ఎదురుగా మేము పిల్లలమంతా ఆడుకోవడానికి విశాలమయిన స్థల ముండేది. సింహద్వారానికి ఎదురుగా కొద్ది ఎత్తుగల ఇటుక గోడ ఉండేది. గుమ్మములో నిలుచుండి చూస్తే దూరాన నీలిరంగులో 'లూ' పర్వతశ్రేణి కనుపించేది. కాని కొంత కాలానికి ఎవరో మాయింటిముందు తోట కవతలివైపున నున్న స్థలం కొని అందులో మూడు అంతస్థులమేడ కట్టారు. ఆ కారణంగా పర్వతంయొక్క అందమయినదృశ్యం చూచే భాగ్యం చెడిపోవడంతోపాటు మా కుటుంబ సుఖానికి, శ్రేయస్సుకు భంగము కలిగింది. ఈ దోషంపోవడానికి ఇటుక గోడ ఎత్తుగా కట్టారు. ఈ గోడ పైభాగంలో తాపీపనివారు తమ శిల్పంఅంతా ప్రదర్శించి కొన్ని అందమయిన ప్రకృతి దృశ్యాలు – మూడు రాజ్యాలనుగురించి ప్రసిద్ధమయిన కథలు

చిత్రించారు. ఆచిత్రాలు మావంశము మొదటిమూలపురుషుని కాలానికి, తరువాతికాలానికి సంబంధించినవి. ఆ మధ్యలో మా మూడవ పెదతండ్రి ఒక శిల్పితో 'ఫూ' అనే అక్షరం వ్రాయవలసినదిగా చెప్పాడు. ఆ అక్షరానికి 'సౌఖ్యము' అని అర్థము. సింహద్వారానికి ఎదురుగా గోడమీద చెక్కినందు వల్ల మేము బయటికి వచ్చినప్పుడల్లా 'సౌఖ్యము' అనే మాట కనిపిస్తూ ఉండేది.

పిట్టగోడకు ఎడమభాగములో ఒక పెద్ద చావడి, రెండుగదులు ఉన్నాయి. అది మా కుటుంబానికి అంతటికీ బడికోసం కట్టబడింది. ఐదు సంవత్సరాలు వచ్చేదాకా నేనా బడిలోకి పోలేదు. ఆరవ సంవత్సరము వెళ్లేదాకా నాకేమీ చదువు రాకపోయినా నాకంటె పెద్దపిల్లలు పురాణాలు చదవడం, కంఠస్థంచేసి అప్పగించడం చూచి ఆనందించే వాణ్ణి. బడిలో మధ్యగోడలో పూజామందిరం ఒకటి ఉంది. అందులో 'కన్ఫ్యూషియసు' చిత్రం వ్రాయబడింది. మా గురువుగారు రెండు గదులు తమకోసం ఉంచుకొన్నారు. చావడి కెదురుగా ఒక చిన్నతోట ఉండేది. పెద్ద తోటలో ఒకభాగమేకాని ఒక చిన్న గోడమాత్రం వాటి మధ్యగా ఉంది. చంద్రాకారంగా ఉన్న కంతద్వారా ఆ తోటలోకి దారి. బడికి ఎదురుగా ఉన్న చిన్నతోటలో నారింజజాతి జాతిచెట్టు ఒకటి ఉండేది. ఆ చెట్టుపేరు 'స్సెంగ్'. ఆచెట్టుకు ముళ్ళుకూడా ఉండేవి. ఆ చెట్టును గురించి నాకు చాల జ్ఞాపకం. మా అన్నలు, తమ్ములుకూడా దానిని మరచి

పోలేరు. మేము చదువుకొనే బడిచావడిలోకి ఆ చెట్టు కని పించేది. పంతులుగారికి పాఠాలు అప్పచెప్పేటప్పుడు, ముఖ్యంగా పాఠం రానిసమయంలో మా దృష్టి అంతా ఆ చెట్టుమీదనేఉండేది. మంచినీడ నిచ్చేది. బడివేళలో తీరికదొరికినప్పుడల్లా ఆ చెట్టుక్రిందికి చేరేవాళ్ళం. ఆడుకొనే వాళ్ళం. మే నెలలో దాని పూత ప్రారంభము. గుత్తులు గుత్తులుగా తెల్లనిపూలు, మధ్యలో పచ్చరంగు, చాల అందంగా ఉండేవి ఆ పూలు. మా పంతులుగారు రాలినపూలన్నీ ఏరి పారబోసి శుభ్రం చేయవలసిందని మాకు చెప్పారు. ఆ పనిఅంటే మాకు చాలసంతోషం. పెద్ద గాలికి పళ్ళు, పూలు రాలి పడుతుండేవి. త్వరగా పాఠం ముగించుకొని చెట్టు క్రిందకు చేరి ఒకరితో ఒకరు పందెంవేసుకొని పూలు, పండ్లు పోగుచేసేవాళ్లం. అలా పోగుచేసినవాటితో రకరకాల ఆటలు ఆడేవాళ్ళం. చెట్టునిండా ముళ్ళుఉన్నా మా పెద తండ్రిపిల్లలు ధైర్యంచేసి చెట్టుఎక్కి పండ్లు రాలకొట్టేవారు. ఆకుపచ్చరంగు పసుపుపచ్చ కలిసినరంగులోకొన్ని, పసుపు ఎరుపు కలిసినరంగుతో కొన్ని, చూడ ముచ్చటగా ఉండేవి. నారింజవలె వాటి రసం త్రాగడానికి పనికివచ్చేది కాదు. కొంచెం చేదు. మేము వాటిని తీసుకువచ్చి గదులలో అలంకారంగా ఉపయోగించేవాళ్ళం. ప్రతిసంవత్సరం రెండు మూడు వందల పండ్లు మా నాయనమ్మ మా చుట్టాలకు పంచిపెట్టేది.

మా పెద్దఇంటికి వెనుకభాగంలోకూడా ఒకతోటఉండేది కాని ముందున్నతోటంతపెద్దదికాదు. అందులో చెరువు లేదు.

మా ముందు తోటలో ఉన్న చెరువునీరు రాజవీథిగుండా యాంగ్‌ట్సీనదిలోనికి పోతుందని మా పెద్దలు చెప్పారు. మా నూతినీళ్లు టీ తయారుచేయడానికి పనికివచ్చేవి కావు. అందుచేత నదినుంచి గాని, కొండలమీదినుంచి గాని నీరు తెప్పించుకోవలసి వచ్చేది. మిగిలిన పనులన్నిటికీ నూతి నీరే వాడుకొనే వాళ్ళము. మొదటగా నుయ్యి వంట యింటికి దగ్గరగా ఉండేది. కాని ఇతరులకుగూడా దాని నీళ్ళు ఉపయోగపడేటందుకు మా తాతయ్య ఇంటికి వెలు పలగా త్రవ్వించారు. ఇరుగుపొరుగువారందరికీ ఇదొక పెద్దఉపకారం. కాని మా నౌకరులు మాత్రం గొణుగు కుంటూ ఉండేవారు. ముఖ్యంగా వేసవిలో అందరికీ నీటి వాడుక ఎక్కువయి, నూతిలో నీరు అడుగంటినప్పుడు మానౌకరులు ఎక్కువగా విసుగుకొనేవారు. మా నాయనమ్మ ఒక ఉపాయం చెప్పింది. మా కుటుంబానికి కావలసిన నీరు రాత్రిపూటే నిలువచేసుకుంటే బాగుంటుందని ఆమె సలహా. కాని మా నౌకరులు అది వినలేదు. రోజుకు రెండుగంటల పాటయినా ఇతరులెవ్వరినీ తోడుకోనీయవద్దని నౌకరుల్లు కోరేవారు. నూతికి ఒక పెద్ద ఇనుపమూత అమర్చారు. కాని అది చాల ఆశ్చర్యంగా మాయమయిపోయింది. గట్టి త్రాళ్ళతో ఒక మూతఅల్లి దానికి కాపలా ఏర్పాటుచేశాము. నేను అప్పుడప్పుడు ఆ కాపలాపనిలో ఉండేవాణ్ణి. మనసు దిటంచేసికొని కఠినంగా ఎవ్వరినీ పట్టుకోనివ్వను అనుకొని అక్కడ కూర్చుంటే తీరాబిందెలు పట్టుకొని నీటికివచ్చిన

వారందరిని చూచినప్పుడు వారిని పట్టుకోనియ్యక అడ్డం పెట్టడమెలా అనిపించేది. ఈ సంగతి తెలిసి మా నౌకరులు నేను కాపలాకు పనికిరానన్నారు. చేతనయినంతలో ఇతరులకు సాయపడాలని నా ఊహ, కాని పరిస్థితులు అందుకు వీలు కావుమరి.



కొండనీరు అమ్మేవాడు

# 4. అంత్యక్రియలు

నాకు బాగా జ్ఞాపకం. నా చిన్నతనంలో మా నాయనమ్మ పనివారికి పని పురమాయించి మా యింటిలో ఉన్న శవపేటికలకు రంగు వేయించేది. మా యింటిలో ఆరు శవపేటికలు సిద్ధంగా ఉండేవి. అవి తయారు చెయ్యడానికి కావలసిన కఱ్ఱ 'జెసూయన్' ప్రాంతంనుంచి మా చుట్టం ఒకరు తీసికొని వచ్చేవాడు. ఆ కఱ్ఱకు 'ట్జూటంగ్' అని ప్రత్యేకంగా పేరు. ఆ జెసూయన్ ప్రాంతము కియూకియాంగ్‌కు పడమటగా కొన్ని వందల మైళ్ళ దూరంలో ఉంది. ఆ రోజులలో రాకపోకలకు సౌకర్యంకూడా లేదు. కఱ్ఱను యింటికిచేర్చడానికి నాలుగు నెలలయినా పట్టేది. కాలం ఒక లెక్కలోది కాదు.

జెసూయన్ ప్రాంతంలో విలువైన వివిధరకాల కలప దొరకేది. 'ట్జూటంగ్' అనే కఱ్ఱతో మాత్రమే శవపేటికలు (శవాలను నిలువ ఉంచే పెట్టెలు) తయారు చేయడానికి కారణం లేకపోలేదు. వందలకొలది ఏళ్లు భూమిలో పాతినా చీకిపోని కఱ్ఱజాతి అది. ప్రాచీనకాలంలో ఈజిప్టు దేశీయులు కూడా చనిపోయిన తమ పెద్దల శరీరాలను భద్రపరచేవారు. ఆ పద్ధతిలోనే చైనావారు కూడా శరీరాలను జాగ్రత్తపెట్టేవారు. అంతేకాని పరిమళద్రవ్యాలతో ఉంచి కాపాడే అలవాటు చైనావారికి లేదు. ప్రత్యేకమయిన కఱ్ఱలు మాంసము కుళ్ళిపోకుండా ఉంచగలవనీ, చని[illegible] వారి నోటిలో ఒక ప్రత్యేకపు శిల ఒకటి ఉం[illegible]

కృళ్ళిపోదని మా పెద్దవాళ్లు చెప్పుకుంటూఉండగా నేను విన్నాను.

ఈవిషయంలో తలిదండ్రులపట్ల భక్తిగల కుమారుడు తాను చేయగలిగినదంతా చేసేవాడు. మా నాయన, పెదతండ్రులు, పినతండ్రులు అంతా కూర్చుని ముసలివారయిపోయిన మాతాతయ్య, మానాయనమ్మల శరీరాలు జాగ్రతపరచేటందుకు ఏర్పాట్లు చేయాలని అనుకుంటూ ఉంటే ముసలివారిద్దరుకూడా 'ట్సూటంగ్' కఱ్ఱ చాల ఖరీదు కలది, మన కుటుంబానికి అంతఖరీదుగల కఱ్ఱ ఎందుకులే అనేవారు. కాని కఱ్ఱ తీసికొనివచ్చి దానితో ఆరు శవపేటికలు సిద్ధం చేయించినతరువాత మాత్రం వారు తమ పూర్వాభిప్రాయం మార్చుకొన్నారు.

మన పిల్లలు మనపట్ల ఇంత శ్రద్ధాభక్తులు ప్రకటించి ట్సూటంగ్ కఱ్ఱను శ్రమపడి తెచ్చి శవపేటికలు చేయించారుగదా అని ఆ ముసలిదంపతుల సంతోషానికి అంతులేదు. ఈ శవపేటికలను ఆరింటిని నేను చూచిన గుర్తులేదు. కాని మూడుమాత్రం మాబడికి ఎదురుగుండా ఒక గదిలో తాళంవేసి ఉండేవి. వాటికి చక్కని ఎఱ్ఱరంగుపూసి ఉండేది. సిందూరపురంగు చైనాలో ప్రసిద్ధికెక్కినది. పశ్చిమదేశాలలో దానికి 'చైనా ఎరుపు' అనికూడా పేరు. ఆ రంగుపూత వేసినకొలది ఆ కఱ్ఱ ఎక్కువకాలం పనిచేస్తుంది. అందుచేతనే ప్రతి వేసవిలోను మా నాయనమ్మ అంతశ్రద్ధగా వాటికి రంగు వేయించేది. వేసవికాలపు ప్రారంభంలో ఎండలు బాగా

ముదరకముందు 'ఊటంగ్' నూనె, ఎఱ్ఱరంగు కొని పనివారిని పిలిచి రంగు వేయించటం ఒకపని. ఇద్దరో ముగ్గురో ఈ పనికి వచ్చేవారు. శవపేటికలుండే గదిలోకి వెలుతురు పోయేటట్లు చేసి రంగు వేయడం మొదలుపెట్టేవారు. ఆ పెట్టెలు చాల పెద్దవి. బరువుకూడాను. అడుగు మందం కఱ్ఱతో చేయబడిన పెట్టెను మోయడానికి ఇద్దరు మనుష్యులకు గూడ సాధ్యమయ్యేది గాదు. ప్రతియేటా వాటికి రంగు వేయడానికి చాల రోజులు పనిపట్టేది. మా నాయనమ్మ రోజు కొక్కమారయినా వచ్చి పనివారితో రంగు వేసే విషయమై మాట్లాడిపోయేది.

రంగు తయారుచేయడంకూడా చాల వింతగా ఉండేది. ఎఱ్ఱరంగు తెచ్చి కల్వంలో మెత్తగానూరి నీళ్ళతోకలిపి పట్టుగుడ్డలో వడపోసి పైన మిగిలిన బరకరంగు మళ్ళానూరి యీ విధంగా ఎంతో శ్రమపడి తయారుచేసేవారు. మెత్తగా తయారయిన రంగుచూర్ణం 'ఊటంగ్' నూనెతోకలిపి పూసేవారు. రంగు, నూనె ఏ పాళ్ళలో కలపాలో పనివారికి అనుభవం మీదట బాగా తెలిసిఉంటుంది. నాకు ఈరంగులు కలపడంలో చాల ఇష్టం. ఎందుకంటే మా నాయన ఈ విధంగానే రంగులునూరి జిగురుతోకలిపి బొమ్మలు వేసేవాడు. ఎఱ్ఱరంగు చాల మెత్తగానూరి కలిపేవారు గనుకనే పూసిన తరువాత అది అంత నిగనిగలాడుతూ ఉంటుంది. పనివాళ్ళుకూడ చాల తెలివితేటలుగా రంగు పూసేవారు.

ఒకనాడు మానాయనమ్మ పనివారితో [redacted] పూయించుతూ ఉన్న సమయంలో మా [illegible] [redacted]

వచ్చింది. నేను ఆ చుట్టపుఆవిడను నాయనమ్మ ఉన్నచోటికి తీసికొని వెళ్లాను. వారిద్దరు కుశలం అడిగినతరువాత పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. ఆ వచ్చినచుట్టం పనివారితో చేయిస్తున్నపనిని పదేపదే మెచ్చుకొంది. మా నాయనమ్మ ఆ మాటలకు కృతజ్ఞత చెప్పి "మేము బ్రతికిఉండగానే ఈ ఏర్పాట్లన్నీ జరుగుతుండడం చాల సంతోషం. చచ్చిన తర్వాత ఎలాజరుగుతుందో ఎవరు చూడవచ్చారు. మన జీవితంలో చేయవలసినపనులు అనేక మున్నాయి. కన్‌ఫ్యూసియస్‌ను చావంటే ఏమిటని అడిగారట. ఆయన నాకు జీవితమంటే ఇంకా అర్థంకాలేదు. చావంటే ఏం తెలుస్తుంది? అన్నాడట. మన మంతాకూడా అంతే అనుకుంటాము. చావు ఎవ్వరు తప్పించుకోలేని సంగతి. విశ్రాంతి అంటే ఎరుగని యీ జీవితానికి చావే చక్కని విశ్రాంతి. మా కుఱ్ఱవాళ్ళు ఈ శవపేటికలు చేయించా లన్నప్పుడు మావంటిసంసారులకు ఇది పనికిరాదని చెప్పాను. విలువగల కాలాన్నంతా యీ పనిలో గడపడం వృథా అని అన్నాను. వాళ్ళు విన్నారుకారు. అనుకున్నంతా చేశారు. ప్రతిసంవత్సరం ఇదొక పెద్దబెడద అయిపోయింది నాకు" అంటూ ఆమెతో విసుగుగా చెప్పింది.

ఈ సమయంలో నేను "నాయనమ్మా! మంచిపనే చేశారని నువ్వేగా అన్నావు" అంటూ ప్రవేశించాను. "పెద్దవాళ్ళు మాట్లాడుకొనేచోటికి నువ్వెందుకు పో" అని పెద్ద కేక వేసి నన్ను పంపివేసింది మా నాయనమ్మ. వారిద్దరు

ఏమి మాట్లాడుకున్నారో నాకు తెలియదుగాని ఆ చుట్టపు ఆవిడ విచారంతో వెళ్లిందనిమాత్రం విన్నాను.

ఇంతకూ ఆవిడ ఎవరంటారా? ఆమె మా నాయనమ్మకు పెదతండ్రి కూతురు. నేను ఆవిడను 'కూ-పో-పో' అని పిలిచేవాణ్ణి. ఆమెకు ఒక్కడే ఒక్క కొడుకు. చాల భక్తిశ్రద్ధలు కలవాడు. పాప మాఒక్కకొడుకూ ఆ క్రిందటి ఏడే చనిపోయాడు. మా నాయనమ్మ ఈ సందర్భంలో ఆ విషయం జ్ఞాపకంచేసి ఆమెకు దుఃఖం కలిగించాలని అనుకోలేదు. ఈ శవపేటికలనుగురించిన సంభాషణ మార్చివేయాలని ప్రయత్నించింది. కాని మానవస్వభావం ఎటువంటిదంటే కాస్తపోలిక దొరికితేచాలు వెంటనే దానిమీదికే పోతుంది ఆలోచనఅంతా. మా చుట్టపు ఆవిడకుకూడా అంతేగా. తనకొడుకే బ్రతికిఉంటే తనకుకూడా ఇంత భక్తిశ్రద్ధలతో సేవచేసేవాడుగదా అని తలచుకొని కళ్ళనీళ్ళు కార్చింది. సంపదఉన్నా ఆమెమనసుకు తృప్తి లేదు. తమను కన్న తలిదండ్రులయెడ భక్తిపూర్వకంగా ఇటువంటివి కుమారులు చేయించే ఆచారం ఉన్నది. ఆమె తనకున్నడబ్బుతో ఎన్నయినా కొనగలదు. ఏమయినా చేయించగలదు. కాని పుత్రుడుచేయించినదానిలోఉన్నప్రేమ, భక్తి ఎక్కడనుంచి వస్తాయిగనుక! తన కొడుకే బ్రతికిఉండి తక్కువరకం కట్టతోచేయించినా ఆభక్తి, గౌరవంవేరుగదా!

మా జాతి అంతటిలో ఒక విచిత్రమయిన అభిప్రాయమేమిటంటే రక్తసంబంధంగల వ్యక్తులు చేసినదానికి

ఎక్కువ విలువ ఇస్తాము. మనవారు అన్నవాళ్ళు చేసేపనులు చూసి మనము ఎక్కువ సంతోషిస్తాము. ఇది మా జాతి స్వభావం. పశ్చిమదేశాలలో దీనికి భిన్నంగా కొన్ని కనుపించినా చాలమటుకు ఇటువంటి నమ్మకమే వారికికూడా ఉన్నట్లు నేను కనిపెట్టాను.

పెద్దవాళ్ళు మాట్లాడుకొంటూ ఉండగా నేను వెళ్ళడంతప్పు. నేను ప్రవేశిస్తూ అన్నమాటమాత్రం నిజము. కాని అంతకుముందు మానాయనమ్మ నాతో మా పెద తండ్రులు, పినతండ్రులు 'సూజెన్' అడవినుంచి శ్రమతో కట్టెతేవడంగురించి ఎంతోగొప్పగా చెప్పింది. తల్లిదండ్రులంటే అంతగౌరవం చూపించాలి. చూడు వారే నీకు ఆదర్శం అని చెప్పింది. "నీవయసులో నీకు తెలియదుగాని తల్లీ తండ్రీ పిల్లలను పెంచడంలో ఎన్నిశ్రమలు పడతారో తెలుసా? అంటూ, పిల్లలు తమ తలిదండ్రులు చెప్పినమాట వినరు. పెద్దవారయినతర్వాత చిన్నప్పుడు మా నాన్న, అమ్మ నా బాగుకోసమేకదా ఇదంతాచేసినదని గ్రహించి వాళ్లంటే గౌరవం చూపిస్తారు. చిన్నతనంలో పిల్లల బాగుఓగులు చూడడం తల్లిదండ్రులపని. పెరిగి పెద్దవారయిన తర్వాత ముసలి తలిదండ్రులను పోషించడం, వారికి సేవ చేయడం కొడుకులవిధి. ఇది జీవితం." అని నాకుబోధించింది. మా పెదతండ్రులు, పినతండ్రులు ముసలి వాళ్ళయందు చూపించిన గౌరవాన్ని మరీమరీ పొగిడింది. "నేనుకూడా నా తలిదండ్రులకు అలాగేచేస్తా" నని అన్నాను, ఆమె చిరునవ్వు నవ్వింది,

కాని వాస్తవానికి మాతల్లి చనిపోయి చాలరోజు లయింది. మా తండ్రికూడా నేను చాల చిన్నవాడనయి ఉండగానే యాభై రెండేళ్ళ వయసులో పోయాడు. నాకోరిక చెల్లించుకొనే అవకాశమే లేదు. కాని కాలం మారిపోయిన కారణాన మానాయనమ్మ అనుకున్నంత ప్రాముఖ్యం నా తలి దండ్రులు ఈ శవపేటికలకు ఇచ్చేవారు కాదేమో.

కొంతకాలానికి ఆచారం మారిపోవచ్చు. కాని మానవుని అంతఃకరణలు మారిపోవు. నా తలిదండ్రులేఉంటే వారికి చైనాసంప్రదాయం అనుసరించి వారికి నేను మిక్కిలి భక్తితో సేవచేసేవాడనే!



విసనకఱ్ఱలు అమ్మేవాడు

# 5. చీకాకుపెట్టే జుట్టు

చిన్నతనంలో నా జుట్టు చాలా చీకాకు పెడుతూ ఉండేది. ఆ జుట్టు దువ్వించుకోనేందుకు మా అమ్మదగ్గరకో, దాదిదగ్గరకో వెళ్ళేవాణ్ణి. మా అమ్మ పక్షవాతం వచ్చి ఎప్పుడూ మంచంలోనేపడి ఉండేది. దాది నా జుట్టు దువ్వి జడవేసే పద్ధతి ఆమెకు నచ్చేదికాదు. ఆమెకు వీలయినప్పుడల్లా ఆమే నాకు జడవేసేది. మంచంలో ఉన్నా జడలు వేయడంలో మా అమ్మకు ఇప్పటి నాజూకుతనం తెలిసి ఉండేది. మా దాది లూ పర్వతానికి అవతలివైపున ఉన్న 'సింట్జూ' జిల్లానుంచి వచ్చింది. కియాకియాంగ్ ప్రజలు ఆ జిల్లావారికంటె నాగరకులు. కియాంగ్‌సీ రాష్ట్రానికి మొదటిలో ఉండడమేగాక, అనేక శతాబ్దాలపాటు నాగరకత గలిగినజిల్లా మాది. పెకింగ్ (ఇప్పటిపేరు పీపింగ్) నుంచి క్రొత్తమాదిరీలు నాన్కింగు, షాంగ్‌హై మొదలయినపట్టణాల నుంచి దుస్తులు, జుట్టు వీనిలో వచ్చిన క్రొత్త అందచందాలు కియాకియాంగ్‌కు వచ్చాయి. ఇక్కడనుంచే కియాంగ్‌సీ రాష్ట్రం లోపలిభాగాలకు ప్రాకాయి.

మా దాది వచ్చిన సింట్జూ పెద్దజిల్లాకాదు. అక్కడి ప్రజలు ధనవంతులు కారు. అంతా వ్యవసాయదారులు. కాకపోతే పింగాణిపనివారు. నిరాడంబరులు, అమాయకులు. క్రొత్త అందచందాలంటే వారికి గిట్టదు. స్త్రీలలో చాల మంది మా పట్టణంలోని కుటుంబాలల్లో పనిచేసేవారు.

మా దాది కూడా అటువంటివారిలో ఒకతె. ఇరువది సంవత్స రాలుగా మా యింటిలో పనిచేస్తూ ఇంటా బయటా నాగరకు లయిన ప్రజలతో పరిచయమున్నా, ఆకాలపు అందచందాలు చూస్తున్నా, ఆమెదారి ఆమెదే కాని వాటిని అనుకరించేది కాదు. అందువల్లనే ఆమెను తేలికగా గుర్తించడానికి వీలు పడేది కూడా. మా యింటిలో చాలకాలం పనిచేసి గౌరవం సంపాదించిన కారణంగా మేము పిల్లలం ఆమెను వింతగా చూచినా, ఆమె ముఖంముందు ఏమీ అనేవాళ్ళంకాదు. నవ్వేవాళ్ళంకూడా కాదు.

చైనాలో పిల్లపుట్టిన కొద్ది నెలలుతర్వాత పుట్టినప్పు డున్న మొత్తనిజుట్టుకాస్తా తీసివేయడం అలవాటు. అలా చెయ్యడంవల్ల జుట్టు ఒత్తుగా, నల్లగా పెరగడమే కాక తరువాత రాలిపోకుండా ఉంటుందని ప్రజల నమ్మకం. తరువాత జుట్టు కత్తిరించేటప్పుడు నుదుటిమీదగాని, మెడ మీది భాగంలోగాని జుట్టు ఉంచడం అలవాటు. రెండు చెవులమీద గుప్పెడేసి జుట్టు ఉంచడం, లేదా ముందుకొంత, వెనుక కొంత మిగల్చడంకూడా కద్దు. ఇంకొక అలవాటు ఏమిటంటే తల చుట్టూ జుట్టువుంచి మధ్యభాగంలో తీసి వేయడం. మగపిల్లలకు ఒకటి రెండు గుప్పిళ్ళు ఉంచడం అలవాటు. ఆడపిల్లల విషయంలో రీతులు అనేకంగా ఉండేవి.

ఏ కారణంవల్లనయితేనేం నాకు మూడుచోట్ల మూడు గుప్పిళ్ళు జుట్టు ఉంచారు. రెండు చెవులమీదా రెండు, మెడ వెనుక ఒకటి మొత్తం మూడుచోట్ల జడవేయడానికి వీలుగా

జుట్టు పెంచారు. ప్రతిఉదయం నాకు జుట్టుదువ్వి జడచుట్టడం ఒక పెద్దపనిగా ఉండేది. రంగురంగు పీలికలతో అలంకరించే వారు గనుక ఆ జడలు అందంగానే కనిపించేవేమోకాని నాకు ఏమి ప్రయోజనం ? ఈ యాతన తప్పించుకోవడానికి నేను అప్పుడప్పుడు పారిపోతూఉండేవాణ్ణి. నాకు ఇప్పటికీ జ్ఞాపకం. మా అమ్మ నేను పారిపోతూ ఉండగా పట్టుకొని లెంపకాయ కొట్టింది.

ఇప్పటికీ నా జుట్టుదువ్వుకొనేవేళ ఆ సంగతి జ్ఞాపకం వచ్చి మా అమ్మచెప్పినమాట వినకపోతినిగదా అనిపిస్తుంది. కాని నేను పెద్దవాడనయి నన్ను కష్టపడి పెంచినదానికి కృతజ్ఞతగా ఆమెకు సౌఖ్యం కలిగించడానికి నేనుప్రయత్నించే లోగానే ఆమె నాకు కరవైపోయింది. ఆమె రూపంకూడా నాకు ఇప్పుడు స్పష్టంగా తెలియదు.

నా జుట్టువిషయం ఇంతగాజ్ఞాపకంరావడానికి కారణం మేముచిన్నతనంలో ఆడుకొన్న ఆటలుకూడాను. పెద్దవాళ్ళను చూచి చిన్నవాళ్లము మేము చాలా ఆటలు నేర్చుకున్నాము. మగపిల్లలఆటలు వేరు. ఆడపిల్లలఆటలు వేరు. ఒక్కొక్కప్పుడు అందరంకలసికూడా ఆడుకొనేవాళ్ళం. మా ఆటలకు పెద్దగా ఏమికావలసిఉండేవి కావు. పాతపాటలు పాడుకుంటూ కాలు చేతులు ఆడించుతూ ఆడేవే చాల ఆటలుండేవి. మా పెద్ద వాళ్లు ఇటువంటి ఆటలు ఆడనిచ్చేవారు కారు. కాని మాలో పెద్దపిల్లలు ప్రక్కఇంటిపిల్లల సహవాసంచేసి నేర్చుకొనివచ్చి మాకు నేర్పేవారు. మా యింటిలో పరుగెత్తి

ఆడుకోవడానికి కావలసినంత చోటు ఉండేది. నాకుఇష్టమయిన ఆటలలో గుఱ్ఱపుఆట ఒకటి.

ఈ ఆటలో నాగుఱ్ఱమేమిటో తెలుసా! ఒక చిన్న వెదురుకఱ్ఱ. ఒక అంగుళం లావు, రెండుమూడు గజాలు పొడుగుఉన్నకఱ్ఱ ఉంటేచాలు. నావయసుపిల్లలకంటె నేను చాలపీలగా ఉండేవాణ్ణి కనుక ఇంకా చిన్నకఱ్ఱతోనే నా ఆట. ఆ వెదురుకఱ్ఱ కాళ్లసందుగా పోనిచ్చి ఒకచేతితో కఱ్ఱపట్టుకుని ఇంకొకచేతితో దాన్ని తోలుతున్నట్లు చప్పుడు చెయ్యడం. ఛల్, ఛల్ అని అరవడం – ఇది గుఱ్ఱపుఆట. ఇలా మేము నలుగురు పిల్లలుచేరి గుఱ్ఱాలాట ఆడుతున్నామంటే నిజంగా ఒక గుఱ్ఱపుదళం యుద్ధానికి వెళుతున్నంత శబ్దం అయి పెద్దవాళ్లువచ్చి చూచేవారు. మా పెద్దవాళ్లు మేము ఈగుఱ్ఱా లాట ఆడుకొనేందుకు గుఱ్ఱపుతలలు కాగితాలతో చేసినవి ఇచ్చేవాళ్లే! మానాన్న ఒక వడ్రంగిని పిలిపించి పది గుఱ్ఱపు తలలుచేయుమని పురమాయించాడు. కాని ఆతలలు గుఱ్ఱపు తలలని తోచేటట్టు తయారుకాలేదు. కాని ఇంతకంటె నిజంగా ఉండే సవారిఆట ఇంకొకటి మేము ఆడుకొనే వాళ్లము. ఆ ఆట మా అయిదో తమ్ముడు కనిపెట్టిందికాదు; కాని నేర్చుకున్నది. వాడు దీన్ని ఎక్కడో చూచిగాని, వినిగాని ఉంటాడు. ఆ ఆట ఎలా ఆడేవాళ్లమనుకున్నారు! నాకు మూడుజడలుఉన్నాయని చెప్పానుగా. నేను గుఱ్ఱపు తల, ముందు కాళ్లు. నా వెనుక ఇంకొక కుఱ్ఱవాడు నుంచుని నావీపుమీదకు తలవచ్చేటట్లుగా వంగి చేతులతో నాబుజాలు గట్టిగా పట్టుకొనేవాడు. మా అయిదవ తమ్ముడు గుఱ్ఱంమీాద

ఎక్కి స్వారిచేస్తూ ఉండేవాడు. నా తలమీదఉన్న పిలకకు త్రాడుకట్టి అది గుఱ్ఱపుకళ్లెమని ఆడేవాడు. నా చెవులమీద ఉన్న జడలు రెండూ గుఱ్ఱపుచెవులని ఆడుకొనేవాళ్ళం. స్వారిచేసేవానికి సుఖమే, కాని గుఱ్ఱంగా ఉన్నవానికి ఏమీ సుఖంలేదు. నా కర్మమేమిటో నేను ఎప్పుడూ గుఱ్ఱాన్నే! వెనుకభాగం, స్వారిచేసేవారు మారుతూ ఉండేవారు. స్వారి చేసేవా డెప్పుడూ గుఱ్ఱాన్నిలాగి పరుగెత్తకపోతే కొడుతూ ఉండేవాడు, కాబట్టి నేను ఈ ఆటనెక్కువగా మెచ్చుకోలేదు.

మా పినతండ్రులలో ఒకాయన ఈ ఆటను మానివేయు మని చెప్పారు. నా మీది ప్రేమచేతకాదు. వాళ్ళ అబ్బాయి గుఱ్ఱంమీదనుంచి పడిపోతే దెబ్బతగులుతుందట. ఇప్పుడు నే నీ పుస్తకంవ్రాసే సమయంలోకూడా నా జుట్టు పట్టుకు లాగుతున్నట్లే అనిపించి అనుకోకుండానే నా చేయి తల వెనుకకు వెళ్లిపోతుంది.

మా అమ్మ చచ్చిపోయినతర్వాత మా అక్కయ్యే నాకు జడ వేసేది. నాజుట్టు పెరిగి పెద్దదయింది. ఏడు సంవత్స రాలు వచ్చేసరికి మూడు చిన్నజడలూ కలసి వెనుక ఒకే ఒక జడగా తయారయినాయి. తరువాత రెండు సంవత్సరాలకే చైనాలో విప్లవం వచ్చింది. మంచూ వంశాన్ని అంతంచేసే ఉద్యమం కియూ కియంగ్ వఆకూ వచ్చింది. మా కుటుంబంలో పెద్దలు పెద్ద కొట్లాటలు, యుద్ధాలు తప్పవని భయపడి ముసలివాళ్లను, ఆడవాళ్ళను, పిల్లలను, మా మూడవ పెదతండ్రిని, గ్రామాలకు పంపి

వేయాలని నిశ్చయించారు. సాధారణంగా పదిసంవత్సరాలు నిండితేగాని మా కుటుంబంలో పిల్లలను ఊరు వదలి బయటికి తీసుకొని వెళ్ళరు. కాని యీ ప్రమాదపరిస్థితిలో తొమ్మిదవ యేటనే ఇంటినుంచి కదపవలసివచ్చింది. గ్రామాలలో మాకు ఇళ్ళు ఎక్కడున్నాయి ? కాని మా పొలాలు సేద్యంచేసే రైతులే పొలాలలో ఉన్న ఒక పెద్దయిల్లు ఖాళీచేసి మాకు ఇచ్చారు. మాలో కొందరు అక్కడినుంచి ప్రక్కనే ఉన్న మా యింకొక భూమిలోని ఇంటికికూడా పోవలసివచ్చింది. లూ పర్వతపు దిగువభాగంలో ఉన్నవారితో నేను ఉండి పోయినాను. గ్రామంలో జీవితం ఎలాఉంటుందో తెలుసుకోవడానికి ఇదే మొదలు. అప్పటినుంచి నేను ప్రకృతిని ఆనందింపగలిగాను.

విప్లవం దేనికిగాను వచ్చిందో నాకు తెలియదు కాని పిల్లలమంతా ఒకందుకుమాత్రం సంతోషించాము. పెద్దలు, పిన్నలు, మగవాళ్ళంతా తమ జడలు కత్తిరించివేసుకోవాలని ప్రకటించారు. ఆ మాట విని మేము ఎంతో ఆనందించాము. ఒక మంగలిని కేకవేసి మా పిల్లలందరికి జుట్టు కత్తిరించి వేయడానికి ఏర్పాటు జరిగింది. ఈ ఉత్సవ సమయానికి, ఎక్కడ సంపాదించిందోగాని, మా నాయనమ్మ కొన్ని టపాకాయలుకూడా తెచ్చింది. అప్పుడు మేము విందు కూడా చేసుకున్నాము. జడ కత్తిరించివేసినతర్వాత నాముఖం అద్దంలో చూచుకున్నాను. నాకే నవ్వుపుట్టించేటట్లుగా ఉన్నా నాకు ప్రతిరోజూ ఒక అరగంట బాధతగ్గిందిగదా అని విప్లవంపేరు చెప్పుకుంటూ ఉంటాను.

మేమేకాదు. పట్టణం నాలుగు గోడలమధ్య ఉన్న వారంతా జడలు కత్తిరించుకున్నారని విన్నాం. లేకపోతే విప్లవవీరులు సిద్ధంగాఉన్నారని, వారువచ్చి జడలుకత్తిరించి వేస్తున్నారని చెప్పారు. పట్టణంలోకి ప్రవేశించే ద్వారాలవద్ద ప్రత్యేకంగా నౌకరులను ఏర్పాటుచేశారు. గ్రామాలనుంచి పట్టణానికి వచ్చేవారందరికి జడలుకత్తిరించి పంపడంవారిపని.

ఆ సమయంలో మా రైతులు కట్టెలమ్ముకోవడానికి పట్టణంలోనికి వెళ్ళేవారు. వారుకూడా జడలు కత్తిరించి వేసుకొన్నారు. సున్ షిన్ అనే ఒకరైతు పూర్వాచారాలంటే ఎక్కువ నమ్మకమున్నవాడు. ప్రతిరోజు ఉదయం పట్టణానికి వెళ్ళే పనిఉండేది. జడలు కత్తిరిస్తున్నారని విని పట్టణానికి వెళ్ళడం మానివేశాడు. క్రొత్తప్రభుత్వం వచ్చిన మొదటి రోజుల్లో పట్టణానికి వెళ్లాడు. జడ కత్తిరించారు. ఎక్కువ విచారంతో జడ చేతితోపుచ్చుకొని ఇంటికి తిరిగి వచ్చాడు. మేమంతా అతణ్ణిచూచి ఎంతోనవ్వాము. జుట్టు బాధ వదలినందుకు విచారమెందుకని నేను ప్రశ్నించాను. దానికి అతడన్నాడుగదా! కన్ ఫ్యూసియస్ తన శిష్యుడైన ట్సెంగ్ ట్జుతో 'తలిదండ్రులు ప్రసాదించిన శరీరం, జుట్టు. అవి జాగ్రత్తగా కాపాడుకోవాలి. లేకపోతే తలిదండ్రుల యెడ శ్రద్ధాభక్తులు చూపనట్లవుతుంది' అని చెప్పాడట! సున్ షిన్‌కు చదువురాదు. కాని రోజూ మా సంభాషణలలో కన్ ఫ్యూసియస్ చెప్పినమాటలు మేము చెప్పగా విని వాటిని శ్రద్ధగా ఆచరించేవాడు. మా నాయనమ్మ మాట్లాడితే

కన్ఫ్యూసియస్ వాక్యాలు చెప్పుతూ ఉండడం నేనుకూడా విన్నాను. మా తాతయ్య సున్‌షిన్‌తో ఈ జడలవృత్తాంతం చెప్పుకొచ్చాడు. మంచూ వంశంలో మొట్టమొదటి చక్రవర్తి తొలిసారిగా చైనావారిలో యీ జడలువేసుకొనే ఆచారం ప్రవేశపెట్టాడు. ఈ జడ అందవికారంగా ఉండి చైనాప్రజలను హింసించి బానిసలుగా చూడడానికే ఆ రాజులు ఉపయోగించారు. ఈ జడలు పోయినందుకు సంతోషించవలసినదేనని మా తాతయ్య అన్నాడు. ఒకవేళ జడలే ఉండాలనుకొన్నా, అవి వ్రేలాడుతూ ఉండడం చైనా ఆచారంకాదని మింగ్‌వంశంవారి ఆచారప్రకారము మెడకు పైగా వాటిని చుట్టివేయడం మంచి ఆచారమని అన్నాడు. ఆ రైతు మా తాతయ్య చెప్పిన తెలివయిన సమాధానానికి సంతోషించి వెళ్ళిపోయాడు. మా తాతయ్య అప్పుడు చెప్పిన మాటలకు నేను ఏమనుకున్నానో జ్ఞాపకంలేదు. కాని మంచూ వంశంలోని 'చియెన్‌లుంగ్' అనే చక్రవర్తియే జడలు వ్రేలాడుతూ ఉండడానికి ఇష్టపడనట్లు ఆధారం ఉన్నది. ఆరాజు ఆస్థానంలో ఉన్న చిత్రకారులు రాజుగారి బొమ్మలు వ్రాసి వాటిలో ఆయనజుట్టు మింగ్‌వంశాచారప్రకారము చుట్టుకొన్నట్లు వేశారు. మా నాయన కూడా చిత్రాలలో ఎవరూ జడలు వ్రేలాడుతున్నట్లు వేయరని, అలావ్రాసినవారిని ఉత్తమ చిత్రకారులుగా ఎంచరనీ చెపుతూవచ్చాడు. మా పూర్వుల చిత్రాలన్నీ కూడా పూర్తిముఖాలతో చిత్రించబడ్డాయి. చిత్రకారులు ఈ విధంగా అభిమానం చూపించి ఉంటారు.

నాకు ఈ జుట్టు చాల బాధాకరంగా కనిపించితే, మా అక్క, బంధువుల ఆడపిల్లలు జడ వేసుకోవడానికే కొన్ని గంటలు పట్టేదంటే ఆశ్చర్యంలేదు. నేను అక్కడికీ మా బంధువులనే అడిగాను ' జుట్టుదువ్వి అలంకారం చేసుకోవడం బాధగాలేదా ?' అని. అది బాధకాదని, చక్కగా దువ్వి అందంగా అలంకరించుకోవడం చాల సంతోషమని మాఅక్క జవాబిచ్చింది. మా అక్క తనజుట్టుకు మెరుగుపెట్టడానికి అదొక రకము, నూనెవంటి పదార్థం తయారుచేసేది. అలా తయారుచెయ్యడానికి నీళ్లు తెమ్మని నన్ను పంపేది. ఏవో కొన్ని చెట్ల బెరళ్లు నీటిలో కొంతసేపు నానవేసి నూనెవంటి పదార్థము తయారుచేసేది. తలకట్టు చిక్కుతీసి దువ్వుకొన్న తర్వాత యీ నూనె పట్టించి మళ్ళా దువ్వేది. ఆ తర్వాత అప్పటి అందాల ప్రకారం జడ వేసుకొనేది. నేనింకాకుఱ్ఱవాణ్ణి కావడంచేతను జడల అందాలు నాకు అంతగా తెలియవు.

ఆ రోజులలో ఇంటింటికీ వచ్చి జడల అందచందాలు తీర్చి దిద్దిపోయే ఆడవారు ఉండేవారు. మగవారికి, మగపిల్ల లకు నెలకొకమాటో, రెండుసార్లో, జుట్టు కత్తిరించడానికి మంగలి వచ్చేవాడు. ప్రత్యేకసమయాల్లో మాత్రం పై చెప్పిన ఆడవారు వచ్చేవారు.

మా అక్క తయారుచేసే నూనె జుత్తుకు నిగనిగ కలిగించి నల్లగా ఉండేటట్లు చేస్తుందట. ఆడవారికి నల్లని జుట్టు అందం. , అందుచేతనే వారు జుట్టువిషయంలో అంత శ్రద్ధ చూపుతారు. చెట్టు బెరళ్ళతో, మూలికలతో నూనెలు

తయారుచేసుకొనేవారు. మా కుటుంబంలోని స్త్రీలు టీ గింజల నూనెకూడా జుట్టుకు రాసేవారు.

మా ఇంటి కెవరయినా బంధువుల ఆడపిల్లలు వస్తే మా అక్క, వారంతా ఎవరిజుట్టు నల్లగాఉందో, బారుగా ఉందో పోటీలుపడి చూడడం నాకు ఆశ్చర్యంకలిగించేది. దానికి కారణం నాకు ఇప్పటికి తెలిసివచ్చింది. మా కవులంతా పెద్దజడకట్టు మెచ్చుకొన్నారు. కాబట్టి అందానికి ముఖ్యమయినది బారయినజుట్టని భావింపబడుతూ వచ్చింది స్త్రీలు తమజుట్టు బారుగాలేనప్పుడు సవరాలు పెట్టుకొని జడచుట్టలు చుట్టుకొనేవారు. జుట్టు రాలిపోకుండా ఎన్నో జాగ్రతలుపడేవారు. జుట్టు కత్తిరించుకోవడం గురించిన ఆలోచనలు మా స్త్రీలకు లేనేలేవు. అది అందంగా వారు అనుకొనేలేదు.

మా అక్కకు పదిహేనుసంవత్సరాలు వచ్చాయి. అందుచేత జడలు మానివేసి చుట్ట చుట్టుకొమ్మని మా నాయనమ్మ మా అక్కయ్యతో చెప్పింది. "ఇంక చిన్నతనం పనికిరాదు" అన్నది. అలా అనడంలో చాల అర్థముంది. మా వంటి పిల్లలతో ఆడడం మానివేసింది. ఇంట్లో ఆమెకు ఒక క్రొత్తగౌరవం వచ్చింది. ఇదంతా మా అక్కకు వింతగా తోచి ఉంటుంది.

కియూ కియాంగ్‌లో అమెరికా మిషనరీలు పెట్టిన బాలికా పాఠశాలలో మా అక్క చదువుకుంటున్న మా కుటుంబంలోకల్లా చదువుకొన్న స్త్రీ మా అక్క

ఒక్కతే. అయినప్పటికీ బడికిపోని సమయాల్లో ఆమె ఇల్లు కదిలివచ్చేది కాదు. మాతో ఆడుకోవడానికి కూడా వచ్చేది కాదు. మా నాయనమ్మ మాటప్రకారం మొట్టమొదటి సారిగా జడలు చుట్టుకొని వచ్చినప్పుడు ఆమెలో క్రొత్త భావం తోచింది. ఆ రూపంలో వచ్చి మా అక్క పెద్దవారి ఎదుట కనపడేదికాదు. ఎందుకంటే వారంతా "పెద్దదానవైనావు. పెళ్ళిచేసుకొని పిల్లలను కనాలి" అంటారు.

నాతోకూడా మా అక్క పెద్దవాళ్ళు మాట్లాడినట్లు మాట్లాడేది. నాకు కొంచెం కోపంగానే ఉండేది. కాని ఇదివరకు కంటే ఇప్పుడు ఆమెకు నాపై అధికారం ఉందని గ్రహించాను. ఈ మార్పంతా జుట్టు తెచ్చిపెట్టిన బెడదయే.



చున్‌యా ఆకులు (టీలో కలుపుకొనే ఒకరకం ఆకులు)

# 6. తొందరపడితే లాభంలేదు

నాకు కళలంటే అంత అభిమానం, బొమ్మలుగీయడ మంటే అంతఇష్టం కలిగించినది నాచిన్ననాడు నేపెరిగిన వాతావరణమే అనుకుంటాను. ఈ అభిమానం నాకు నా పెద్దలనుంచి వంశపారంపర్యంగా వచ్చిన దనలేను. మా అన్న కవిత్వం వ్రాసేవాడుకాని ఎన్నడూ ఒకగీతైనా గీసి ఎఱుగడు. చిత్రకళను చూచి మెచ్చుకొనేవాడంతే. మా అక్క దస్తూరికూడా ఏమీబాగుండదు. ఆమె ఎప్పుడో గాని వ్రాసేదికాదు.

నేను బొమ్మలువేయడానికి మనసార ప్రయత్నించింది నా పన్నెండవయేటనే. అంతకు ముందల్లా మానాన్న బొమ్మలు వేసుకుంటూఉంటే ఆగదిలోవెళ్ళి నిలుచోవడమే నాపని. ఆయనకు ఆ ఇరుకుగదిలో కూచోవడమే ఇష్టము. ఎందుకంటే ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు బొమ్మలు వేసికో వచ్చు. మానాన్న ఎప్పుడూ మాఅమ్మనువిడిచి ఉండేవాడు కాడు. ఆమె చనిపోతే ఆయన విచారానికి అంతేముంటుంది? కాని రెండే రెండు ఆయనకు ఓదార్పు కలిగించగలిగాయి. ఒకటి సారా, ఇంకొకటి ఈ చిత్రకళ.

మా నాన్నగది ఎంతశుభ్రంగా ఉండేదో చెప్పలేను. గోడలమీద ప్రసిద్ధచిత్రకారులు చిత్రించిన ఒకటి రెండు చిత్రాలు ఉండేవి. అవికూడా తరుచు మారుస్తూఉండేవాడు. తన చిత్రాలు ఎప్పుడోగాని గోడకు తగిలించేవాడు కాడు.

ఆ గదిలో ఒక అరలబీరువాలో చాల బొమ్మలు, బొమ్మల పుస్తకాలు ఉండేవి. మా నాయనకు పూలు – పిట్టలు అంటే ఎక్కువఇష్టం. వాటికి సంబంధించిన బొమ్మలు, పుస్తకాలే ఆయన చాలా సంపాదించిపెట్టాడు. ఈ బొమ్మలు, పుస్తకాలు నాకు ప్రకృతిలాగానే అనిపించేవి. పూలన్నీ చిరునవ్వులతో నన్ను చూస్తూఉన్నట్లు, బొమ్మలలో కొమ్మలమీద కూర్చున్న పిట్టలు తీయనిపాటలు పాడుతున్నట్లు ఊహించుకొనేవాణ్ణి. నాకు విసుగుదల వచ్చినప్పుడల్లా మా నాన్న గదిలోకివెళ్ళి ఆ బొమ్మలన్నీ ఒకసారి చూచేవాణ్ణి. నాకు ఎనిమిదేళ్ళప్పుడు ఒకసారి నేను మా నాన్న గదిలో బొమ్మలుచూస్తూ ఉన్నాను. మా నాన్న గదిబయటనుంచి కిటికీగుండా నన్నుచూచాడు కాబోలు. నేను కొంతసేపటికి తలఎత్తి చూస్తినిగదా కిటికీదగ్గర మానాన్న ఉన్నాడు. ఏమిటి చూస్తున్నావన్నట్లుగా నవ్వుతూ ఆయన వచ్చాడు.

అప్పటినుంచీ మానాన్న ఏవయినా బొమ్మలు చిత్రించేటప్పుడు నన్నువచ్చి ప్రక్కన నిలుచోమని పిలిచేవాడు. నేను ఆయన ప్రక్కనుండి ఒక సంగతి కనిపెట్టాను. ఆయన తన కుంచెతో కాగితముమీద చిత్రించే ముందు చాలా ఆలోచించేవాడు. ఒక్కొక్కసారి చాల సేపు ఆలోచించికూడా ఏమీ చిత్రించేవాడేకాదు. ఆయన మానివేసినతరువాత ఆ కుంచె పుచ్చుకొని చిత్రించాలని కోరిక కలిగేది. నా కోరిక తెలిసికొని ఆయన కేకలువేయ లేదు; కాని బడిలో దస్తూరి బాగా అలవాటు చేసికో అని చెప్పేవాడు. మా వంశమువారికి ప్రత్యేకంగా బడి ఉండేదని

చెప్పానుగా. ఆ బడిపంతులుగారికి మా నాయన ఏమయినా చెప్పారుగాబోలు. ఆ పంతులుగారు నా చూచివ్రాత పుస్తకాలు మానాన్నకు చూపించుమని నాతో చెప్తుతూవచ్చారు.

ఆ రోజులలో మా నాయన నాకు రంగులతో బొమ్మలు వేయడం గురించి ప్రత్యేకంగా పాఠమేమీ చెప్పలేదు. నేను ఏదైనా గీస్తుంటే వెనకవైపే వచ్చిచూచి, 'ఇవన్నీ నేర్చుకోవడానికి పెద్దవాడవుకావాలి' అనేవాడు. అంతేగాని నా ప్రయత్నాన్ని నిరుత్సాహపరచేవాడు కాదు. ఆయన నాకు శ్రద్ధగా నేర్పినదేమిటంటే రంగులు తయారు చేయడం, కలపడం. మానాన్న వాడేరంగులన్నీ చూర్ణాలే. కాని వాటినింకా కల్వంలోనూరి గుడ్డలోనుంచి సన్న చూర్ణము, బరకనూక వేరుచేయడం, మళ్ళీ మళ్ళీ నూరడం చాల ముఖ్యమయిన పని. కాగితంమీద వేయడానికి గాని, పట్టుగుడ్డలమీద రంగులు పూయడానికిగాని మెత్తగా చూర్ణం చేయడం చాలఅవసరం. దీనికై మానాన్న ఒక చిన్న కల్వం ఏర్పాటు చేశాడు. మొదటిలో మానాన్న తన బల్లంతా తుడిచి రంగులు పెట్టెలలో పెట్టడం మొదలయిన చిన్నపనులే నాకు చెప్పేవాడు. తరువాత రంగులునూరడం, కలపడం ఇవన్నీ నేను చూచి నేర్చుకున్నాను. కుంచెతో రంగులు పూయడం మొదలుపెట్టేలోపలే రంగుల విషయమంతా నేను తెలుసుకొన్నాను.

అతి సున్నితంగా రంగులు వేయవలసివస్తే మా నాన్న ఆ చిత్రాన్ని ముందుగా కాగితంమీదో, సిల్కుగుడ్డ

మీాదో వేసేవాడు. ఇలా చిత్రంగీయడానికి మామూలుబొగ్గు ఉపయోగపడదు. దాన్ని వాడితే కాగితం, సిల్కు పాడయి పోతాయి.

రంగులువేయడం అయిపోయినతర్వాత తేలికగా గీసిన బొగ్గుగీతలు తుడిచివేయవచ్చు. మా అక్కయ్య యీ బొగ్గు పొడినే తన కనుబొమలకు రంగువేసేందుకుకూడా ఉపయోగించేది.

మా నాన్న చిత్రించిన చిత్రాలలో ప్రత్యేకత ఏమిటంటే పూలుచిత్రించి వాటితోపాటు సీతాకోకచిలుకలను చిత్రించేవాడు. పెద్ద నల్లని రెక్కలుగల సీతాకోకచిలుక, దాని రెక్కలమీాద ఒకటి రెండుచోట్ల ఎఱ్ఱనిచుక్కలు వేస్తూఉంటే చూడడానికి చాల అందంగా కనిపించేది. ప్రత్యేకమయిన పట్టుగుడ్డ ఒకటి కాల్చి దాని మసితో సీతాకోకచిలుక రెక్కలకు రంగువేసేవాడు. నల్లని నలుపురంగుతో నిగనిగలాడుతూ నిజంగా సీతాకోకచిలుక రెక్కలులాగ ఉండేవి.

రంగులు చిత్రించడం గురించి మా నాన్న నాకు ప్రత్యేకంగా పాఠాలేమీా చెప్పలేదు. కాని, ఆ యా రంగులు వేసేటప్పుడు దగ్గరఉండి చూడనిచ్చేవాడు. నాయిష్టము వచ్చిన బొమ్మ చిత్రించనిచ్చేవాడు. పిట్టలుగాని, పూలుగాని ఫలానాది చిత్రించుమనిగాని, ఇలా చిత్రించాలి, అలా చిత్రించాలి అని గాని నాకు నేర్పలేదు.

మా నాన్న రంగులువేస్తుండగా కొన్నిసార్లుచూచి నాకు రంగులువేయడం వచ్చిందని సంతోషించేవాణ్ణి. కాని

తీరాకూచుని రంగులు వేయబోయినప్పుడు నాకేమీ రాలేదని తెలిసేది. వేయడానికి ప్రయత్నించినపుడల్లా క్రొత్త క్రొత్త ఇబ్బందులు కన్పించేవి. సాయపడవలసిందని మా నాన్నను అడిగితే 'మళ్లీ జాగ్రత్తగాచూడు' అని చెప్పేవాడు. నేను ఎక్కడ తప్పినదీ చెప్పేవాడుకాదు. పన్నెండేళ్లు వచ్చేదాకా నా ప్రయత్నంలోని లోపాలు దిద్దడానికి ఆయన ప్రయత్నమే చెయ్యలేదు. అప్పటినుంచి నే నేదయినా గీసి చూపించితే మాత్రం దానిలో ఏభాగం నేనింకా శ్రద్ధగా పరిశీలించాలో చెప్పేవాడు. కాలం గడచినకొద్దీ నేను చేసేదేమిటో నాకు అర్థంకావడం, ఒక విషయాన్ని గురించి నేను ఏంచెయ్యాలో తెలిసివచ్చేది. కన్‌ఫ్యూసియస్ చెప్పినమాటలు మా నాయన చాలసార్లు చెపుతూవచ్చాడు. 'పెద్దమనిషి అయినవాడు ఒక తప్పు రెండుసార్లు చేయడు' అనీ, 'తప్పుని తెలిసిన తరువాత దాన్ని సరిదిద్దుకోవడానికి ప్రయత్నించాలి' అనీ చెప్పేవాడు. ఈ రెండు వాక్యాలు నాకు చాల గురిగా కన్పించి మా నాన్న రంగులు వేసేటప్పుడు ఎక్కువ శ్రద్ధగా పరిశీలించి అనేక విషయాలు నేర్చుకో గలిగాను.

ఒక పెద్ద శిల్పాన్ని సృష్టించడం – పెద్ద పెద్దవాళ్ళ శిల్పాలుచూడడంవల్లనూ, ఎవరయినా రంగులు వేస్తుంటే చూడడంవల్లనూ సాధ్యం అవుతుందని మానాన్న సిద్ధాంతం. పెద్దపనివారి పనితనంలో ఇమిడిక, రంగులుగురించి బాగా పరిశీలించి మనసుకు పట్టించుకోవడం చాల అవసరం. రంగులు వేయడం నేర్చుకొన్నతర్వాత చిత్రకారునిమనసు ప్రకృతిలో

నుంచి అనేక విషయాలు గ్రహిస్తుంది. కళనుగూర్చి ఊరికే మాట్లాడడం మానాయనకు ఇష్టంలేదు. పూర్వం చిత్రకళలో పేరుపొందినవారంతా తాము ఎలా చిత్రించినదీ చెప్పలేదు గదా! ఇంకొకరుమాత్రం దానిని వివరించి ఎలాచెప్ప గలరు ?

మా నాయన తనగురువును తానే కోరి తెచ్చు కొన్నాడు. ఆ గురువుగారి వింతపద్ధతులను గురించి మా నాయనమ్మ నాతో చెప్పింది. ఆయన పేరు 'వూ పెంగ్ హుయా'. ఆయన ఒకబౌద్ధదేవాలయంలో చిత్రాలు చిత్రించే సమయంలో మా నాయనచూచి ముగ్ధుడయి ఇంటికి పరుగెత్తివచ్చి ఆ గొప్ప చిత్రకారుణ్ణి తనకు గురువుగా నియమించుమని తలిదండ్రులను కోరాడు. వారు ఒప్పుకొన్నా, కొన్ని ప్రత్యేక సదుపాయాలు కలిగిస్తేగాని ఆయన మాయింటికివచ్చి ఉండలేదు. ఆయన పేదవాడయినా డబ్బు ప్రధానంగా చూచుకోలేదు. ఆయనకు కావలసింది పూర్తి స్వేచ్ఛ. అంటే మా కుటుంబంలోని పెద్దవారెవరికీ ఆయన వంగి సలాములు చేయబోడు. ఆయనకు భోజనం ఎప్పుడు కావలిస్తే అప్పుడు కావలసినవిధంగా ఏర్పాటుచెయ్యాలి. ఇటువంటి ప్రత్యేక సదుపాయాలు కలిగించి తేగాని రాలేదు. ఆ గురువుగారు మా యింటికి వచ్చాక, మా నాయన, మా తాత నాయనమ్మలతో కలసి భోజనంచేసి యెఱుగడు. గురువుగారంటే ఉన్నభక్తి తలిదండ్రులమీద కూడా మానాయనకు లేదని మా నాయనమ్మ చెప్పింది. గురువుగారు చిత్రాలు వేసినంతసేపు గంటల తరబడి ఆయనవెనుక నిలబడి

చూడడమే మానాయనపని. తలిదండ్రుల దగ్గర కొద్దిక్షణా లున్నా, ఏదోసాకు చెప్పివచ్చి మళ్లీ చిత్రాలు చూడడమేపని. 'షూ పెంగ్ హుయూ' గొప్ప చిత్రకారుడు. వ్యక్తుల చిత్రాలు చిత్రించడంలో నిధి. మాయింట్లో మాతాతయ్య, నాయనమ్మ, నాన్న, ఇంకా ఇతర కుటుంబపెద్దలు, వీరి చిత్రాలన్నీ చిత్రించబడి ఉన్నాయి. ఆయన పూలుకూడా చాలబాగా చిత్రించేవాడు.

మా నాయనకూడా ఆ గురువుగారి పద్ధతులు నాకు వర్ణించి చెప్పేవాడు. తన గురువుగారిని ఎన్నడూ ప్రశ్నించి ఎరుగనని చెప్పాడు. ఎందుకంటే – ప్రశ్నించి నట్టయితే గురువుగారు అమాంతం మీదబడి కొట్టేవాడు. శ్రద్ధగా ఎందుకు పరిశీలించడం లేదని గద్దించేవాడు. నా అదృష్టం కొద్దీ మా నాయన నన్ను కొట్టేవాడుకాదు. చిరునవ్వుతో శ్రద్ధగా పరిశీలించాలని చెప్పేవాడు. నేను ఒక్కొక్కప్పుడు ఒక చిత్రాన్ని తొందరగా పూర్తిచెయ్యాలని తొందర పడినా మానాన్న నాకు అడ్డుదగిలి తొందరపడి లాభంలేదని బోధించేవాడు. ఆ హితబోధ నేనెన్నటికి మరచిపోలేదు.

చిత్రకళలో నేను సాధించినది చెప్పుకోతగ్గది ఏమీ లేదు. ఏదయినా ఉంటే దానికి మా నాన్న వేసిన చక్కని పునాదులు, ఆయన చూపిన ఓపికయే కారణాలు.

మా నాయన ఈజీవితం సుఖంగా గడపాలని అనుకొనే వాడు. మా అమ్మ చనిపోవడంతో విచారంలో మునిగిపోయి,

జీవితమంతా ఆ విచారంతోనే గడిపి చివరకు ఆయన కూడా మరణించాడు. మా అమ్మ జబ్బుతో మంచానపడిన మూడు సంవత్సరాలు కూడా ఆయనే స్వయంగా ఆవిడకు సేవచేశాడు. ఆమె చిత్రానికి ఎదురుగా నిలబడి విచారంతో నిట్టూర్పు విడిచేవాడు. ఆమె చిత్రాన్ని మా నాయనే చిత్రించాడు. ఆయనకడుపున మేము ముగ్గురము కలిగాము. మమ్మ ఎక్కువగా ప్రేమించేవాడు. కాని మేము ముగ్గురం కూడా ఆయన విచారాన్ని మాన్పలేక పోయినాము. మా అమ్మ పోవడంతో ఆయన జీవితంలో సుఖమే పోయింది. నేను ఆయన మాటలు గ్రహించి ఆచరించానని తెలిపే లోపలే ఆయనకూడా మరణించారు.



చీపురుకట్టలు అమ్మేవాడు.

# 7. పండుగపనులు

సంవత్సరాది పండుగకు మా యింటిలో జరిగే పనుల సంగతి తలచుకుంటే అవి ఎంత పెద్దపెట్టున జరిగేవో ఆశ్చర్య మవుతుంది. చైనా సంవత్సరాది ఇంగ్లీషు సంవత్సరాదికి ఒక నెల తర్వాత వస్తుంది. చైనాలో 1912 విప్లవం తరువాతనే క్రొత్త సంవత్సరాది వాడుకలోకి వచ్చింది. సంవత్సరాది యింకా నెలరోజులు ఉందనగానే అన్నిపనులు ప్రారంభమయ్యేవి. ముఖ్యంగా ఒక సంవత్సరం పాటు నిలువ ఉండేటట్లు ఆహారపదార్థాలు పాకంచేసిపెట్టుకోవడం పెద్దపని.

పెద్దకుటుంబాలయితే భారీ ఎత్తున, చిన్నకుటుంబాలు ఆలుమగలే అయితే దానికి తగినట్లు ఇవి నిలువ పెట్టుకొనే ప్రయత్నంచేసుకొని పండుగనాటికి పనులన్నీ ముగించుకొని సుఖంగా, సంతోషంగాఉండడం అలవాటు. ఈ సంవత్సరాది పండుగే చాల ముఖ్యమయిన పండుగ. సంవత్సరం పొడుగునా చెప్పుకోదగ్గ ఉత్సవాలు, వేడుకలూ ఉండేవికావు.

ఈ నిలువపదార్థాలు తరువాత కొనడానికి దొరికినా, ఏకుటుంబానికి తగినట్లు ఆకుటుంబమువారు వీటిని పెట్టుకొనే వారు. వసంతకాలం వచ్చేసరికి స్త్రీలు ఎవరు పెట్టుకొన్నవి ఎట్లున్నవో సరిపోల్చి చూచుకొనేవారు. మా నాయనమ్మ, పెదతల్లులు, పినతల్లులు ఇంటిలోఉన్న ఆడపిల్ల లందరితో పండుగపనులన్నీ అతిజాగ్రత్తతో చేయాలని, కుటుంబానికి ఉండే మంచిపేరు నిలబెట్టాలని చెప్పేవారు. చైనాలో

ఇప్పుడున్న నాగరికతలో ఆడపిల్లలు అంతకష్టపడి పండుగ పనులు చేస్తారని నేను అనుకోను !

ఊరగాయలు రెండురకాలు. కూరగాయలతో పెట్టే వరుగులుకొన్ని. మాంసంతో పెట్టే ఊరగాయలుకొన్ని. ఈ ఊరగాయలన్నీ తరుణంలో పెట్టి మట్టిజాడీలలో వంట ఇంటిలో జాగ్రత పెట్టేవారు. ఈ వరుగులు, ఊరగాయలు సంవత్సరాది పండుగకు వాడినతర్వాత శీతకట్టులో కూరలు దొరకని కాలంలో వాడుకోవడానికి నిలువఉంచేవారు.

నేను ఈ వరుగులు, ఊరగాయలు తినేవాణ్ణికాదు. అప్పటికప్పుడు తయారుచేసిన కూరలే తినేవాణ్ణి. నన్ను తినుమని బలవంతంచేయక వదిలిపెట్టి పాడుచేస్తున్నాడని మా నాయననుకూడా అనేవారు. మా అన్నలు, తమ్ములు మాత్రం ఈ ఊరగాయలు బాగాతినేవారు. ఎక్కువకారం నేనుతినేవాణ్ణికాదు. నాకు ఇష్టమయిన వంటకము ఒకటే ఉండేది. పందిమాంసము, పొగచూర్చిన కాబేజీ కలిపివండిన కూరమాత్రం నాకు ఇష్టము. కాబేజికూర సన్నగాతరిగి, పొగచూర్చి ఉప్పుతో కలిపి జాడీలలో నిలువచేసేవారు. ఒకనెల అయినతర్వాత దాన్ని వంటకు ఉపయోగించేవారు. ఆ వంటకములో అయినా మాంసంభాగం ఏరుకుతిని కాబేజి ఆకులు వదిలివేసేవాణ్ణి. ఇలాచేసినందుకు పెద్దవాళ్ళు నన్ను చూచి కేకలువేసేవారు. తిట్లయినా భరించేవాణ్ణికాని ఆకులు తినేవాణ్ణికాను.

మావాళ్ళు ఊరగాయలవలె పెట్టుకొనే వాటిలో ముఖ్యమయినవి పందిమాంసము, చేపలు, కోడిమాంసము, బాతుమాంసము. కియాంగ్‌లో కొందరుఎద్దుమాంసము, మేకమాంసముకూడ ఊరవేసికొనేవారు. మా కుటుంబం చాల పెద్దకుటుంబం కాబట్టి ఊరవేయడం పని చాల పెద్ద ఎత్తున జరిగేది. మా పెదతండ్రులలో ఒకడు ప్రత్యేకం యీ పనిమీద ఉండేవాడు. మారైతులదగ్గరనుంచి పెద్ద పందులు రెండు తెచ్చేవాడు. సంవత్సరాది పండుగకు నెలరోజులు ముందే ఈ పని ప్రారంభం. ఇవిమాకు రైతులిచ్చే శిస్తులోనే లెక్క. ఐదుపౌనులు లేదా పదిపౌనులుబరువుండే ముక్కలుగా ఆ పందులను కోసేవారు.

మా నౌకరులు ఆ ముక్కలను శుభ్రంగా కడిగి పెట్టే వారు. మానాయనమ్మ వాటికి ఉప్పు ఎంతకలపాలోచెప్పేది. పది పన్నెండు రోజులు అట్లా ఉప్పుకలిపి ఎండబెట్టేవారు. మా అక్క, ఇతర ఆడపిల్లలు, ఈ ఊరవేయడం పని చేయక పోయినా జరిగేదంతా చూడవలసిందే. మగపిల్లలకుమాత్రం తినటంతప్ప వేరేపనిలేదు.

పదిరోజులు పోయినతర్వాత మళ్ళీ చూచేవారు. మొదటికంటె రంగువచ్చి ఉన్నట్లయితే ఆ ముక్కలు బాగా ఊరినట్లు లెక్క. ఆ ముక్కలు ఎండలో పెట్టేవారు. అలా ఒకనెలరోజులు ఎండినతర్వాత జాగ్రతపెట్టి వంటకు ఉపయోగించేవారు. కొన్నిటిని పొగచూర్చి ఉంచేవారుకూడా. సంవత్సరాది పండుగవిందులో ఈ వంటకం నాకెంతో

ఇష్టంగా ఉండేది. పెద్దముక్కలను నిమ్మకాయంత చిన్న చిన్న ముక్కలుగాకోసి వండేవారు. కలగలుపుకూరగా ఈముక్కలు కలిపివండితే నాకింకా యిష్టము. ఊరగాయగాపెట్టిన మాంసంలో ఉప్పు ఎక్కువ ఉండకూడదు. అనుభవంగల వాళ్ళకు ఈ ఉప్పు ఎంతకలపాలో తెలిసేఉంటుంది.

ఈ మాంసం నిలువచేసినట్లే చేపలుకూడా నిలువ చేస్తారు. మేము వాడే చేపలన్నీ యాంగ్ట్సీనదిలోపట్టినవే. కాని 'యెల్లో రివర్' లో పట్టినవి ఇంతకంటె బాగుం టాయి. ఒక్కొక్కచేప పదిమొదలు ముప్ఫయిపౌనులదాకా బరువు ఉంటుంది. పందిమాంసము ఊరపెట్టడం పూర్తి కావచ్చేలోపునే మా పెదతండ్రి ఒక ఇరవై చేపలైనా ఊర వేయడంకోసం కొనేవాడు. ఇంటిలోఉండే ఆడపిల్లలందరూ వాటినికడిగి శుభ్రంచేసేవారు. నౌకరులు వాటిని ముక్క లుగాకోసి ఉప్పులో ఊరవేయడం మొదలయిన పనులన్నీ చేసేవారు. ఇందులోకూడా ఉప్పు ఎక్కువకాకుండా జాగ్రతపడడం అవసరం. నాకు ఈకూర చాలయిష్టం. గోలీలంత ముక్కలుగా తరిగి అంతేపరిమాణంగల మాంసపు ముక్కలతో కలిపి సోయాబీన్సుతో వండితే చాలరుచిగా ఉంటుంది. ఒక్కొక్కసారి యీ వంటకం మా నాయనమ్మ స్వయంగా చేసేది. మంచి కమ్మనిరుచి వచ్చేది. సంవత్సరాది పండుగ విందులో ఈ కూర తింటానని నన్ను 'చేపతిండి రాయుడు' అనికూడ పిలిచేవారు. కోడిపిల్లల మాంసము, బాతుమాంసముకూడా ఇదేమాదిరి కొందరు ఊరవేసు కొంటారు; కాని మా యింటిలో వేసేవారుకాదు.

ఈ ఊరవేసి చేసిన పదార్థాలను గురించి మాలో ఇంకొక నమ్మకంకూడాఉంది. ఊరవేసినది చెడిపోకుండా బాగా కుదిరితే రాబోయే సంవత్సరమంతా సుఖంగా ఉంటుందని ఒక నమ్మకము. కాబట్టి అతి జాగ్రత్తతో ఊరబెట్టే వారు. ఊరవేసినవి ఎండబెట్టిన తరువాత ఇంటిలో పెద్ద స్త్రీలంతా పిండివంటలు తయారుచేసేపనిలో మునిగి పోయేవారు. పెద్ద ఆడపిల్లలకు వాటి నన్నిటిని మూతలు పెట్టడం పని. పండుగ ఇంకా వారంరోజులుందనే సరికి యీ పనులన్నీ పూర్తికావాలి.

పండుగకు వారంరోజులు ముందుగానే మా నాయనమ్మ యీ వంటకాలన్నీ వంటఇంటి దేవతగా కాగితాలతో తయారుచేసిన విగ్రహంముందుంచి నైవేద్యం పెట్టేది. పిల్లల మంతా ఆ దేవతముందు వంగి నమస్కారం పెట్టేవాళ్ళం. మా నాయనమ్మ మాకొక కథ చెప్పేది. ఈ దేవుడు స్వర్గానికివెళ్ళి ఏడాదిపొడుగునా మాయింట్లో మేము చేసిన పనులన్నీ అక్కడ చెపుతాడట. మంచిపనులు చేసామని చెపితే వచ్చే యేడాదిలో మాకంతా మంచే జరుగు తుందట. లేకపోతే మేము జాగ్రత్తగా నడుచుకోవాలట. ఈ పూజలన్నీ అయినతర్వాత వంటింటి దేవతగా చేసిన ఆకాగితపు బొమ్మను మంటపెట్టేవారు. చిన్నపిల్లలమంతా ఈ విషయాలు ఎక్కువగా మనసుకు పట్టించుకొనే వాళ్లం కాము. పైగా ఏడాదిలోపల మేము వంటఇంటిలోకి వెళ్లే సమయం ఇదొక్కటే.

పండుగకు వారంరోజులు ముందునుంచే మా యింట్లో విందుభోజనాలు మొదలు. పండుగ రోజులు గనుక పిల్లలమంతా అల్లరిచేయకుండా, ఏడువకుండా, దెయ్యాలు, చావు మొదలయిన అశుభంమాటలు తలపెట్టకుండా ఉండాలి. మంచిగా మెలగాలి. ఇల్లంతా బూజుదులిపి శుభ్రంచెయ్యాలి. ఇంటిలో అందరికీ పనే. పిల్లలను మాత్రము బొమ్మలు, విలువైన సామానులు ముట్టుకోనిచ్చేవారు కాదు. పింగాణిపాత్రలు, బొమ్మలు పెద్దవాళ్లేతీసి జాగ్రత్తపెట్టేవారు. పిల్లలమంతా, చేసేది లేకపోయినా యీ పండుగపనుల తొందరలోఉన్నట్టు తీరికలేకుండా ఉండేవాళ్ళం. ఇతర సమయాల్లో అయితే పిల్లలను పొమ్మని కసురుకొనేవాళ్లే; కాని పండుగ ముందు గనుక ఇంటిలో అందరుకూడా పిల్లలంటే విసుగులేకుండా దయతోనే ఉండేవారు.

మా అన్నయ్య ఇంటిపనులలో జోక్యం కలిగించుకొనే సమయం ఇదొక్కటే. వసంతకాలం గురించిన గేయాలు అవి ఎఱ్ఱరంగు కాగితాలమీదవ్రాసి తలుపులమీద అంటించుమని మాకు ఇచ్చేవాడు. కొన్ని యిళ్ళకు తలుపుల మీద దేవుళ్ళ బొమ్మలు అంటించేవారు. మేము మాత్రము అలాంటి బొమ్మలు అంటించేవాళ్ళం కాదు. మా అన్న, మా పెదతండ్రుల పిల్లలు మంచి దస్తూరి వ్రాసేవారు. వసంతకాలంలోవచ్చే ఈ ఉత్సవానికి కొన్ని అచ్చువేసిన గేయాలున్న కాగితాలు అమ్మేవారు. కాని మా అన్న కవిత్వం చెప్పగలడు. ఏ యేటి కాయేడు క్రొత్త గేయాలు

వ్రాస్తూ ఉండేవాడు. సింహద్వారంమీద వ్రాసి అంటించిన గేయాన్ని చాలమంది చదివి వ్రాసుకొని వెళ్ళేవారు కూడ. దాన్నిబట్టి మా అన్నవ్రాసే కవిత్వం బాగుండేదని అనుకొనే వాళ్ళు. ఈ గేయాలు ఒక్కొక్క ద్వారానికి ఒక్కొక్క రకంగా ఉండేవి. సింహద్వారంమీద వసంతానికి స్వాగతం, ఇంకొకటి శుభంకలగాలనే కాంక్ష. మరియొక ద్వారం మీద ఆ దారివెంట వచ్చేపోయే వస్తువులను గురించి. అతిథుల గృహానికి అంటించే గేయము వివిధ ప్రాంతాలనుంచి వచ్చే అతిథులకు స్వాగతం. చదువుకొనే గదిమీద గేయం వసంతంవలె ఊహాలు క్రొత్తగాపుట్టి వర్షధారవలె ధ్వనితో వినిపిస్తాయని వర్ణిస్తూ ఉండేది. ప్రతిద్వారానికి గేయం వ్రాయడంతో మా అన్నకు చేతినిండా పనిఉండేది. ఈ అలంకారం అంతా పండుగకు ఒకరోజు ముందే పూర్తిఅయి పోయేది. మానాన్న మూడు చావడులలోనున్న బొమ్మలు మార్చి వసంతఋతువు రాకను సూచించే పూల బొమ్మలు తగిలించేవాడు.

పండుగ చాలరోజు లుండనగానే మా నాయనమ్మ కుట్టుపనివారిని పిలిపించి మా అందరికీ కొత్తబట్టలు కుట్టించ డానికి ఏర్పాటుచేసేది. సంవత్సరాదిపండుగకు అందరికి క్రొత్తబట్ట లుండవలసిందే. దర్జీలు మా యింట్లో రెండు వారాలపాటు ఉండి బట్టలుకుట్టేవారు. మా పెదతల్లులు, పెద్దపిల్లలు కలిసి సిల్కులు మొదలయిన గుడ్డలన్నీ చింపించి ఏవి ఎలాకుట్టాలో దర్జీవారికి పురమాయించేవారు. నేను

ఇతర సమయాలలో క్రొత్తబట్టలు కట్టుకోవడానికి అసహ్య పడేవాణ్ణి. క్రొత్తగుడ్డలు తొడుక్కుంటే స్వేచ్ఛగా ఉండదు. ఏదో కట్టినట్లు ఉంటుంది. తోచదు. చిరాకు. కాని సంవత్స రాదిపండుగకు అలాకాదు. ఇంట్లో అందరు – పెద్దలు, పిన్నలు క్రొత్తగుడ్డలు కట్టవలసిందే. వారితోపాటు నేను.

సంవత్సరాదిపండుగ రేపనగా పిల్లలమంతా జుట్టు చక్కగా దువ్వించుకొని క్రొత్తబట్టలు కట్టుకొనేవాళ్ళం. చంటిపిల్లలకు కనుబొమలమధ్య దమ్మిడీకాసంత ఎఱ్ఱనిబొట్టు పెట్టేవారు. ఇంట్లోఅందరూ ఉత్సాహంతో, సంతోషంతో ఉండేవారు. పండుగనాడు పిల్లలను ఎవ్వరూ ఏమీ కొట్టరు తిట్టరని మాకు తెలుసు. అయినా మేముకూడా ఆనాడు అల్లరిచేసేవాళ్ళం కాదు. ఇంటిలోని వారందరూ, పిల్లా జెల్లా ఒక్కచోట గుమిగూడేవారం. గడచిన సంవత్సరం సుఖంగా గడచిపోయినందుకు దేవుళ్ళకు మ్రొక్కడం మాకు ఆచారం. అంతా వచ్చిన తరువాత ఆ కార్యక్రమం మొదలుపెట్టేవారు.

మా పెద్దల స్మారకచిహ్నాలుండే పవిత్ర ఆలయానికి ఎదురుగా చావడిమధ్యలో ఒక పెద్ద మేజాబల్ల వేసేవారు మా నౌకర్లు. సింహద్వారానికి ఎదురుగాఉన్న గోడకు అలంకారాలుగల ఒక తెర వ్రేలాడగట్టేవాళ్ళము. ఆ తెర మీద శుభసూచకంగా ఏదైనా ఒకబొమ్మ కుట్టి ఉండేది. “సీన్–సీన్–యూ–ఐ” అని నాలుగు అక్షరాలుమాత్రం ఉండేవి. ఆ మాటలకు ఏటేటా శుభం కలగాలి అని అర్థం.

చావడిలో ఉన్న కుర్చీలన్నిటికీ తొడుగులువేసి మెత్తలు వేసేవాళ్ళం. ప్రతిచావడికి బయట ఒక అందమయిన తెర వ్రేలాడుతుండేది. గజం బారు, మూడంగుళాలు వెడల్పుగల ఎఱ్ఱని కొవ్వువత్తులుకూడ దూలాలనుండి వ్రేలాడుతుండేవి. సింహద్వారానికి మధ్యగా ఒక ఎఱ్ఱని కాగితపు దీపం వ్రేలాడుతుండేది. ద్వారానికి రెండువైపులా ఎఱ్ఱని పొడుగాటి దీపాలుండేవి. ఒకొక్కక్క చావడిలో నాలుగు మూలలా నాలుగు పట్టుగుడ్డలుచుట్టిన దీపాలు, మధ్యలో ఒక పెద్దదీపం ఉండేది.

నైవేద్యానికిపెట్టే వంటకాలు, సారాయి, పిండివంటలు, అన్నము అన్నీ మధ్యనున్న మేజాపై అమర్చబడిన తరువాత దీపాలు, కొవ్వువత్తులు అన్నీ వెలిగించేవారు. ఆ దృశ్యం చాల ఆనందదాయకంగా ఉండేది. ఇంకోవిధంగా ఉండ డానికే వీలులేదు. అటు తర్వాత ధూపం వేసేవారు. మాపెద్ద తండ్రులపిల్లలు టపాకాయలు కాల్చేపనిలో ఉండేవారు. బల్ల మీద ఒక పెద్దకంచుగంట అమర్చేవారు. నేనుదాన్ని అందు కొనేటంత పొడుగుగా ఉండేవాణ్ణి. కనుక గంటమ్రోయించే పని నాకు అప్పగించారు. పెద్దల పవిత్రాలయానికి ఎదురుగా నమస్కరించి కుటుంబపెద్ద పూజలు చేయడం ఆచారం. ఆ సమయంలో గంట నిరంతరం మ్రోగించే పని నాది. ఈ పూజలన్నీ మా కుటుంబంలో పెద్దవాడైన మా తాతయ్య చేయవలసింది; కాని ముసలివాడయిన కారణంగా మా పెద తండ్రులలో పెద్ద యీ పూజచేసేవాడు. ఆయనవెంట తక్కిన వారంతా వయసుక్రమంలోనిలువబడి మ్రొక్కేవారు. పెద్దవాడు

మ్రొక్కాడుగదా అని మానాన్న మా పినతండ్రులు వానివేసే వారుకూడా. పదిహేనేళ్ళలోపు పిల్లలందరికీ యీనమస్కారాలు చేసే భాగం చాల వింతగా ఉండేది. మేము మూడవ చావడి చుట్టు నిలిచిఉండి ఎప్పుడు కేకవేస్తారాఅని ఎదురుచూస్తూ ఉండేవాళ్ళం. మా పెదతల్లులు, పినతల్లులు, ఆడపిల్లలు అందరు అక్కడే నిలబడి ఉండేవారు. సరిగా వంగి మ్రొక్క-గలమోలేదోఅని వారికి భయం. మాకుకూడా సరిగా తెలిసేది గాదు. మా ముందు వెళ్ళిన పెద్దవారినిచూచి మేముకూడా అదేవిధంగా మ్రొక్కేవాళ్ళం.

ఈ ఉత్సవంలో నాపని కూడా ఏం తక్కువయింది గాదు. గంటను ఆపకుండా మ్రొక్కుబడులు అయ్యేటంత సేపు కొడుతూఉండవలసిందే. ఒక అరగంట యీ మ్రొక్కుబడులుంటే నేనుఅంత సేపూ-నేనుమ్రొక్కడానికి వెళ్ళినప్పుడుతప్ప-గంటమ్రోగిస్తూనే ఉండాలి. నేను వెళ్ళినప్పుడు మా తమ్ములలో ఒకరు మ్రోయించేవారు. మా యింటిలోఉన్న పిల్లలందరిలోకి శాంతంగా, ఓపికగా చేసేవాణ్ణిగనుక ఆరవయేడు మొదలు పదిహేనేళ్ళదాటేవఱకు సంవత్సరాదిపండుగనాడు యీపని నాకే చెపుతూఉండేవారు.

ఈ పూజలు అయినతర్వాత ఒక పెద్దవిందు ఉండేది. ఈ సంవత్సరాదినాడే మాయింటిలో పెద్దలు, పిల్లలు, నౌకరులు అందరూ కలిసి సంతోషంగా భోజనం చేస్తాము. ఇతర సమయాలలో వీలున్నవారు వస్తారు; లేనివారు లేదు. సంవత్సరాది పండుగకు మాత్రము అట్లాకాక అందరు వచ్చి

తీరుతారు. మూడు చావడులలో ఒక్కొక్క దానిలో అయిదారు బల్లలు వేస్తాము. ఒక్కొక్క వైపున పెద్దవాళ్లు ఇద్దరు, పిల్లలయితే ముగ్గురుకూచుంటారు. ఇంటిలో వారంతా ఒకచోట చేరినపుడు మా తాతయ్య చూచి సంతోషించి వారిని ఆశీర్వదించేవారు. మా నాయనమ్మ కూడా క్రొత్త సంవత్సరానికి అంతపనీ పూర్తిఅయినందుకు సంతోషిస్తూ 'అమ్మయ్యా ఇక తీరికవచ్చింది' అనుకొనేది. సింహద్వారానికి ఎదురుగా మూడవచావడిలో అందరికి కనిపించేటట్లుగా మా తాతయ్యా, నాయనమ్మ ఒకేచోట కూర్చునేవారు. వారి ప్రక్కనే మునిమనుమనివెళ్లాము, మనమలలో చిన్నవాళ్లు అందరూ చేరేవారు. నేను ఎప్పుడూ ముసలివారిదగ్గరే చేరేవాణ్ణి. మిగతావారంతా ఎక్కడో ఒకచోట కూర్చునేవారు. మధ్యలో అక్కడక్కడ కొన్నిఖాళీలు ఉండేవి. ప్రతిసంవత్సరము ఇంటిలో జనాభా పెరుగుతూ ఉంటుందిగా మరి. ఈ సమావేశాన్ని మేము 'తు అన్ సీన్' అంటాము. అంటే సంవత్సరసమావేశమని అర్థము. ఈ ఉత్సవంలో పెద్ద, చిన్న భేదములేకుండా అంతాసంతోషంగా ఉంటాము.

ఈ పండుగనాటి విందులో వంటకాలు ఎంతరుచిగా ఉండేవో! సాధారణంగా పదిరకాలయినా ఉండేవి. అన్నీ బల్లమీద మధ్యలో ఉండేవి. ప్రతిబల్లకు మధ్య ఒక "హూకో" – కంచుతోచేసిన పాత్ర – ఒకటి ఉండేది.

విందు మొదటిలో మానాన్న – మా నాయనమ్మ పానపాత్రనింపి, ఆమెనుగురించి పొగడి మొట్టమొదటిగా

వారిద్దరు ఆరగించడం ప్రారంభించేవారు. అటుతర్వాత అందరు మొదలుపెట్టేవారు. మానాయనమ్మ, మానాన్న మాత్రము సారాఅంటే యిష్టపడేవారు. మా తాతయ్య మాత్రం కొంచెమైనా రుచిచూచేవాడుకాడు. సారాయి యిష్టపడనివారు పిండివంటలు ఎక్కువగా తినేవారు. పదిహే నేళ్ళలోపు పిల్లలంతా సారాయివాసన చూడకూడదు. సాధారణపు రోజులవలె కాకుండా సంవత్సరాది విందునాడు ఎవరికెంత కావలిస్తే వారంత తినవచ్చు. మామూలురోజు లలో ఒక్క మెతుకుకూడా పారవేయకూడదు. ఈ విందులో మాత్రము మిగలకుండా తినివేయకూడదు. మాలో ఒక నమ్మకము. రాగల సంవత్సరంలో రాబడి, ఖర్చు పోగా మిగలాలంటే యీ విందులోకూడా నాలుగు మెతుకులు మిగల్చాలి.

విందు అయిపోయినతర్వాత నౌకరులు అన్నీ సర్దు కొనేవారు. మేము పిల్లలమంతా ఆడుకొనేవాళ్ళము.

పండుగనాడు ఉదయం ఒకపెద్ద యిత్తడిపాత్రలో బొగ్గులు మంటచేసి చావడులు వెచ్చగా ఉండేటందుకు చావడిలో పెట్టేవారు. విందు అయిపోయినతర్వాత చిన్న చిన్న పాత్రలలో ఈ మండుతున్న నిప్పులు అన్నిగదులలోనికి పంపించేవారు. దీనికొక ప్రత్యేక అర్థముంది. వంశంలో పెద్దవారి వద్దనుంచి సంపద, వెచ్చదనము పంచుకోవడానికి యిది గుర్తు. పిల్లలమంతా ఆడుకొనేవాళ్ళం. పేకాట, చదరంగం, పచ్చీసు మొదలైనవి మా ఆటలు. చిన్న

తమ్ముళ్లతోచేరి రెండవపెరటిలో టపాకాయలు కాల్చుకొనేవాణ్ణి. మా యిష్టమువచ్చినట్లు సంగీతానికి లెక్క-చేయకుండా బూరలు మొదలయినవి ఊదేవాళ్లం. ఆ ధ్వనికి యిల్లంతా గందరగోళంగా ఉండేది. అల్లరికికూడా మితిలేదు.

ఈ సమయంలోనే నేను మొదట్లో చెప్పినట్లుగా వయసువచ్చిన పిల్లలందరికి మా వంశవృక్షపు పుస్తకం చూపించే అలవాటు. మామూలురోజుల్లో మేము సాయంకాలము ఆరు, ఏడుగంటలకే నిద్రపోయేవాళ్లము. కాని సంవత్సరాది పండుగముందురోజు మాత్రము అర్ధరాత్రిదాకా మేలుకొనేవాళ్లము. ఈ ఆచారానికి మాలో "హాసయీా" అనిపేరు. ఇంగ్లీషువారిలాగా మేముకూడా పాతసంవత్సరానికి వీడ్కోలుచెప్పడం, క్రొత్త సంవత్సరానికి స్వాగతంచెప్పడం అలవాటు.

గడచిపోయే సంవత్సరానికి వీడ్కోలు బాగా చెప్పేవాళ్ళం. మా నాన్న ఒకబొమ్మ వేసేవాడు. మా అన్న ఒక గేయం వ్రాసేవాడు. అర్ధరాత్రిదాకా మేలుకోవడమంటే మాకెంత ఉత్సాహంగా అద్భుతంగా ఉండేదో చెప్పలేను. ఆరోజున పెందలాడే నిద్రపోతే పీడకలలవీ వచ్చి వచ్చే సంవత్సరానికి అశుభసూచకం గనుక మేలుకొని ఉండాలని మా పెద్దలు చెప్పేవారు. మేముకూడ మేలుకోవాలని పట్టుదలతో ఉండేవాళ్ళం. కాని కొంతసేపటికి మాకు తెలియకుండానే నిద్రవచ్చేసేది.

అర్ధరాత్రి అయ్యేసరికి జరిగే తతంగం కొంత ఉంది. ధూపం వెయ్యడం, టపాకాయలు వెలిగించడం మొదలైన వాటితో ఆ తంతు మొదలు. మా పెదతండ్రులలో పెద్ద అందరిమగవారిని సింహద్వారం దగ్గరకు తీసుకువెళ్ళి ఆచార ప్రకారము శాంతి సౌఖ్యాలకు ఐశ్వర్యానికి ప్రారంభం చెయ్యడానికి గుర్తుగా తాళంచెవితో తెరిచేవాడు. ఆ తర్వాత చిన్నవారంతా పెద్దలకు నమస్కరించేవారు. చిన్నవారు నేలమీద సాష్టాంగపడేవారు. సమానవయసులోవారు రెండుచేతులు జోడించి నమస్కరించే వారు. "దీనికి 'ట్జూసుయ్' అనిపేరు పాతసంవత్సరానికి వీడ్కోలని దాని అర్థం.

మా యింటిలోని ఆడవాళ్లు, ఆడపిల్లలు, ఈ సంవత్సరాదికి తాము తయారు చేసిన, అల్లికలు, కుట్టుపనులు, చేతి రుమాళ్ళు, అగరు ద్రవ్యాలు ఒకరి కొకరు ఇచ్చుకొనేవారు. మా నాయనమ్మకు ఈ సమయంలో ఏడాదికి సరిపడ కాలి జోళ్లు వచ్చేవి. మగపిల్లలు ఇలాటి పండుగ బహుమతులు ఎందుకు ఇచ్చుకొనేవాళ్ళం కాదో!

పదిహేనేళ్ళలోపు పిల్లలమంతా చేరి యీ ఉత్సవానికి రాలేకపోయినవారికి ఉగాది అభినందనలు చెప్పడానికి బయలుదేరేవాళ్లం. మగపిల్లలంతా ఒకజట్టు, ఆడపిల్లలంతా ఇంకొక జట్టు. మగవాళ్ళజట్టు ముందు. మా తాతయ్య నిద్రపోయేవాడు. ఆయనను లేపకుండా మా నాయనమ్మ దగ్గరకు వెళ్ళేవాళ్ళం. ఆమెకు మేము వస్తామని తెలుసు

గనుక మెత్తని పట్టు పరుపు పరిచి ఉంచేది. మేమంతా దానిమీద మ్రొక్కేవాళ్ళం. ఒకసారి మేము ఎనమండుగురం ఒక జట్టుగా వెళ్ళాం. ఈ జట్టులో మూడేళ్ళతమ్ముడొకడు, ఏడాది మేనల్లు డొకడు కూడా ఉన్నారు. మా దాది మా మేనల్లుణ్ణి ఎత్తుకు వచ్చింది. మేము పెద్దవాళ్ళ మంతా నమస్కరించాము. మూడేళ్ళ తమ్ముడు పెద్దవాళ్ళు నమస్క-రించినప్పుడల్లా వంగుతూ తన వంతు వచ్చేటప్పటికి నమస్క-రించడం మరచి పోయాడు. నమస్కరించేటప్పుడు ముందుగా ఎడమ మోకాలు వంచాలని, తరువాత కుడి మోకాలు వంచాలని వాడు ఎరుగడు. రెండు కాళ్ళమీద ఒకేసారి వంగాడు. మేమంతా పక్కున నవ్వాము.

మా మేనల్లుడుకూడా దాదిచంకలోనుంచి దూకాలని చూచాడు. గట్టిగా పట్టుకుంటేగాని ఆగలేదు. మానాయనమ్మ మా కందరికి క్రొత్త సంవత్సరపు ఆశీర్వచనాలతోపాటు రాగి దమ్మిడీల పొట్లాలుకూడా తలాఒకటి యిచ్చేది. దానితో టపాకాయలు, దీపాలు కొనుక్కొనే వాళ్ళం. పెద్దలందరినీ చూచివచ్చేసరికి మా జేబులనిండా డబ్బులుండేవి. మేము మాఇల్లు, తోటలు దాటివెళ్ళేవాళ్ళంకాదు గనుక మా డబ్బు లన్నీ మా దాదులదగ్గరే చేరేవి.

మా వెనుక ఆడపిల్లల జట్టు బయలుదేరేది. మాకూ వాళ్ళకూ నమస్కరించడంలో తేడా ఏమిటంటే వాళ్ళు చేతులు జోడించరు. మేము జోడిస్తాము.

తెల్లవారుజాము నాలుగు, అయిదు గంటలమధ్య మా పెద్దపెదతండ్రి మమ్ములనందరిని బయటి గుమ్మము దగ్గరకు తీసికొని వెళ్లేవాడు. అక్కడ కొద్దిపాటి తంతుఉండేది. తలుపులు తెరచి ఒకళ్లకొకళ్లు ఉగాది అభినందనలు తెలుపు కొనేవాళ్లం. అప్పుడు మేము చెప్పేమాటలు: "కుంగ్ హో షిన్ షి" దాని అర్థం 'క్రొత్త సంవత్సరము శుభమగు గాక.' అప్పుడు మళ్లీ పెద్దవారందరి దగ్గరకు ఈ మాటలు చెపుతూ వెళ్లేవాళ్లం. ఈసారిమాత్రం మాకు బహుమతులు వచ్చేవికావు. మా చిట్టి తమ్ముడు మంచి నిద్రలో ఉండే వాడు. మాతో రాలేదు. (అయితే నేనుకూడా మధ్యలో ఒక నిద్రపోయినట్లు ఒప్పుకుతీరాలి.)

మా వీధి గుమ్మము సందులోగాని, క్రిందుగాగాని అభినందనాలు తెలిపేకార్డులు గుట్టలు పడిఉండేవి. ఆ రోజు లలో ఈ అభినందనాలు టపాలో పంపేవారుకాదు. క్రొత్త సంవత్సరంలో వెళ్లి నమస్కరించడానికి వీలుగాని వారిఇండ్లకు వెళ్ళి, తెల్లవారేలోపలే యీ కార్డులు వారి గుమ్మాలలో ఉంచి వచ్చేసేవాళ్ళం. ఈ అభినందన స్నేహానికి ఒక చిహ్నము. పెద్దవారంతా వారివారి గదులలో నిద్రపోతూ ఉండేవారు. కుఱ్ఱవాళ్ళు ఇద్దరుమాత్రము ముందుహాలులో మెలుకువగా వుండి అభినందనలు తెలుపడానికి వచ్చే అతిథు లను గౌరవించేవారు. నా పన్నెండవయేట యీ పని నాకు అప్పగించారు. అంతకంటె చిన్నవాళ్ళకు ఇటువంటిపని చెప్పరు. వచ్చే అతిథులను గౌరవించడం చాలబాధ్యతతో కూడినపని. ఉదాహరణకు మా మూడవ పెదతండ్రి

స్నేహితులెవరో వచ్చారనుకోండి. మా యింటిలో ముసలి వాళ్ళను తన స్నేహితుణ్ణి, ఆయన భార్యను చూడాలనివచ్చిన వారు కోరుతారు. "వారంతా వేరే పనులలో ఉన్నారు. మీరు వచ్చి వెళ్ళారని చెపుతాలెండి. వారితరఫున ఇదుగో నా అభినందనలు" అంటూ ఎంతో మర్యాదగా చెప్పి పంపాలి. ఆ వచ్చినవారు ఉగాది అభినందనల కార్డు ఇచ్చి వెళుతారు. ఒకరికొకరు నమస్కారం చెప్పుకొని, వీధిగుమ్మం దాకా వారిని సాగనంపి అక్కడ మళ్ళీ వినయంతో నమ స్కరించి లోపలికి తిరిగిరావాలి. ఈ సంభాషణ అంతా ఎంతో మర్యాదగా, అర్థవంతంగా నడిచేది. ఆ పద్ధతిఅంతా యిక్కడ మాటలలో వివరించి చెప్పలేనుకూడా. అయితే నేను నా పన్నెండవయేట మొదటిసారిగా యీ అభినందనలు చెప్పేపని చక్కగానే చేసానని చెప్పుకోవచ్చు. కాకపోతే ఒకేసారి ముగ్గురు నలుగురు అతిథులు రావడం, మరీదగ్గర బంధువులు వచ్చి మావాళ్ళను చూచితీరాలని పట్టుబట్టడం జరిగింది.

మా కుటుంబంతరఫునగూడా ఇటువంటి అభినందనలు పంపేవారు. మాలో పెద్దపిల్లలు వాటిని తీసుకువెళ్ళి ఇచ్చి వచ్చేవారు. ఇవ్వవలసిన ఇళ్ళు లెక్కవ్రాసుకొని ఒకరొక వైపు, ఇంకొకరు ఇంకొకవైపు వెళ్లేవారు. పండుగ వేడుకలు మూడురోజులపాటు జరిగేవి. అన్నీ ఒకనాడే ఇచ్చిరావాలని కూడాలేదు. అభినందనలన్నీ ఉదయముపూటనే. భోజనం తర్వాత ఎవరూ ఇచ్చేవారుకాదు. పెద్దవారలయిన మా బంధువుల ఇండ్లకు మానాన్న, పెద్దనాన్న వెళ్లిచూచివచ్చే

వారు. మేము పెద్దవారిపేరుతో ఇచ్చిన అభినందనపుకార్డులు తీసికొని వెళ్లేవారం. కొంచెం దూరపు పరిచయంగల వారికి మా నౌకరులు ఇచ్చివచ్చేవారు. ఇది వట్టి మర్యాదఅని తెలిసినప్పటికీన్నీ మానడానికి వీలులేనిమర్యాద. ఆచారం యొక్కబలం అటువంటిది.

సంవత్సరాది పండుగ, ఆచారాలు క్రమంగా నశించి పోవడంచూచి చాల విచారిస్తున్నాను. విచారించవలసిన విషయంకూడా. వట్టి మర్యాదగా తీసిపారవేయ కూడదు. ఒకమనిషి తన జీవితంలో నిజమయిన ఆనందం అనుభవించే సమయాలు ఎన్ని ఉంటాయంటారు! నాచిన్నతనంలోజరిగే సంవత్సరాది వేడుకలుగురించి తలుచుకొంటే అవి ఎంతో విలువైనవిగా కన్పిస్తాయి. పండుగపనులంటే ఎంత తీరికలేని పనులో చెప్పలేను! కాని అవి కలిగించిన ఆనందం, స్నేహ భావం ఇంతా అంతాఅని చెప్పలేను.



బాదంపండ్లు అమ్మేవాడు.

# 8. గురుభక్తి

నా చిన్నతనంలో మాకుటుంబంవారంతా గురువు గారంటే ఎంతోభక్తి శ్రద్ధలుకనబరచేవారు. 'ఒక్కరోజైనా గురువుగాఉన్నవ్యక్తి ఆ శిశువు జీవితమంతా చక్కదిద్దగల' డని మాలో ఒకసామెత ఉంది. మాపెద్దలందరు కూర్చొని చదువులగురించి మాట్లాడుతుంటే నాకీసామెత పదేపదే జ్ఞాపకంవచ్చేది. మాపెద్దల స్మారకచిహ్నాలున్నగదిముందు ఒక పెద్ద పలకమీద కొన్నివాక్యాలు వ్రాసిఉండేవి. ఎఱ్ఱనిరంగు మీద బంగారురంగు అక్షరాలతో ఆకాశం, భూమి, దేశము, తలిదండ్రులు, గురువు అని ఐదుమాటలు వ్రాసి ఉండేవి. దేశమన్నమాట విప్లవంతరువాత వచ్చినదే. అంతకుముందు చక్రవర్తిఅని వ్రాసేవారు. తలిదండ్రుల తరువాత గురువుకు ఉండే స్థానం చాలముఖ్యమయి ఉండేది. పదిహేనురోజుల కొకమాటు మాలోపెద్దవారొకరు చిహ్నా లుండే గదిముందు ధూపంవేసి కుటుంబం అంతటి తరఫున పూజచేసి నమస్కరించేవారు. అక్కడున్న పిల్లలమందరం కూడా విగ్రహాలకు మ్రొక్కేవాళ్ళం. ఈ పూజాసమయంలో నేను టపాకాయలు కాల్చేవాణ్ణి. అక్కడే పైనచెప్పిన ఐదు వాక్యాలు కనిపించేవి.

ఈ పూజాసమయంలో ఆ పలకవైపు దృష్టిపడినప్పు డల్లా తలిదండ్రులతోపాటు గురువుగారికి ఎటువంటి ప్రాముఖ్యం ఉందో నాకు అర్థమయ్యేది. కన్‌ఫ్యూసియస్ కూడ తన బోధలలో పిల్లలు తమ తలిదండ్రులపట్ల గౌరవ ప్రపత్తులు

కలిగి ఉండాలని, పెద్దలను పూజించాలని చెప్పాడు. పైన చెప్పిన ఐదు వాక్యాలువ్రాసే పద్ధతి ఆయన కాలంలోనే ప్రారంభమయినదేమో నాకు తెలియదు. ఆయనతోనే మొదలుపెట్టిఉంటే, నిజంగా తన శిష్యులు తనను ఆరాధించ రేమో అనే భయంతో అట్లా వ్రాయించి ఉంటాడని అనుకోవాలి.

చైనాలో చిన్నవారెప్పుడూ తమ పెద్దవారంటే భయభక్తులతోనే ఉండేవారు. అయినా మా యింట్లో చండశాసనుడయిన గురువుగారు లేకపోయినా గౌరవింప దగిన పెద్దలు చాలమంది ఉన్నారు. ఆకాలంలో ఇంగ్లీషు దేశంలో పిల్లలకు స్వేచ్ఛ ఎక్కువని ఎరిగిఉంటే నేను ఆదేశంలోనే ఉండాలని కోరుకొనేవాణ్ణి. తీరా అక్కడ కూడా స్వేచ్ఛ అనుకున్నంతగా లేదని తెలిసివచ్చేదేమో!

మా పెద్దవాళ్లు, గురువులు చండశాసనులయి ఉండ టానికి ఎందుకు ఒప్పుకొనేవాళ్లో నాకు అర్థంకాదు. గురువులు ఎప్పుడయినా విచారంగాను ఆలోచనా పరులుగాను కనపడితే చాలు 'అయ్యో! మా పిల్లలు తిన్నగా చదవడంలేదా. మీరు చెప్పినమాట వినడం లేదా' అని అడిగి మా తరఫున క్షమింపుడని వారిని ప్రార్థించి మేము కనుక్కొంటాము లెండి అనిచెప్పి వారిని శాంతపరిచేవారు. ఇంటికివచ్చి మా మీద కేకలువేసి బడిలో జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించేవారు. దీనినిచూచుకొని గురువుగారు మమ్ములను ఇంకా ఎక్కువగా దండించేవారు. మా పెద్దవారి నమ్మక

మేమిటంటే గురువుగారు మరీ రాక్షసకృత్యంగా దండించరని. చదువుకొనే రోజులలో కఠినంగా శిక్షించకపోతే పెద్దవారయి నప్పుడు ఎందుకు పనికిరాకుండా పోతారని అనేవారు. తల్లి దండ్రులు గారాబంచేత పిల్లలనుఅదుపులో పెట్టలేరని, శిక్షపెట్టే టందుకు గురువుగారే ఉండాలని వారినమ్మకం. అటువంటి మంచి గురువుగారిని పొంది ఉండడం మా అదృష్టమని వారి భావం. మంచిగురువు అంటే వారిదృష్టిలో బాగా అన్ని విషయాలు తెలిసి ఉండడంకాదు; సోమరితనం లేకుండా పిల్లలను బాగా దండించడం. అప్పుడే ఆగురువుగారు తమ బాధ్యత బాగా నిర్వహిస్తున్నట్లు లెక్క.

అల్లరిచేసే పిల్లలనుగాని సోమరితనంగా ఉండే వాళ్లను గాని గురువుగారు దండిస్తే తలిదండ్రులు ఏమీ అనేవారు కారు. అలా శిక్షింపబడిన పిల్లవాని తలిదండ్రులు కోర్టులో దావావెయ్యడం ఆకాలపు పద్ధతేకాదు. వారు స్వయంగా వచ్చి గురువుగారికి పిల్లవానితరఫున క్షమాపణచెప్పుకొని కుఱ్ఱవాణ్ణి వెంటబెట్టుకువచ్చి అప్పగించిపోవాలి. తలిదండ్రులు వచ్చి అప్పగించకుండా ఒక్కకుఱ్ఱవాడే వచ్చినట్లయితే, గురువుగారు ఆ కుఱ్ఱవానికి చదువుచెప్పను పొమ్మని పంపి వేయవచ్చు. అటువంటిపనే జరిగితే తలిదండ్రులు నలుగురిలో తలయెత్తుకుతిరిగే వీలులేదు. సిగ్గుపడిపోయేవారు. గురువులు ఆ విధంగా గౌరవింపబడుతూ ఉండేవారు.

చదువు సంధ్యలు బాగా రావాలనే ఉద్దేశ్యంతో ఈ పద్ధతి బాగానే ఉందనిపిస్తుంది; కాని వాస్తవానికి కొన్ని

శతాబ్దాలుగా యీ పద్ధతి ఎంత ఆచరణీయంగా ఉన్నదో చైనాలోని కుటుంబాలకు తెలుసు. నేనయినా ఆ పద్ధతి బాగులేదనడంలేదు. కాని పిల్లలం ఆ గురువులచేతుల్లో ఏ హింసకు గురిఅయ్యేవాళ్ళమో మా పెద్దవాళ్ళు ఎరుగరని నా బాధ.

మా గురువుగారి దగ్గర బెత్తాలు మాత్రం కొల్లలుగా ఉండేవి. ఆయన కూడా చీటికి మాటికి కొట్టేవారుకారు. మా కుటుంబంలో ఇంకొక వింత ఆచారం కూడా ఉండేది. క్రొత్తగా బడిలో చదువుకోడానికి పంపేటప్పుడు ఒక క్రొత్త బెత్తం ఎఱ్ఱకాగితంలో చుట్టి గురువుగారికి కానుకగా పంపడం అలవాటు. నేను నా ఆరోయేట బడిలో చేరినప్పుడు మా నాన్నకూడా ఆ ఆచార ప్రకారం ఒక బెత్తం పంపడం నేను ఎరుగుదును.

మా గురువుగారు మమ్మల్ని దండించే పద్ధతివేరు. నాకంటె ఒక ఏడాది పెద్దగాఉండే మా పినతండ్రి మాతో చదువుతూ ఉండేవాడు. మాలోకల్లా అల్లరికి పెట్టిందిపేరు. దస్తూరి బాగుండేదికాదు. పాఠాలు అప్పగించడానికి వచ్చేవికావు. చదువంటే ఎక్కువ శ్రద్ధకూడాలేదు. మాపినతండ్రి వట్టి కబుర్లపోగు. అల్లరికి పెదబాబు. తాను వ్రాసిన చూచి వ్రాతలు, అవీ గురువుగారికిచూపించేముందే మాతో ''ఇవ్వాళ కూడా నాకుచివాట్లు తప్పవు 'ముసలిగడ్డం' నన్ను తన్నక మానడురా'' అంటూ మాతో ముందే చెప్పేవాడు. మేము నవ్వేవాళ్ళం.

మేము పిల్లలమంతా మా పంతులుగారిని "ముసలి గడ్డము" అని మారుపేరుతో పిలిచేవాళ్లము. వేళాకోళానికి ఉపయోగించేవాళ్లం కాదు. ఇంటిలోగాని యితరులతోగాని ఆ మారుపేరు అనకూడదు. మా చిన్న పినతండ్రితో ఎప్పుడయినా ప్రాణంవిసిగి మా గురువుగారు వాణ్ణి మా బడి దొడ్లోనే ఉన్న స్ప్రింగ్ చెట్టుదగ్గరగా వంగి ఉండేటట్లు శిక్ష వేసేవారు. ఇలా మోకాళ్ళమీద వంగి ఉండడానికి తోడు నెత్తిమీద ఒక రాతితొట్టిలో నీళ్ళు పోసిపెట్టేవారు. అది తలమీదపెట్టుకుని నీళ్లు క్రిందపడకుండా మోకాళ్ళ దండెము వేసుకొనిఉండాలి. మా గురువుగారికి ఎదురుగా నిలబెట్టేవారు. కాబట్టి తల త్రిప్పుకోవడానికికూడా వీలులేదు. మా గురువుగారికి చేతిగడియారం ఉండేదికాదు. ఒక అగరువత్తి పూర్తిగా కాలేటంతవఱకు ఈ శిక్ష అనుభవించాలి. ఆ అగరువత్తి జానెడుపైగా ఉండేది. దాదాపు ఒక అరగంట కాలేది. అయినా మా చిన్నపినతండ్రి ఓపికగా ఈ శిక్ష అనుభవించేవాడు. అతణ్ణిచూచి మే మంతా బుద్ధి తెచ్చుకొని పాఠాలు శ్రద్ధగా చదువుతామని మా పంతులుగారి తలంపు.

మేము మా పాఠాలు, చూచివ్రాతలు చూచుకోవడం మానేసి ఆ శిక్ష అతడు ఎలా అనుభవిస్తున్నాడో చూస్తూ ఉండేవాళ్ళము. మేము ఒకళ్లతరువాత ఒకళ్ళము బయటికి వెళ్లడానికి గురువుగారిని అడిగేవాళ్లం. మేము ఎందుకు అడుగుతున్నామో గ్రహించికూడా ఆయన కాదనేవారు

కాదు. నేను మా పినతండ్రి దగ్గరగా వెళ్లినప్పుడు ఆయన కంటితో సైగచేసి బిక్క మొగం వేసేవాడు. పైకి బిగ్గరగా నవ్వడానికి వీలులేదు. ఆడపిల్లలు ఇంకోదారివెంట బయటకు వెళ్ళేవారు కనుక ఈ అల్లరిలో వాళ్ళు ఆనందించే అవకాశ ముండేదికాదు. అగరువత్తి పూర్తిగా కాలిన తర్వాత అతడు లేవవచ్చు. ఇంతసేపు శిక్షఅనుభవించినా ఏమీ అలసట చెందనట్లే ఉండేవాడు మా పినతండ్రి. మా అయిదవ పెద తండ్రికూడా అల్లరివాళ్లలో చేరికే. ఈ మోకాటిదండెం వేసినప్పుడు ఎలా ఉందో ఏమనిపించిందో చెప్పుమని బలవంతం చేశాడు. మా పినతండ్రి యిలా చెప్పాడు. "రాతితొట్టె నెత్తిమీద పెట్టేటప్పుడు వింతగా అనిపించింది. కాని యీ విధంగా ఉన్నదని మాత్రం చెప్పలేను. కదలా లని అనిపించేదికాని ఏదో పెద్ద బరువు నన్ను తిరగనీయటం లేదనిపించేది. ఎక్కడో చదివిన ఒక వస్తాదుకథ జ్ఞాపకంవచ్చి యీ బాధసంగతే మరచిపోయాను. అలసట అనిపించేసరికి శిక్షపూర్తిఅయిపోయిందని చెప్పారు." మేము ఆమాటలువిని మేముకూడా ఎలా ఉంటుందో రుచిచూడాలని అనిపించే టంతగా ఊరించి చెపుతున్నావు అన్నాము. మా పినతండ్రి "ఈసారిఈ శిక్ష ఇంకెవరికయినా రావచ్చు కనుక 'ముసలి గడ్డము' బయటికి వెళ్ళినప్పుడు రాతితొట్టె నెత్తిమీద పెట్టు కొని ఎలా ఉంటుందో చూడవలసిందే" అన్నాడు. అప్పటికి మా చిన్న పినతండ్రి వయసు పదకొండు సంవత్సరాలు.

మా బడిలో మా గురువుగారి కొడుకుతో సహా ఎన మండుగురు మగపిల్లలు, నలుగురు ఆడపిల్లలు ఉండేవారు. మేము ఎక్కువసేపు చదువుకొనేవాళ్ళం. ఆడపిల్లలు ముందు పాఠాలు చెప్పించుకొని వెళ్ళిపోయేవారు. పెద్ద వాళ్ళయిన కొద్దీ ఆడపిల్లలకు ఇంటిపనులు, కుట్టుపనులు ఎక్కువగా నేర్చుకోవలసిన అవసరం ఉండేది.

ఇంక మా గురువుగారు మాకు పాఠాలు చెప్పడం కూడా మా వయసునుబట్టి, తెలివితేటలుబట్టి. రెండు రకాల పుస్తకాలు ఉండేవి. మగపిల్లలకు ఆడపిల్లలకుకూడా యీ పుస్తకాలు వాడేవారు. మూడుఅక్షరాలపేర్లు నాలుగు అక్షరాలపేర్లు ఉన్న పుస్తకాలు వాడేవారు. చైనాలో అందరు అక్షరాలు గుర్తుపట్టించడంకోసం యీ పుస్తకాలు వాడేవారు. మేము ఆ పుస్తకాలలో ఉండేవిషయాలు అర్థం తెలిసినా తెలియకపోయినా చదివి అప్పగించే వాళ్ళం. మొదటి పుస్తకంగా కన్ఫ్యూసియస్ అనుభవాలు మొదలు పెట్టి నాలుగు పుస్తకాలు చదివేవాళ్ళం. ఒకపుస్తకమంతా పూర్తి అయినతర్వాత ఇంకొకటి మొదలుపెట్టేవారు. మాలో కొంతమంది చురుకుగా పాఠాలుఅప్పగించి ముందుకు పోయేవాళ్ళం. మొదటిలో చదవడం అప్పగించడం తప్ప వేరేపనిలేదు. కంఠస్థంచేసి అప్పగించడం ఎందుకు, దానివల్ల లాభమేమి? టని అడగడానికి వీలులేదు. ఆరోజులలో ఆపద్ధతే అందరికీ నచ్చిందికూడాను. నాలుగు పుస్తకాలలోని విషయ మంతా మేము అప్పగించగలిగిన వెంటనే రోజుకొక రెండు

గంటలు మాకు వాటి అర్థాలను బోధించేవారు. అప్పుడు ఒక్కొక్క పుస్తకంలోని విషయాలకు కన్‌ఫ్యూసియస్ సిద్ధాంతాలను గ్రహించిన పెద్దలువ్రాసిన వ్యాఖ్యలుచదవడం, అర్థంచేసుకోవడం మొదలుపెట్టేవాళ్ళం.

మా జట్టు కుఱ్ఱవాళ్ళలోకి నేనే తెలివయినవాణ్ణికాదు. మా ఎనిమిదవ తమ్ముడు నాకంటె ఆరునెలలు చిన్నవాడు. అసలు పాఠం, వ్యాఖ్యానంతోసహా అప్పగించేవాడు. నేను పాఠం ఒక్కటే ఎట్లాగో కష్టపడి అప్పగించేవాణ్ణి. ఈ నాలుగు పుస్తకాలు అయిన తరువాత పదమూడు ప్రాచీన గ్రంథాలు, చైనా చరిత్ర, — ఇవన్ని కన్‌ఫ్యూసియస్ సిద్ధాంతాల ననుసరించి వ్రాయబడినవే — మేము చదువవలసి ఉండేది. మా కుటుంబ పాఠశాలలో ఈ ప్రాచీన గ్రంథాలు చదవడం బాగా వ్రాయడం మాకు నేర్పేవారు.

ఉదయంపూట రెండు గంటలసేపు ప్రాచీన గ్రంథాలు చదవడం. ఇంకో రెండుగంటలు చూచివ్రాయడంగాని అక్షరాలు కుదురుగా చెక్కడంగాని నేర్చుకొనేవాళ్ళం. ఆ తర్వాత ప్రాచీన గ్రంథాలలోని విషయాలు మాకు ఒక గంటకుపైగా బోధించేవారు. అప్పటితో మాకు ఆ రోజుకు పాఠం పూర్తిఅయినట్లు. పన్నెండేళ్లు వయసు దాటిన మగ పిల్లలంతా సాయంకాలం ఇంకొక రెండు గంటలపాటు చదువు పనిలో ఉండవలసివచ్చేది. మాలో అందరికి ఒకే పాఠంకాదు. ఎవరిపాఠం పూర్తి అయితే వారు వెళ్ళిపోవచ్చు.

నామటుకు నేను బడిలోనే ఉండాలనుకొనేవాణ్ణి. మిగిలిన వాళ్ళంతా ఇంటిలో లేనప్పుడు నేను ఒక్కడనే ఇంటిలో ఉంటే ఏమీ తోచదుకూడా. పైగా మా బడి తోటకు దగ్గరగాకూడా ఉంది. మాకు ఒకవేళఅంటూ లేక పోయినా మేము ఎప్పుడూ మా గురువుగారికంటె ముందుగా బడికివెళ్లేవారము. ఆడపిల్లలు మాత్రం గురువుగారికి తర్వాత వచ్చేవారు. మధ్యాహ్నంపూట వాళ్లురారు. నేను నా ఆరవ యేట బడికివెళ్ళడం ప్రారంభించాను. ఒక యేడాది వఱకు నేను ఒక్కపూట మాత్రం వెళ్లేవాణ్ణి. అప్పుడు కూడా నా యిష్టమయితేనే పూర్తిగా ఉండేవాణ్ణి.

నేను బడిలో చేరేసరికి మా అన్నలు కొందరు అక్షరాలు చక్కగా వ్రాయగలిగి ఉండేవారు. నేనుకూడా పది సంవత్సరాలు వచ్చేసరికి బాగా వ్రాయడం నేర్చుకొన్నాను. మా గురువుగారు నన్ను మెచ్చుకొనేవారు కూడా. ఒకసారి నేను కుంచెతో వ్రాస్తూ ఉండగా వెనుకగా వచ్చి ఆకుంచె లాగివేయాలని ప్రయత్నించారు. కాని సాధ్యం కాలేదు. కుంచెను గట్టిగా పట్టుకోవడం వ్రాతగాళ్ళ లక్షణం. కాబట్టి నేను బాగా వ్రాయగలనని మెచ్చుకొన్నారు. మొదటిలో కొంతకాలము చేతులపై బరువుపెట్టి గీతలు గీయడం అలవాటు చేశారు. కొద్దికాలానికే నేను సాఫీగా తప్పులులేకుండా వ్రాయడం నేర్చుకొన్నాను.

మా గురువుగారు పిల్లలను భయపెట్టేవారని నేను అను కోను. చూడడానికి మాత్రం చండశాసనుడున్నట్లు కన్పించే

వాడు. ఆయన ఎప్పుడు నవ్వకుండా గంభీరంగా ఉండడంచేత ఆయన కఠినుడని అంతా అనుకొనేవాళ్లు. ఆయన విద్వాంసులవలె గంభీరంగా ఉండేవారు. దానికి తగినట్లుగా ఆయన స్నేహితులుకూడా ఇతరకుటుంబాలలో గురువులుగా పనిచేసేవారు. వారుకూడా ఈయన మాదిరే వేషభాషలుకలిగి ఉండేవారు. ఇంగ్లీషువారు, చైనావారు ఆవేశం లేనివారని గంగగోవులులాగ ఉంటారనీచెప్పగా విన్నాను. వారు మా గురువులనుచూచి అలా అనుకొనిఉంటారు.

'ముసలిగడ్డము' అని మేము పిలిచేగురువుగారు మా కుటుంబంలో చాలకాలంనుంచి ఉన్నారు. మా అన్నకుకూడా ఆయన చదువుచెప్పారు. వారినాయనగారు మా నాన్నకు గురువు. వారి కుమారుడు మా మేనల్లుళ్లకు గురువు కాబోతున్నాడు. ఇలా వంశపరంపరగా వారు మాకు గురువులు. మా గురువుగారు కియూకియాంగ్‌లో పుట్టలేదు. కాబట్టి ఊరిలో చాలమందిని ఎరుగరు. బడివదిలిపెట్టి ఎక్కడికీ పోరు. మాకు శలవన్నది ఉండేదికాదు. మాకు ఇదిసంతోషం కాదు; కాని మా పెద్దవారికి చాల యిష్టమయినపని.

ఒక్కొక్కప్పుడు మా గురువుగారు బడిలోనే నిద్రపోయేవారు. అటువంటి సమయంలో మేము ఆడుకొనే ఆటలు కొన్నిఉండేవి. అవన్నీ వర్ణించడానికి యిక్కడ చోటుచాలదు. గురువుగారులేచి మమ్ములను పట్టుకొంటే, మా అయిదవతమ్ముణ్ణి లేదా చిన్న పినతండ్రిని అల్లరిముఠా నాయకుడవు నీవేనని పట్టుకు కొట్టేవారు.

సంవత్సరానికొకసారే మాపంతులుగారు శెలవు పుచ్చుకోవడం. సంవత్సరాది పండుగకు ఆయన తన సొంత ఊరికివెళ్లి ఒకనెలరోజులుండి తిరిగివచ్చేవారు. ఒకసారి ఆయనగారు పండుగశెలవుల తర్వాత తిరిగి వస్తూఉండగా సింహద్వారంలో నేనువారికి ఎదురుపడ్డాను. ఆయనకు విధేయతతో వంగి నమస్కరించి సంవత్సరాది అభినందన 'కుంగ్-హో-షిన్-షి' అనిచెప్పాను. ఇంటిలోపలివైపు తిరిగి "చౌషీన్‌షెంగ్, చౌషీన్‌షెంగ్" వచ్చారని కేకపెట్టాను. గురువుగారికి అభినందనలు చెప్పడానికి అంతా బయటికి వచ్చారు. కాని ఇంతలో గురువుగారిముఖం ఎఱ్ఱబారి పోయింది. ఆయన కోపంతో నావైపుచూచి 'మాయింటిపేరు మరిచిపోలేదు సంతోషమే. కాని గురువుగారిని నువ్వు అలా పిలువకూడదు నేర్చుకో. నన్ను షెన్‌షింగ్ అని మాత్రమే పిలవాలి' అన్నారు. నా పిలుపులో తప్పేమిటో నాకు అప్పుడు తెలియలేదు.

కాని మా తాత, మానాన్న నన్ను గురువుగారి పాదాలమీదపడి వేడుకోమని చెప్పారు. వారి మాట నేను శిరసావహించాను. తరువాత మావాళ్ళు నాకు నాతప్పు తెలియ జెప్పారు. షీన్‌షెంగ్ అనేది గురువుగారిని పిలవడానికి కాదట. ఇతరులను పిలవడానికి వాడాలట. స్నేహితులు పరిచయం గలవారినిమాత్రం పిలవడానికి వాడుతారట. ఇంటిపేరుతో కలిపి పిలవాలట. కాని గురు శిష్యులకు సంభాషణలో షీన్‌షెంగ్ అనేదానిముందు ఇంటిపేరు

వాడనక్కరలేదు. షీన్ షెంగ్ అనే దానికి పెద్దవారని అర్థము. 'చౌషీన్ షెంగ్' అని నేను పిలిచిన పిలుపు పరిచయం లేని క్రొత్తవారిని పిలిచేదట. కాబట్టి గురువుగారిని పిలిచేవేళ క్రొత్తవాళ్ళను పిలిచేమాట వాడడం నా తప్పు అని తేలింది.

మా గురువుగారు చాల నిక్కచ్చి మనిషి. ఆయన పాఠం చెప్పేతీరు నాకు నచ్చకపోయినా చండశాసను డయిన గురువుగారి దగ్గర చదువుకో గలిగానని ఇప్పటికీ సంతోషిస్తాను. లేకపోతే నాకు కన్‌ఫ్యూషియస్ వ్రాసిన పురాణాలు వచ్చిఉండేవే కాదు. నాకు అవి అంత బాగా రావడానికి మా గురువుగారే కారణం. మా మేనల్లుఁడు, నా తరువాత తరంవారికి అటువంటి గురువు దొరకడుగదా! అంత కత్తులో వారు పెరుగరు!



పిల్లల ఆటవస్తువులు అమ్మేవాడు

# 9. కొత్తకోడలు

మా అన్నయ్యపెళ్ళి మేము పట్టణం విడిచిపోయి పల్లెలో ఉండగా జరగవలసి వచ్చిందని మానాయనమ్మ, మా నాన్న చాల చిన్నబుచ్చుకున్నారు. మేము మా సొంత యింట్లో ఉంటే చుట్టాలు, స్నేహితులు ఇంకా ఎక్కువగా వచ్చేవారు. పెండ్లి వేడుకలు చాలరోజులు జరిగేవి. అయినప్పటికీ ఇప్పుడు పల్లెటూరి వాతావరణంలో మా రైతు కుటుంబాలన్నీ మా యింటి పెళ్ళికి వచ్చాయి. మేముకూడా వ్యవసాయదారుల మన్నసంగతి మరచిపోకుండా, యీ పెళ్ళి గుర్తుకు తెచ్చింది. పట్టణంలో మా యింటిదగ్గర జరిగిన పెళ్ళిళ్ళకంటె పల్లెలో జరిగిన యీ పెళ్ళే ఆనందంగా జరిగిందని నాకు బాగా జ్ఞాపకం. అయితే మీరు నాకు పెళ్ళిళ్ళమాట యేమి తెలుసు నంటారా? మా అన్నకంటె ఒక యేడాది పెద్దవాడైన మా పదవ చినతండ్రిపెళ్ళి నేను చూచాను. ఇంకా చాల పెళ్లిళ్ళు చూచాను. వాటితో మా అన్నయ్యపెళ్లి పోల్చిచెప్పడానికి తగినంత అనుభవం నాకు ఉంది. మా యింట్లో సంవత్సరానికి రెండు పెళ్ళిళ్ళయినా కనీసం జరిగేవి. ఒకటి మగపిల్లవాని పెళ్లి; రెండవది ఆడపిల్ల పెళ్లి. ఈ రెంటికిగూడా ఎంతో ప్రయత్నం. తరువాత కొన్ని వారాలవఱకు ఇంట్లో, ఏమీ వెదుక్కో నక్కరలేదు.

పెళ్ళిప్రయత్నములంటే ఇల్లంతటికీ వెల్ల వేయడం, రంగులు పూయడం, ముగ్గులుపెట్టడం మొదలయిన పనులన్నీ

ఉండేవి. మరీ దగ్గరబంధువులు, ముఖ్యస్నేహితులు పెళ్ళికి ముందే మాయింటికివచ్చి పెండ్లిపనులు చేసేవారు. బంధువులందరికీ బసలకు, పక్కలకు సౌకర్యాలు ఏర్పాటు చేయడం పెద్దపని. పెళ్ళి మూడునాలుగురోజులు వైభవంగా జరిగేది. డబ్బు చాల ఖర్చయ్యేది. పెళ్ళి ఎంతవైభవంగా, శోభగా జరిగితే వధూవరులంత సౌఖ్యంగా కాలంగడుపుతారని ఒక సమ్మకం. ఆమాట నిజమేనా అని ఇప్పుడు నాకుఅనుమానం. నామటుకు నాకు అనిపిస్తుందిగదా— మనం ముఖ్యంగా జననము, వివాహము, మరణము ఈ మూడింటికీ ప్రాముఖ్యం ఇస్తాము. నేను నా చిన్నతనంలో జరిగిన పెళ్ళిళ్లన్నీ చూచి ఆనందించినా, పెళ్లికి ప్రాముఖ్యం ఉన్నదన్న విషయం కాదనటానికి వీలులేకపోయినా, విరివిగా ఖర్చుచేస్తేనే వివాహం శోభగా జరిగినట్లు అని అంగీకరించను.

మా తరంలో మాఅన్నయ్య పెద్దవాడు. కనుక అతని పెళ్ళి ముందయింది. మా వదిన కొత్తపిల్లకాదు. మాకు మేనమామ కూతురే. పెళ్ళికి ముందే నాకు ఈ సంగతి తెలిసింది. మా పినతల్లులు పెళ్లికి కొన్నాళ్లు ముందే అరిసెలు వండిపెట్టారు. మాలో ఈ పిండివంటకు ఒక ప్రత్యేకత ఉంది. క్రొత్తగావచ్చే వదినెగారిని విసిగిస్తే అరచేతివేళ్లు అంటుతాయన్నట్లు పిండివంట అరచేతులతో ఒత్తి తయారు చేసేవారు. పెళ్లికిముందు మావదినెకు నన్నుకొట్టే అధికారం లేదు. ఇప్పుడు నాపైన ఇంకొక పెత్తనదారు వచ్చిందన్న మాట. ఆ రోజులలో చైనాలో ఉన్నబాలురు ఎంత

అదృష్టవంతులో ! మా వదినె చాలమంచిదని నేను ముందే ఎఱుగుదును.

మా అన్నయ్య పెళ్ళి ఏ డెనిమిది నెలలకు జరుగుతుందనగానే పెళ్ళిపనులు ఒక్కొక్కటే మొదలుపెట్టి చేస్తున్నారు. ఇంతలో విప్లవం వచ్చి, మేమంతా పట్నవాసం వదిలిపెట్టి పల్లెకు పోవలసివచ్చింది. మా కియూకియాంగ్ పట్టణంలో అల్లరులేమీ జరుగలేదు; కాని మేము ఏకారణం చేతనో ఒక ఏడాదంతా పల్లెలోనే ఉన్నాము. పెళ్ళిమాత్రం ఆగిపోలేదు. మానాన్న, ఇద్దరు పెదతండ్రులువచ్చి ఏర్పాట్లన్నీ చేశారు. మేము పల్లెకు రాకపూర్వం ఎఱ్ఱరంగుకవర్లలో ఎఱ్ఱకార్డులమీద వ్రాసిన శుభలేఖలన్నీ పనికిరాలేదు. మా రైతుకుటుంబాలకు క్రొత్తగా వ్రాసి పంపాము.

మా పల్లెటూరి నివాసంలో ఒకగదికి అలంకారం చేశాము. మా మేనమామగారి కుటుంబంకూడా ఇంకొక దగ్గర పల్లెటూరు చేరారు. అయితే అప్పటినుంచి వాళ్లు మా యింటికిరాలేదు. పెళ్ళిప్రయత్నాలు సాగిపోతున్నకొద్దీ నాకొత్త స్నేహితులుకూడా రైతులపిల్లలు 'వదినెగారిచేతిలో దెబ్బలుతింటావులే. అరిసెముక్కలు తింటావులే' అంటూ వేళాకోళం చేసేవారు.

పెళ్ళి రేపనగా పెళ్ళికూతురు తెచ్చే సారె అంతా ఊరేగింపుగా తీసుకురావడం మాలో ఒకఆచారం. అందులో కుర్చీలు, దుప్పట్లు, చీరెలు, సాగెలు అనేకముంటాయి. మా కుటుంబాలన్నీ పల్లెకు వలసవచ్చిన కారణంగా ఆసా-

ఊరేగింపు వైభవంగా జరుపలేదు. అంతా క్లుప్తంగా జరిపేశాము. ఆ పల్లెలోని జనమే విందుభోజనం వండి పెట్టారు. పట్నవాసంనుంచి ఒక మేనా అద్దెకు తెచ్చి మా యింటిదగ్గర పెట్టారు. పిల్లలు, పెద్దలు, ముసలి ముతక అంతా మెల్లిగా చేరారు. వారందరుకూడా మా యింటి పెళ్ళికి అతిథులే. మా నాయనమ్మ మా యింట్లో పెళ్ళికి పల్లెలోకూడా యింతమంది రావడం చూచి చాల సంతో షించింది.

మాపల్లెటూరి నివాసంలోకూడా పెద్దల స్మారక చిహ్నాలుండే పవిత్రగృహం ఒకటి ఏర్పరిచారు.

ఇక పెళ్ళినాటి ముచ్చట. పెద్దలవిగ్రహాలదగ్గర ధూపం వేయడం, టపాకాయలు పేల్చడం అయిన తరువాత పెళ్ళికొడుకు మాపెద్దల విగ్రహాలముందు ముమ్మారు మ్రొక్కి మేనాదగ్గరకు వచ్చి నమస్కరించాడు. మేనాను పెళ్ళి కూతురును తీసికొనిరావడానికి పంపాము. మేనాకు ముందు బాజా బజంత్రీలు, మేళ తాళాలు ఉన్నాయి. మేనాతో వెళ్ళిన మేళాలు తిరిగివస్తున్న చప్పుడు విని మా ఇంటిలోని మేళగాండ్రు వాయించడం ప్రారంభించారు. డోళ్ళు వాయిం చారు. పెళ్ళికూతురున్న మేనా మా యింటిముందువచ్చి ఆగింది. టపాకాయలు వరుసగా పేల్చారు. అన్నిదీపాలు, కొవ్వొవత్తులు వెలిగించాము. మేనా ముందువాకిట్లో ఆగింది. మా అన్న మేనాదగ్గరకు వెళ్ళి నమస్కరించి తలుపులు తెరిచాడు. మేనా తలుపులకు రెండువైపులా ఇద్దరు

ము త్తయిదువలు పెళ్ళికూతురును వెంటబెట్టుకొని నడిపించుకొని వచ్చారు. పెళ్ళికూతురుముఖంమీదుగా మేలిముసుగు వేసుకొన్నందువల్ల ఏమీ కనపడదు. ఇంగ్లీషువారి ఆచారమయితే పెళ్ళికూతురు తన చెలికత్తెలతో నడచివస్తుంది. కాని మా ఆచారం వేరు. చెలికత్తెలు కుడివైపున రాగా పెళ్ళికొడుకు ఎడమచేతివైపున నడిచివస్తాడు.

ఈ తీరున అంతా నడపడానికి ఒక చోపుదారు ఉంటాడు. అతడు వధూవరుల రాక అందరికి తెలిపి దారి ఇమ్మని చెపుతుంటాడు. వారు ముందు సింహద్వారానికి నమస్కరిస్తారు. అటుతర్వాత పెద్దల విగ్రహాలగదివద్దకు వెళ్ళి, మ్రొక్కి చివరకు ఎదురుబదురుగా నిలిచి వంగి నమస్కరిస్తారు.

వధూవరులకోసం ప్రత్యేకంగా అలంకరించిన గది దగ్గరకు వాళ్ళను తీసికొనివెళ్ళడం ఇద్దరు పెద్దపిల్లలు చేస్తారు. లతల ఆకారంలో ఉండే అలంకారంతో కొవ్వొవత్తులు వెలిగించి వెంటతీసికొని వధూవరులను మెల్లగా నడిపించాలి. ఈ పనికి నియమింపబడ్డవారిలో నేనుకూడా ఉన్నాను. వధూవరులు గదిలోకి ప్రవేశించారు. పెళ్లికూతురు గదిలో ఉన్న ప్రక్కమీద కూర్చుండగా పెళ్ళికొడుకు ఆమెముఖము మీది మేలిముసుగు తీసివేశాడు. అప్పటికి మా వదినె ముఖం నేను తిన్నగా చూడగలిగాను. ఆమె తలవంచివేసింది. నావైపే చూడలేదు. ఎఱ్ఱని రంగుదుస్తులు ధరించి ఆమె అందంగా కనిపించింది. ఆమె దుస్తులపై శుభసూచకమయిన గుర్తులు అనేకం కుట్టిఉన్నాయి. ఆమె తలపైన మంచి విలు

వైన టోపీ ధరించింది. దానికి మా భాషలో 'ఫెంగ్ కు ఆన్' అని అంటాము.

మా అన్నయ్య త్వరగా ఆ గదిలోనుంచి వెళ్ళిపోయి, వరసయిన చుట్టాల వేళాకోళం తప్పించుకొందా మను కొన్నాడు. కాని వాళ్ళంతా గుమ్మముదగ్గరే చుట్టుముట్టేసి వరసలాడుతూ వేళాకోళం చేశారు. అవును మరి వాళ్ళకిదే సమయం! పెళ్ళికూతురు ఈ సమయంలో నవ్వకూడదు. అక్కడచేరిన అమ్మలక్కలంతా పెళ్ళికూతురును మాట్లా డించాలని, నవ్వించాలని ప్రయత్నించారు. అందులో చైనా పురాతన సాహిత్యంలోని దంపతులు ఎట్లాసుఖంగా కాపురం చేశారో చెపుతూ, ఎంతో అర్థం వచ్చేటట్లుగా నేర్పుగా మాట్లాడడం వాళ్ళసొమ్ము. తామరమొగ్గచాటున సరసా లాడుకుంటూ హాయిగా కాలం గడిపే చక్రవాక దంపతులు లాగ యీ దంపతులు ఉండాలని వారి ఆశీర్వచనం. ఇలా సరసాలతో కొంతకాలం గడచిన తర్వాత బంధువులంతా ఎవరిదారిని వారుపోతే వధూవరులు కొంత విశ్రాంతి తీసుకొనేవారు.

తరువాత ఆ గదిలోనే విందుభోజనము ఏర్పాటు చేసేవారు. వధూవరులు, పెళ్లికూతురుతో వచ్చిన ఇద్దరు చెలికత్తెలు మొత్తం నలుగురికే ఆ గదిలో విందుయేర్పాటు కాని, కొవ్వొవత్తులు తీసికొని నడచిన నేను, ఇంకొకకుఱ్ఱవాడు ఆ గది విడిచి పోదలచుకోలేదు. మా ఇద్దరికికూడ అక్కడే విందుభోజనము వడ్డించారు.

చెలికత్తెలిద్దరూ పాన పాత్రలలో సారాయి నింపారు. వధూవరులకు చెరియొక పాత్రనునింపి ఒకదానిలోనుంచి ఇంకొకదానిలోనికి తిరుగబోయడం మొదలుపెట్టారు. దీనికి కూడా ఒక ప్రత్యేకత ఉంది. క్రొత్తదంపతులు తమజీవితంలో కలిసిమెలిసి ఉంటారని దీనిఅర్థం. ఈ సంతోషసమయంలోనే వంటమనిషికూడా తానువండిన వంటకాలతో ఒక కొంగ రూపు అమర్చి, ఆకులు పూలు అలంకరించి విందుభోజనము వడ్డించిన బల్లపై ఉంచాడు. అది తినడానికి కాదు. చూచి ఆనందించేటందుకు మాత్రమే. ఆ కానుక తెచ్చి అక్కడపెట్టే సమయంలో వంటవాడు వధూవరులకు శుభాకాంక్షలు తెలుపుతాడు. వారతనికి బహుమతి ఇస్తారు. విందు అయి పోయినతర్వాత వంటవాడు అమర్చిన కొంగ నాకేవచ్చింది.

వధూవరుల భోజనము అయినవెంటనే అతిథులందరికి పెద్ద విందు ఏర్పాటు అయింది. స్త్రీలు, పురుషులు వేర్వేరు చావడులలో కూర్చున్నారు. వధూవరులువచ్చి అతిథులంద రికినమస్కరిస్తారు. పెళ్లికొడుకు మగవారందరికి, పెళ్లికూతురు ఆడవారికి నమస్కరించాలి.

మావదినెతో వచ్చిన చెలికత్తె మాయింటిలో కొద్ది రోజులపాటుఉండి కొత్తకాపురం చక్కబరచి వెళుతుంది. ఆమెకుకూడా కొంతపని ఉంది.

విందులు అయిన మరునాడు ఆ చెలికత్తె 'వింట్జూ' అని మేము పిలిచే తామరగింజలు ఒకగిన్నెలో ఉడకపెట్టడం ఆచారం. ఆగుగ్గిళ్ళు వధూవరులు తినాలి. దాని అర్థమేమి

ఉంటే వారివంశం తామరతంపరగావృద్ధికావడం. ఆతర్వాత చెలికత్తె కొత్తకోడలికి తలదువ్వి జడవేసి పెళ్లిదుస్తులకు బదులుగా కొత్త దుస్తులు ధరింపజేస్తుంది. అప్పుడు కుటుంబంలో వారినందరిని పేరువారీగా పరిచయం చేస్తారు.

వధూవరులు ముందు పెద్దవారికి నమస్కరించి అందరికి నమస్కరించడానికి వెళుతారు. కుటుంబంలోని వారంతా క్రొత్తగా పరిచయమయిన సమయంలో పెళ్లికూతురుకు కానుకలు ఇస్తారు. పెద్దవారేకాని చిన్నవారు బహుమతులు ఇవ్వరు. వారు మా నాయనమ్మకు మ్రొక్కడానికి వచ్చారు. ఆ సమయంలో ఆవిడ "ఈపల్లెలోగనుక త్వరగా తేలింది; పట్నవాసంలో అయితే బంధువులందరికీ నమస్కరించడానికి రెండు మూడు గంటలు పట్టేది" అన్నది. పెళ్లిఅయిన రాత్రికే చాలమంది ఊరికి వెళ్లిపోయినారు. పెళ్లి క్లుప్తంగా జరిగిపోయినందుకు మా నాన్న, నాయనమ్మ చాల అనుకున్నారు.

మా వదినె యీ రెండురోజులలోను నాతో ఒక్క మాటయినా మాట్లాడలేదు. నవ్వలేదు. కారణ మేమిటా అని ఆలోచించాను. అరిసెలకథ నిజమౌతుందా అని భయంకూడా వేసింది. ఇంతలో వధూవరులున్న గదికి వెలుపలఉండి మా చెల్లెలు ఒకపాటపాడింది. మేము రైతుల పిల్లలతో ఆడుకొనేటప్పుడు వాళ్లుపాడేపాట విని అది నేర్చుకున్నది.

కొండకోలనుల మంచి నీ రున్న నీ
నేలపై అందమగు పూలున్న వీ
ఇంటింట సొగసైన కన్నె లున్నారు
పేదవైతే నిన్ను పెండ్లాడ రెవరూ !

అంతచిన్నపిల్ల యీపాట పాడితే అందరికీ ముద్దుగా ఉంది. మా వదినెకూడా చివరకు చిరునవ్వు నవ్వింది. ఆ పాట పాడినదెవరో పిలుచుకురమ్మన్నారు. నేనువెళ్ళి, పిలుచుకువచ్చాను. ఈసారి మాచెల్లెలు పాడినపాట మరీ కొంటెతనంగా ఉంది.

అల్లమూ కారమే మిరియమూ కారమే
అలి ప్రియమైనదే అమ్మ ప్రియమైనదే
తల్లిమాటలుచెత్త తనకేమి హితములా ?
ఇల్లాలిపలుకులే ఇంపవునుగాని !!

అని పాడింది విన్నవారంతా కడుపుచెక్కలయ్యేటట్టు నవ్వారు. మా అన్నయ్య గదిలోకివచ్చాక మళ్ళీపాడమని అడిగారు. మా వదినె అదేపనిగా నవ్వుతోంది. నేను మా వదినెదగ్గరకువెళ్ళి 'ఇంతకుముందు ఎందుకు నవ్వలేదు' అని అడిగాను. తరువాత చెపుతాలే అంటూ ఆమె త్వరగా ఎక్కడికో వెళ్ళిపోయింది. మా అమ్మేగనుక బ్రతికిఉంటే రెండవపాటవిని చాల సంతోషించి ఉండేదనుకుంటాను. కొత్తగా కాపురానికివచ్చిన కోడళ్ళు తమ అత్తలుపెట్టే ఆరళ్ళనుగూర్చి చెప్పుకొంటారు. మా అమ్మ లేనందువల్ల మా వదినెకు అటువంటి అవకాశం లేకుండా పోయింది.

అత్తల ఆగడాలు ఎంత సామాన్యమయినవంటే పిల్లల పాటలలో కూడా అత్తలగురించిన పాటలున్నాయి. అందులో ఒకటి :

కూతురని పొగడుటది గొప్పకాదే తల్లికి ?
కోడలిని అత్త కడుకొనియాడుటే గొప్ప
తనయలను మెచ్చుకొను తల్లులున్నారు
కోడలిని కొనియాడు అత్తలున్నారా ?

పెళ్లి అయిన మూడవరోజున మా వదినె ఇంకోజత కొత్తబట్టలు కట్టుకొని వచ్చింది. చెలికత్తె ఆమెకు ఇంటి పనులు చేసుకోవడానికి అనువయిన దుస్తులు కట్టింది. కొత్త కోడలిచేత తొలిసారిగా వంటవండించడం మాలో ఆచారం. మిగతా పెళ్లి ఆచారాలవంటిదే ఇదికూడా. మా వదినె వంట మొదలుపెట్టి గరిటెతిప్పుతూ పోపులు పెడుతూఉంటే ఆమె చెలికత్తె ఆమెతో 'మీవారు, మీ బంధువులుకూడా నీ వంట మెచ్చుకొనేటట్లు చేయాలి' అన్నది. మేము, బంధువులంతా మా వదినె వండినవంట రుచి చూడడంతో పెళ్లితంతు అంతా పూర్తి అయినట్లే.

నాలుగవరోజున మా అన్నయ్య, వదినె కలిసి మా మేనమామగారియింటికి వెళ్ళారు. మనుగుడుపులు అయిన తర్వాత మా వదినె మా యింటికివచ్చి మా పినతల్లులు, పెదతల్లులతోపాటు కాపురం చేసింది. కొత్తకోడలినిగురించి వ్రాసే సమయంలో నాకొక విషయం జ్ఞాపకంవస్తుంది.

టియాంగ్ పద్యాలలో పేరు కెక్కిన పద్యం ఒకటి చైనాలో ప్రతివారికి, ముఖ్యంగా ఆడపిల్లలకు తప్పకుండా వచ్చి ఉంటుందది.

అత్తవారింటిలో కొత్తకోడలివంట
మొదలగును పెండ్లైన మూడవదినమున
చేతులను కడుగుకొని చేరవలె వంటిల్లు
పైటసవరించుకొని వండవలె పాయసము
అదియెట్లువండితే అత్తకది హితమగునొ
ఎఱుగనిది గనుక తన మరదలను పిలిచి
ఆమెకే ముందుగా అదియింత రుచిచూపి
అమ్మకిది ఇష్టమా అని యడిగితెలిసికొను.

# 10. పెళ్ళిచూపులు

కొన్నిరోజులుగా మాయింట్లో ఏదో హడావిడిగా ఉంది. నాకు అర్థంకాలేదు. మాయింటికి క్రొత్తవారెవరో వస్తున్నారు, పోతున్నారు. మానాన్న మాతాతయ్యతోను, నాయనమ్మతోను ఏదో ఆలోచిస్తూఉన్నాడు. ఒకనాడు మా ఇంటి ముందుగుమ్మంలో ఎవరో ఇద్దరు పెద్దమనుష్యులు మానాన్నతో మాట్లాడుతున్నారు. వారితోపాటు సరిక్రొత్త సైకిలు వెంటపెట్టుకొని ఒక యువకుడుకూడా వచ్చాడు. అతనికి మా అన్నయ్య వయసుఉంటుంది. నేను, మాచిన్న తమ్ముళ్ళు ఇద్దరూ యీవింతఅంతా చూస్తూవున్నాము. మా ఉత్సాహం మేము బయటికి ప్రకటించడానికి వీలులేదు. అందులో క్రొత్తవారు వచ్చినప్పుడు అసలు పనికిరాదు. ఆ క్రొత్త సైకిలువంక దూరాన్నుంచే చూస్తూ ఉన్నాము. క్రొత్తగా వచ్చినవారిని అతిథిగృహంలోకి తీసికొనివచ్చాడు మానాన్న. యువకుడుమాత్రం వారితోపాటు లోపలికి ప్రవేశించలేదు. సైకిలును బయట జాగ్రత్తపరచడంలో కొంత ఆలస్యమయింది అతనికి.

నేను మా అక్కయ్య గదిలోకి పరుగెత్తుకుంటూ వెళ్ళాను. వింతగాఉన్న సైకిలును చూడుమని పిల్చాను. మా అక్కయ్య, ఆమెతోపాటు మా తక్కిన అక్కలు, చెల్లెళ్ళు అంతా వచ్చారు. గదితలుపుల వెనుక ఉన్నారు. నేను, మాతమ్ముళ్ళు ముందరి ప్రాంగణములోకి వెళ్ళాము.

క్రొత్తగావచ్చిన యువకుడు మావంక వింతగా చూచాడు. ముగ్గురు పెద్దవారు కూడా చావడితలుపుదగ్గరకు వచ్చారు. ఆడపిల్లల నందరినీ చూచారు. క్రొత్తవారు చూస్తున్నారనే తొందరలో ఆడపిల్లలంతా లోపలికి పరుగెత్తుకుపోయారు. మాఅక్కయ్య అందరికంటె ముందుగా లోపలికి పోవాలనే తొందరలో గుమ్మము తగిలి పడిపోయినంతపని అయింది.

తరువాత కొంతసేపటికి నాకు తెలిసింది. ఆ క్రొత్త పెద్దమనుష్యులు, ఆ యువకుడు మా అక్కయ్యను పెళ్ళి చూపులు చూడడానికి వచ్చారట. కాబోయే పెళ్ళికొడుకును చూచి మాఅక్కయ్య లోపలికి ఎందుకు పారిపోవడం? అని అనుకున్నాను. కాని మా చైనాలో క్రొత్తవారిని చూచి నప్పుడు ఆడపిల్లలు సిగ్గు అభినయించడం ఆచారం. అటువంటప్పుడు పెళ్లిచూపులకువచ్చిన వారిని చూస్తే మరింతసిగ్గు ఉండటం సహజం.

వాళ్లు వెళ్ళిపోయిన తర్వాత మా పెద తల్లులు, పిన తల్లులు, అక్కలు, మా అక్కయ్యను అదేపనిగా ప్రశ్నిం చారు. పెళ్ళికొడుకును గురించిన ప్రశ్నలు అన్నింటికి సమాధానం చెప్పడంగాని, సంభాషణలో పెద్దవారితో కలిపి మాట్లాడడంగాని పెళ్ళియీడు వచ్చిన పిల్లకు పనికిరాదు. అట్లామాట్లాడితే వరసయినవాళ్లు ఇంకా ప్రశ్నలు, సూటి పోటి మాటలు అని విసిగిస్తారు కూడా! మా అక్కయ్య ఆ సమయంలో ఏమీ మాట్లాడలేదు. వాళ్ళ ప్రశ్నలనుబట్టి అనేకమయిన సంగతులు తెలిసికొన్నది.

రెండు నెలలు గడచిపోయింది. మేమంతా పిల్లలం చాలమంది మా నాయనమ్మచుట్టూ తోటలో కూర్చుని ఉన్నాము. పిల్లలంతా తనచుట్టూ మూగినవేళల్లో మా నాయనమ్మ కట్టుకథలు, దయ్యాలకథలు, తనచిన్నతనం నాటి ముచ్చటలు, మా పట్టణం పూర్వచరిత్ర ఏవేవో చెపుతూ ఉండేది. ఆ కథలలో కొన్నిమాకు చాల నచ్చేవి. కాని మా నాయనమ్మకు ఎన్నో విషయాలు తెలిసినందుకు మేమంతా ఆశ్చర్యపడేవాళ్ళం. ఆమె, బార్లీనుంచి తయారు చేసిన తెల్లసారా (క్యోలియాంగ్) త్రాగిన తరువాత అతి ఉత్సాహంగా కథలు చెప్పడం మొదలుపెట్టేది. దయ్యాలు, భూతాలు గురించి ఆమె చెప్పేకథలు మేము ఎంతో శ్రద్ధగా వినేవాళ్లం. మరీ భయంకరమయిన కథలు చెప్పేటప్పుడు నేను భయంతో మా అక్కయ్య భుజాలు గట్టిగా పట్టుకొనే వాణ్ణి. ఆనాటి సాయంకాలం కూడా మా నాయనమ్మ ఏదో క్రొత్తకథ చెపుతానన్నది. నేను ఉత్సాహంతో వింటున్నాను. 'ఒక అందమైన యువకునికథ' చెపుతానని ఆమె మొదలుపెట్టింది.

"కొన్నివందల సంవత్సరాలనాటి ముచ్చట: ప్యాంగ్ సరస్సు సమీపంలో ఒక కుటుంబం నివసిస్తూ ఉండేది. వారికి అందగత్తెలయిన ముగ్గురు కూతుళ్లు. ఆ దంపతులకు కావలసినంత ధనమున్నది. చాల తెలివితేటలు గలవారే; కాని వారి కొక్కటేలోటు. వంశం నిలబెట్టడానికి మగ సంతానమేలేదు. అది వారికి విచారము కలిగించింది.

అందుచేత ఇల్లరికము వచ్చివేసే అల్లు డెవరయినా దొరికితే బాగుండునని వెతుకుతున్నారు. ఎవరో ఒకరు దొరికారు. వాళ్ళకు తగినంత ధనములేదు. అందుచేత సంఘంలో వారికి గొప్ప గౌరవంకూడా లేదు. కాని కుఱ్ఱవాడుమాత్రం ఏవంకా లేకుండా, అంగవైకల్యం లేకుండా పల్చగా నల్లని జుట్టు, పొడుగాటి చేతివ్రేళ్లు (తెలివితేటలకు గుర్తు) కలిగి చూడడానికి బాగానే ఉన్నాడు. ఆస్తి ఎక్కువగా లేకపోయినా గౌరవంగా కాలక్షేపం చేస్తున్నాడు. మంచి తెలివితేటలు కలవాడు. చిన్నవయసులోనే నాలుగు పుస్తకాలూ పూర్తి చేసి, కన్‌ఫ్యూసియస్ వ్రాసిన అయిదు పురాణాలు చదివాడు. మంచి దస్తూరి. కష్టపడి పనిచేయగలడు. అతనిలో ఉండే యీ సుగుణాలన్నీ కనిపెట్టి మగ సంతానంలేని ఆ దంపతులు వానితో రాకపోకలుచేస్తూ స్నేహం కలిపారు. ఆయువకునికిమాత్రం వీరి స్నేహమెందుకో తెలియలేదు.

ఆ దంపతులు ఆ యువకునికిచ్చి తమ పెద్దకుమార్తెను వివాహం చేద్దామనుకున్నారు. ఆ అమ్మాయి ఆ సంగతి విని "ఆ దరిద్రుణ్ణి పెళ్లిచేసుకునేకంటే ఉరిబెట్టుకొని చావడం మంచిది. తెల్లనిగుడ్డలు కట్టుకోవడానికే కరువయినవాడు మీకు ఎలా నచ్చాడు?" అని అడిగింది.

రెండవ కుమార్తె నిద్దామనుకున్నారు. ఆ అమ్మాయికీ యీ సంగతి తెలిసి "నేనుకూడా ఆయువకుణ్ణి పెళ్లిచేసుకోను. పేదకుటుంబంవాణ్ణి పెళ్ళాడితే మన కుటుంబ గౌరవానికే లోటు" అన్నది.

ఆ దంపతులు తమ మూడవ కూతురు అభిప్రాయ మేమిటో తెలుసుకోనగోరారు. కాని ఆ అమ్మాయి సిగ్గుతో చాలసేపటి వఱకు తలవంచుకునే ఉంది. కొంతసేపయిన తర్వాత "భాగ్యము, గౌరవము కంటె ముఖ్యమయింది గుణం. అది బాగుంటే మిగిలినవన్నీ వాటంతటవేవస్తాయి" అన్నది.

ఆ అమ్మాయి వివేకానికి తలిదండ్రులు ఆశ్చర్యపోయి నారు. పెళ్లిచూపులు ఏర్పాటుచేశారు.

కథ యిక్కడకు వచ్చిన తరువాత మా నాయనమ్మ అన్నది కదా "కన్‌ఫ్యూసియస్ సిద్ధాంతాల ప్రకారం యీ మూడవ అమ్మాయి, ఎంత విధేయత, మంచితనము, తల్లి దండ్రులయెడ గౌరవం కలదో చూశారా" అన్నది. మళ్లీ కథ చెప్పడం మొదలుపెట్టింది.

"ఆ యువకుడు వచ్చి పెళ్లిచూపులు చూచివెళ్లాక ఆ అమ్మాయి తనకు కాబోయే భర్త తెలివితేటలను గురించి ఆలోచించి అతడు సంఘంలో ఎక్కడలేని గౌరవం పొందు తాడని, అప్పుడు ఆలుమగలిద్దరు ఎంతో సుఖంగా కాలం గడుపుతారని తీయనికలలు కంటూఉన్నది. అతని గురించే ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటుంది. ఆ యువకుడు కూడా మొదటి ఇద్దరూ తనను పెళ్లాడడానికి ఇష్టపడలేదని, మూడవ కన్య మాత్రం ఇష్టపడిందని తెలుసుకొని ఆమెనే వివాహ మాడడానికి నిశ్చయించుకున్నాడు. కొంతకాలానికి వారివివాహం జరిగింది. సుఖంగా కాపురంచేస్తున్నారు. ఒకరి

కోకరు సాయపడుతూ కష్టపడి సంపాదించుకుంటూ మునుపటి కంటె సంపదగలవారైనారు.

కొంతకాలం గడిచింది. పెద్దకూతురు భర్త తన ధన మంతాపోగొట్టుకొన్నాడు. వారు మూడవ కూతురు ఇంటికే చేరారు. రెండవ కూతురు పెనిమిటికూడా జీవితంలో ఏమీ కలిసిరాక జోస్యం చెప్పుకుంటూ జీవనం గడుపుతున్నాడు. అందరూ అతణ్ణి చిన్నచూపు చూచేవారు. ఆ కుటుంబంలో కల్లా మూడవ అమ్మాయి సంసారమే కొంచెం పచ్చగా ఉంది. పట్టణంలో అందరుకూడా పేదకుటుంబంలోవాడిని చేసుకోమన్న వారికంటె మూడవ అమ్మాయి సంసారమే బాగున్నందుకు పొగడుతూ వచ్చారు.

మా నాయనమ్మ ఇక్కడివరకు కథచెప్పి ఆపివేసింది. నా కయితే యీ కథ అంత బాగున్నట్టు తోచలేదు. ఇంకో మంచి కథ చెపుతుందిగదా అని నేను వింటూకూర్చున్నాను. కాని మా అక్కయ్య, అక్కలు, చెల్లెళ్లు మాత్రం యీ కథ చాల శ్రద్ధగా వింటున్నారు. ఇంతలో మానాయనమ్మ 'యీ కథ ఆడపిల్లలకు ఉత్సాహంగా ఉంటుందర్రా' అన్నది. కాని మగపిల్లలు కూడా కష్టపడి పనిచేస్తుంటే మంచి పెళ్ళాలు వస్తారు అన్నది. మీరంతా యీ కథ చివరిదాకా వినండి అంటూ మళ్ళీ చెప్పడం మొదలుపెట్టింది.

"మీరు ఆడపిల్లలంతా బాగా తెలుసుకోండి. సంపద ఉన్నదిగదా అని గుణంలేని మగవాళ్ళను పెళ్లిచేసుకోవాలని కోరకండి. ఈ కథలోని మూడవ అమ్మాయికంటె మన

ట్యూన్‌య్-చెన్ (మా అక్కయ్య) చాల అదృష్టవంతురాలు కాబోతుంది. కొన్నాళ్ళ క్రిందట మన యింటికి క్రొత్త సైకిలుతో వచ్చిన యువకుడే దానికి కాబోయే భర్త. అతడు తెలివితేటలు, అందం కలిగినవాడు. సంపద కూడా ఉన్నవాడు. మన పిల్లకు మంచి మగడు" అంటూ పెద్ద పెట్టున నవ్వింది. మేమంతా మా అక్కయ్యవంక చూచాము. ఆమెకు సిగ్గుతోచింది. ఆ నాటినుంచి మా అక్కయ్య కథలు వినడానికి రావడం మానివేసింది. ఆమె రాకపోవడం గురించి మిగిలినవారంతా "మగడు కాబోయే యువకుని గురించే ఎప్పుడూ ఆలోచిస్తుంది. ఇక్కడికెందుకు వస్తుందిలే" అన్నారు.

వారి మాటలు నేనంతగా పట్టించుకోలేదు. నాకివేమీ పట్టవు. నా గొడవే నాది. వేళాకోళంకూడా నాకంతగా చేతగాదు. ఒకసారి మా తమ్ముళ్ళు పుల్లలతో చేసిన పిండి బొమ్మలు తెచ్చారు. మేము వాటితో ఆడాము. రెండు రోజులయిన తర్వాత పిండి ఎండిపోయి బొమ్మలు విరిగిపోయి నాయి. కాని వాటికి పెట్టిన కళ్ళు మాత్రము ఎఱ్ఱగురివింద గింజలతో చేసినవి. ఎఱ్ఱగా ఉండి ఒక మూలమాత్రం నల్లని మచ్చలున్న గురివిందగింజలు బొమ్మలకు కళ్ళుగా అమర్చ డానికి చాల బాగుంటాయి. మేము ఆ గురివిందగింజలను ఎఱ్ఱని కాగితాలలో పొట్లాలుకట్టి జాగ్రత్త పెట్టాము. నేను మా అయిదవ తమ్ముని దగ్గరకు వెళ్ళి టియాంగ్ వ్రాసిన పద్యాలలో ఒక పద్యం వ్రాసుకొని వచ్చాను.

ఆకాగితం చుట్టూ లతలు, పూలు అలంకారంగా ఉన్నాయి. ఈ పద్యంవ్రాసిన కాగితం, గురివిందగింజలు అందమయిన ఒక చిన్న భరిణిలో పెట్టాము. మా అక్కయ్య తన గదిలో లేనిసమయం చూచి యీ భరిణె ఆమెబొట్టుపెట్టెలో పెట్టి వచ్చాము. ఇదంతా వేళాకోళానికి ఏర్పాటయినదే. బొట్టు పెట్టెలో రహస్యంగా భరిణె దాచివచ్చింది నేనే. ఒక రోజు దాకా ఎవరికీ యీ విషయం చెప్పకుండా ఉంచాలి.

మా అక్కయ్యతో మాట్లాడినపుడల్లా యీ విషయం బయటికి చెప్పకుండా మాట్లాడాలంటే కష్టమనిపించింది. మరునాడు మా ముగ్గురు చెల్లెళ్ళు గదికి దూరంగాఉండి మా అక్కయ్యఉన్న గదిలోకి తొంగిచూస్తున్నారు. నేను కూడా బయటఉండి తలుపుసందులోనుంచి చూచాను. మాఅక్కయ్య తనబొట్టుపెట్టెతీసి లోపలున్న ఈఅందాలభరిణె తెరువబోతున్నది. పద్యమున్నకాగితం, గురివిందగింజలు ఆమె చూచింది. ఆ పద్యం చదువుకున్నది. తన కళ్లుమూసి కొని ఏదో ఆలోచన మనసుకువచ్చినట్లుగా ఉన్నది. చాల సేపటివఱకు ఆమె తన తలదువ్వుకోలేదు. - మేము బయట ఏమిమాట్లాడకుండా ఉన్నాము. ఇంతలో మా చిట్టిచెల్లెలు ఒక పీటమీదనుంచి పడిపోయింది. పెద్ద చప్పుడయింది. మేమందరము అక్కడికి దూకాము. కాని మా అక్కయ్య మమ్ములను చూచిందేమో చూడడానికి వెనుకకు వచ్చాను. ఆమె తలదువ్వుకోవడం పూర్తి అయిందికాని ఆలోచన మాత్రం మానలేదు. మా అక్కయ్య వైఖరి అంతా

మారిపోయి ఉన్నందుకు కారణం గ్రహించడం నావంటి కుఱ్ఱవానికి కష్టం. ఇతరపిల్లలతోపాటు నేనుకూడా తమాషా చూద్దామనుకొన్నాను. వారంతా మా అక్కయ్యనుచూచి రోజల్లా ప్రశ్నిస్తూనే వున్నారు. "ఏం ! అదోమాదిరిగా ఉన్నావు ? నీ మనసును అంతగా కలవరపెట్టిందేమిటో" అంటూ వచ్చారు. మా అక్క వారి ప్రశ్నలన్నిటికి ఏమీ మాట్లాడలేదు. కాని మా మూడవ చెల్లెలు ఆమె బొట్టు పెట్టె తెరచినప్పుడుమాత్రం మా అక్కకు ఎక్కడలేని కోపం వచ్చింది.

మేము బొట్టుపెట్టెలో పెట్టిన అందాలబరిణె, మాఅక్కయ్యకు కాబోయే భర్త ప్రేమసూచకంగా పంపిన కానుక అని వారంతా వేళాకోళం చేశారు. నాకుమాత్రం ప్రేమసూచకమయిన కానుక అంటే తెలియలేదు. గురివింద గింజలకు చైనాభాషలో 'సియాంగ్-సూ-ట్జూ' అంటారు. అంటే 'అధికమయిన అనురాగము' అని అర్థము. ఒక వితంతువు ఈ గురివిందచెట్టుక్రింద కూర్చుని విలపించి తన ప్రాణాలు పోగొట్టుకొన్నట్లు కథ. ప్రసిద్ధుడయిన కవి ఒకడు దీన్నిగురించి పద్యాలు వ్రాశాడు. అప్పటినుంచి గురివిందగింజ ప్రేమకు గుర్తుగా ముఖ్యంగా తమ ప్రియులను చూడగోరే ఆడువారికి చిహ్నంగా ఈ గురివిందగింజ నిలిచిపోయింది. చైనావారెవ్వరుకూడా 'ప్రేమ' అనేమాటను బాహాటంగా ఉచ్చరించరు. అట్లా అనేవారు అనాగరికులు. దాని ఫలితం విపరీతంగా ఉంటుందికూడా.

కాబట్టి ప్రేమ తెలియజేయటానికి మాలో అనేక సంకేతాలను మా కవులు వర్ణించారు. అందులో మా ఐదవ తమ్ముడు వ్రాసికొనివచ్చిన టియాంగ్ పద్యము

ఎఱ్ఱని గురివెంద దక్షిణదేశాన
ఏపుగా పెరుగుచు ఇంపుగానుండు
ఆమనిరాగానె క్రొత్తకొమ్మలు పెట్ట
అందుండి గురివెంద గింజలు రాలు
త్వరపెట్టు కోరికల నిండియుండును గనుక
మరికొన్ని యేరుకొని రమ్మంది నిన్ను.

ఈపద్యము ఒకప్రేయసి దక్షిణదేశాలకు ప్రయాణమయి వెళ్ళుతున్న ప్రియునికి వ్రాసినట్లు ఊహింపబడింది. మా చిన్నతనంలో టియాంగ్‌పద్యాలు అన్నీ వల్లెవేయడమే మాపని. వాటిఅర్థం మాకు తెలిసిందా లేదా అనేవిషయం మా గురువుగారికి, పెద్దలకు అక్కరలేదు. మా పెద్దలంతా కూడా అవి చదువుతూ ఉండగా ఆ చదివే విధానం మేము విని నేర్చుకొన్నాము. ఆ పద్యం అర్థము మా అక్కయ్యకు తెలిసే ఉంటుంది. నా తెలివితక్కువతనం నాకు తెలిసి వచ్చింది. ఆలోచనలేకుండా నేను మా అక్కయ్యకు బాధ కలిగించా ననుకున్నాను.

మా అక్కయ్య పెళ్లి సంబంధము విషయములలో ఎక్కువ అట్టహాసం జరుగలేదు. కాని సంబంధం నిశ్చయ

మయిన తర్వాత పెళ్లికొడుకు మా అక్కయ్యను మాపట్టణం లోని మిషన్ హైస్కూలులో చదివించాలని పట్టుబట్టాడు. మా బావగారికుటుంబం అప్పటికే చాల నవీనమార్గాలు అవలంబించింది. మా అక్కయ్య మామగారు చైనాలోని పన్నులశాఖలో పనిచేసి దొరలతోను, పెద్ద ఉద్యోగులతోను పరిచయంవల్ల ఇంగ్లీషు నేర్చుకొన్నాడు. తన కొడుకునుకూడ మిషనరీలుపెట్టిన హైస్కూలుకు పంపి ఇంగ్లీషు నేర్పించాడు. ఆ పట్టణంలోకల్లా మొట్టమొదటిగా బై సైకిలుత్రొక్కినది మా బావ ఒక్కడే. ఆడపిల్లలస్కూలు మగపిల్లల స్కూలు ప్రక్క ప్రక్కనే ఉండేవి. హైస్కూలులో చదివే మగ పిల్లలంతా ఆడపిల్లల హైస్కూలులో పిల్లలనే పెళ్లాడగోరే వారు. లేదా తమకు సంబంధం ఇదివరకే కుదిరిఉంటే ఆ స్కూలులో చదివించాలని పట్టు పట్టేవారు. అందువల్ల చాల కుటుంబాలలో సమస్యలు కలిగాయి. నిశ్చయమైన సంబం ధాలుకూడా చెడిపోయినాయి. పట్టణంలో ఉండే పెద్దలకు యీ హైస్కూళ్లంటే మంచి అభిప్రాయంలేదు. వీటివల్ల మగ పిల్లలు, ఆడపిల్లలు ఒకరి నొకరు చూచుకోవడం, ప్రేమించి ప్రేమలేఖలు వ్రాసుకోవడం, పెద్దవాళ్ళను ధిక్కరించి నడవడం తప్ప వేరే ఉపయోగం లేదని అభిప్రాయం. పైగా పెద్దలంతా క్రైస్తవమతంగురించి ఎక్కువగా ఎరుగరు. అందుచేత దానిలో మేలు వారికి కనబడదు. నా కాలంలో వాటిని చదువునేర్పే పాఠశాలలు అనక 'పెళ్లిళ్ళబడులు' అని

అనేవారు. కాబట్టి మా బావకూడా మా అక్కయ్యను బడిలో చదివించాలని కోరడం సహజం. మా నాన్నకు కపటం తెలియదు. చిత్రకారుడుగా సంప్రదాయంగా పెరిగిన వాడయినప్పటికి తప్పనిసరి అయిన కొన్నిమార్పులను అంగీకరించేవాడు. మా తాతయ్యచెప్పే అడ్డంకులన్నీ నచ్చజెప్పి ఒప్పించగలిగేవాడు.

మా అక్కయ్య స్కూలులో కొద్దిరోజులు చదివేసరికి ఆమెలో పెద్దమార్పు వచ్చింది. కాబోయే భర్తనుగురించి మాట్లాడడంలో ఆమెకు ఇదివరకున్నసిగ్గు తొలగిపోయింది. మాపిల్లలనందరిని కూర్చోబెట్టి స్కూలులో ఆమె అనుభవాలన్నీ మాకుచెప్పడం మొదలుపెట్టింది. మేము చదువుకొనే మా కుటుంబపాఠశాలకు, దానికి ఉన్న తేడా తెలిసికొని ఆశ్చర్యపోయేవాళ్ళం. మా కుటుంబంలోకల్లా ఇంగ్లీషు చదువు మొదలుపెట్టింది మా అక్కయ్య ఒక్కతే. ఆమె చదువుతుంటే ఆమెనుచూచి నేనుకూడ కొన్ని అక్షరాలు పలకడం నేర్చుకొన్నాను. ఆమె ఉచ్చారణ సరిగా ఉన్నదనే నేను అనుకొనేవాణ్ణి.

ఇంగ్లీషు అక్షరాలు కూడా ఆమెనుచూచి వ్రాయడం ఆరంభించాను. ఒకనెల రెండునెలలు గడచేసరికి మా అక్కయ్య స్కూలుముచ్చట మాకు విసుగెత్తింది. కొత్తలో ఉన్నమోజు తగ్గిపోయింది. అక్కడంతా మాకు విజాతీ

యంగా కన్పించడంమూలాన ఆమెకు అక్కడ చదవాలని ఇష్టంకూడా లేకుండాపోయింది. ఒకసంవత్సరం తరువాత మా అక్కయ్యపెళ్లి అయింది. దానితో ఆమె చదువు మానివేసింది. ఇప్పుడామెకు ఇంగ్లీషు అక్షరాలయినా గుర్తున్నాయో లేదో నాకే అనుమానం.



కూరగాయలు అమ్మేవాడు

# 11. వసంతకాలపు విందులు

సంవత్సరాది పండుగ వేడుకలు మూడురోజులపాటు జరిగేవి. వాటివెంటనే మాకుటుంబంవారు మొదటినెలలోను, రెండవ నెలలోను విందులుచేయడానికి ఏర్పాట్లు చేసేవారు. మా బంధువులు, స్నేహితులుకూడా అంతే. ఈ విందులకు ఏర్పాట్లన్నీ పట్టణంలోఉన్న పెద్ద హోటలువారే చేసేవారు. కాబట్టి ఇంటివారు ఎక్కువ శ్రమపడవలసిన పనిలేదు. మేము యీ విందులను 'చున్‌చియూ' వసంతకాలపు పానీయాలనీ పిలిచేవారము.

ఇందులో మొదటివిందు ప్రత్యేకం ఆడవారికే. మా నాయనమ్మ యీ విందుకు ఏర్పాట్లుచేసేది. నేను బాగా చిన్నవాణ్ణయి ఉన్నప్పుడు మా నాయనమ్మ మా అన్నయ్య చేత విందులకు ఆహ్వానపత్రికలువ్రాయించడం నాకుజ్ఞాపకం. ఒక ఎఱ్ఱరంగు కాగితం యీ ఆహ్వానాలకు ఉపయోగించే వారు. పిలిచేవారి సంఖ్యనుబట్టి ఒక్కొక్క కాగితాన్ని నాలుగో, ఆరో, అవసరమయితే ఎనిమిదో భాగాలు చేసే వారు. లోపల మానాయనమ్మ పిలువదలచుకొన్నవారి పేర్లు విడివిడిగా వ్రాసి విందు జరిగేతారీఖు, మా నాయనమ్మపేరు వ్రాసి మడిచేవారు. పైన 'ఆహ్వానము' అని పెద్దఅక్షరాలలో వ్రాసేవారు. ఒక నౌకరు ఈ ఆహ్వానాలు, పేర్లజాబితా పుచ్చుకొని అందరికీ యిచ్చిరావడానికి వెళ్లేవాడు.

ఆహ్వానాలు అందుకొన్నవారు తమ పేరుకు ఎదురుగా తమకు అంగీకారమో కాదో వ్రాసి సంతకం చేసేవారు. అంగీకరించినవారికి మేనా ఎప్పుడుపంపేది మా నౌకరు చెప్పివచ్చేవాడు. ఆహ్వానాలన్నీయిచ్చి మానౌకరు తిరిగి వచ్చేసరికి మా నాయనమ్మకు విందుకు ఎంతమంది వచ్చేది తెలిసేది. వారికే ఆమె ప్రయత్నంచేసేది. ఆడవారిలో ఎవరో ఆరోగ్యం సరిలేనివారు, తీరికలేనివారు తప్ప అందరు విందుపిలుపు అంగీకరించేవారు.

విందునాడు అతిథులందరిని తీసికొనిరావడానికి మేనా పంపడం ఆచారం. విందు సాయంకాలం అయిదుగంటల తర్వాత జరిగేది. కాని అతిథులు మధ్యాహ్నంనుంచి వస్తూ ఉండేవారు. స్త్రీలు తమవెంట చంటిపిల్లలనుకూడా తీసుకు వచ్చేవారు. అతిథులంతా సరిగా విందువేళకు రావడమనేది ఆచారంకాదు. అలా ఆవేళకేవచ్చినట్లయితే తిని పోవడానికే వచ్చినట్లు లెక్క. విందుకు పూర్వమే యిష్టాగోష్ఠి కబుర్లు జరిగేవి. చంటిపిల్లలతో వచ్చినవాళ్ళు మాత్రము విందుకాగానే ఆరు, ఏడు గంటలకల్లా వెళ్ళిపోయేవారు. తిరిగి వెళ్ళేటప్పుడుకూడా మేనాఏర్పాటు ఉంటుంది.

అతిథులుగా వచ్చినవారి పిల్లలకు సాయంగా ఉండేవాడనని నాకుకూడా ఆ విందుకు పిలుపుఉండేది. భోజన పదార్థాలు వడ్డించినతరువాత ఆహ్వానంవరుసలో అతిథులు కూర్చొనేవారు. పెద్ద ఉద్యోగస్థులతాలూకువారు కూర్చునే టప్పుడు తీవి ప్రకటించేవారు. మూడు పెద్దబల్లలపై విందు

ఏర్పాటు. ఒక్కొక్క బల్లచుట్టూ ఎనమండుగురు కూర్చోవచ్చు. చిన్నపిల్లలంతా, దాదులతోబాటు వేరే బల్లలపై కూర్చునేవారు. అంతా చాల ఆనందంగా ఉంటారు. అతిథులంతా తమకున్న దుస్తులలో మేలైనవి ధరించి, జుట్టు ప్రత్యేకంగా దువ్వుకొని పూలు అలంకరించుకొని వచ్చేవారు. ఆ విందు సమయంలో వారు ఏ విషయాలు మాట్లాడుకొనేవారో నాకు గుర్తులేదు. వాస్తవానికి నేను విన్నప్పటికీ వారి సంభాషణ అర్థమయి ఉండేదికాదు. ముఖ్యంగా వారు దుస్తులు, అప్పటి నాజూకు, ఊరగాయలుపెట్టే పద్ధతులు గురించి మాట్లాడుకొని ఉంటారు. ఈ సందర్భంలో విందు స్త్రీలకే ఏర్పాటుచేయుటంవల్లను, నౌకరులు అందరు యీ పనిలోనే ఉండిపోవడంవల్లను ఇంటిలోని మగవారంతా ఆరోజు ఎక్కడో కాలక్షేపం చేయవలసిందే. ఆ రోజంతా ఆడవారిదే ప్రమేయం.

రెండవ విందు మగవారికి. మా నాన్న మా నాయనమ్మతో సంప్రతించి యీ విందు ఏర్పాటు చేసేవాడు. మా తాతయ్య బాగా ముసలివాడయినందున మా నాన్న యీ పనులు చేసేవాడు. కాని విందుఆహ్వానాలు మాత్రం మా తాతయ్య పేరుతోనే వెళ్లేవి. ఈ సారి అతిథులంతా మగవాళ్లే. వారితోపాటు పిల్లలు వచ్చేవారుకారు. వీరికి మేనాలు పంపరు. విందువేళకు ముందుగా వారు రావలసిందే కాని మగవారు ఎప్పుడూ వేళకుసరిగా రారు. విందుకు పండ్రెండుగురుమాత్రమే అంగీకరించేవారు. అందుచేతఅందరు ఒకేబల్లచుట్టూ కూర్చునేవారు. అతిథులలో ఒకరు

మానాన్నకు చిన్ననాటి స్నేహితుడు. చిత్రకారుడు. ఎక్కువగా త్రాగుడు అలవాటు ఉన్నవాడు. సారా చాలసార్లు త్రాగిన తరువాత 'చీ-కు-ట్సూ న్యేయ్-హుయా' అనే ఒక క్రొత్త వినోదం కావాలని సూచించాడు. ఈ ఆటలో గొత్తి తోలుతో చేసిన ఢంకా మ్రోయిస్తారు. పూవులు వికసించా లంటూ ప్రార్థనతోకూడి ఉంటుంది. దగ్గరనే ఉన్న పూల కుండీలోనుంచి ఒకపూవుకోసి తెచ్చారు. ఒక చిన్నడప్పు కూడా తెచ్చారు. నన్ను పిలిచి ఆ డప్పు వాయించుమని చెప్పారు. నాయిష్టమువచ్చినప్పుడు మానివేయవచ్చు. వాయించినంతసేపు పూవు ఒకరు తమచేతినుంచి ప్రక్క వారికి ఇస్తారు. నేను వాయిద్యము ఆపినపుడు ఆ పువ్వు ఎవరిచేతిలో ఉండిపోతే వారు ఒక కప్పుసారాను ఒకే గుక్కలో త్రాగి వేయాలి. వింతయేమిటంటే ఎవరు యీ వినోదపు ఆటను ప్రారంభించాలని కోరారో వారే మొదటిసారిగా త్రాగవలసిన వారుకూడా అవుతారు. మా నాన్న తన స్నేహితుణ్ణిచూచి 'బాగానే ఉందోయి యీ ఎత్తు. త్రాగడానికి ఇంకా సారాయి రావడానికి యీ ఆట బాగానే ఉంది' అనేసరికి అక్కడున్న వారంతా పక్కున నవ్వారు. రెండవసారి మూడవసారికూడా అలాగే జరిగింది. నేను ఒక మూల కూర్చుని ఢంకా వాయిస్తున్నాను. పూవు ఎవరిచేతిలో ఉన్నది నేను చూచే అవకాశమేలేదు. కాని ఆ అతిథి నేనుకావాలని యీవిధంగా చేస్తున్నానని కోపగించుకొని నేనింక త్రాగనంటూ ఆటమాని వేశాడు. నిజానికి ఆయన అప్పటికే తప్పత్రాగిఉన్నాడు. వచ్చి నన్ను పట్టుకొని రెండు ఉతుకుతాడేమో అని భయం

వేసింది. అక్కడనుంచి పారిపోవాలనుకున్నాను. బల్ల చుట్టూ ఉన్నవారినవ్వు నన్ను కొంతసేపటిదాకా కదల నీయలేదు.

ఈ వినోదపు ఆట ఏర్పడడానికి చరిత్రలో కథఉంది. టియాంగ్ వంశంలోఒకరాణిఉండేది. ఆమెపేరుఊ-ట్స్యాయ్-టీన్(క్రీ. శ. 690-697 వఱకు పరిపాలించింది.) ఆమె సామ్రాజ్యాని కంతటికి రాణిగా సింహాసన మెక్కింది. ఆమెకు ఒక గర్వం. తాను అనుకున్నది అయితీరాలి. ఒకరోజున ఆమె తన రాణివాసములో ఒక ఉత్సవం చేయాలనుకొన్నది. ఆవరణలోఉన్న పూలచెట్లన్నీ తెల్లవారేసరికి పూలుపూయాలని ఆజ్ఞాపించింది. తోటలో తాను వ్రాసిన ఒకపద్యంతో ఒక ఆజ్ఞ వ్రేలాడకట్టవలెనని అంతఃపుర సేవకునికి ఆజ్ఞాపించింది.

పూలన్ని రాత్రికే పూచునట్లుగజేసి
ఆరామసీమెల్ల అలరింపుమని చెప్పు
శీఘ్రముగ నీవేగి చెప్పుము వసంతునికి
ఉదయమగుటకు మున్నె ఉద్యానవనమునకు
వస్తాను రేపు నే వచ్చిచూస్తానంచు
తెలవార వీచేటి తెమ్మెరలకై వేచి
జాగుసేయగరాదు జాగ్రత్తయని చెప్పు.

రాణిగారి మాటలకు తిరుగులేదు. ఆమె కొలువులోని వారందరు యీ ఆజ్ఞవిని గగ్గోలుపడ్డారు. ఈ ఆపద గడవ డానికి ఉపాయం ఆలోచించారు. పూలుపూయాలని కోరుతూ

డప్పులు వాయించవలసిందిగా ఆజ్ఞ చేశారు. మరునాడు ఉదయానికల్లా తోటంతా పూలుపూచింది.

ఈ వసంతపు విందుల అనుభవాన్నిబట్టి మగవారి, ఆడువారి అభిరుచులు ఏమిటో స్పష్టంగా అర్థమయింది. వేరువేరుగా విందులు ఏర్పాటుచేయడమే మంచిదనితోచింది. అప్పుడే అతిథులు స్వేచ్ఛగా మాట్లాడుకోవడానికి వీలవుతుంది. తమకు తెలియని విషయాలను గురించి మాట్లాడవలసిన అవసరం ఎవరికీ ఉండదు. ఈనాటి ఆడవారు ఇంటిసంగతులు దాటి లోకవ్యవహారాలు మాకు తెలియవనే స్థితిలో ఉండరు. స్త్రీలతోపాటు సామ్యంసంపాదించడానికి మగవారుకూడా ఆడవారికి సంబంధించిన విషయాలలో ప్రవేశం కలిగించుకోవడం తప్పనిసరి అవుతుంది. ఆడవారి దుస్తులు, నగలు, అలంకారాలు వీటిని గురించి తెలుసుకోవలసిందే. కాని నేను మాత్రం ఈ కాలానికి ఇంకా చాలా వెనుకనే ఉన్నాను.



వండిన పిట్టలను అమ్మేవాడు

# 12. వెన్నెలలో పడవ షికారు

కియాకియాంగ్ పట్టణం చుట్టూ ఒక గోడ ఉన్నదనీ, దాని దక్షిణపుద్వారందగ్గర కాంటంగ్ సరస్సు ఉన్నదనీ ముందే చెప్పాను. ఆ సరస్సు చాల అందంగా ఉంటుంది. చుట్టూ వేసిన కట్ట, రాతికట్టడపు వంతెన – ఇవి రెండూ చాల మనోహరంగా ఉంటాయి. ఆకట్ట వేసి ఏ వెయ్యిసంవత్సరాలో అయి ఉంటుంది. ఆ కట్టమీద దట్టంగా గడ్డి పెరిగిపోయి చెట్లుకూడా పెద్దవయి సహజంగానే ఉన్నట్టు అనిపిస్తుంది. ఆ సరస్సు కట్టచివర పొడుగాటి చెట్లమధ్యలో ఒక బౌద్ధ దేవాలయం ఉంది.

ఇతర చైనాసరస్సులతో పోల్చినప్పుడు కాన్‌టంగ్ చిన్నిసరస్సు అని చెప్పడమేగాని అందులో ఇరవై ముప్పయి పడవలు ఒకదాని కొకటి కనుచూపు మేరలో కనపడనంత దూరము విహరించవచ్చు. సరస్సు రెండు భాగాలుగా ఉంది. వాటికి వేరువేరు పేర్లు. మేడలు, ఇళ్ళు ఉన్నభాగం బయటి సరస్సుకు, నైహూ అనిపేరు. ఇందులో నుంచి వంతెన క్రిందుగా ఈ సరస్సులోని నీరు యాంగ్‌ట్సీ నదిలోకి ప్రవహిస్తుంది. రెండవవైపు అన్నీ పర్వతాలే. ఆ భాగానికి లోపలి సరస్సుకు, లైహూ అనిపేరు. సాధారణంగా బయటి సరస్సు ఒడ్డుల వెంటనే చాలమంది పడవలలో విహరించడం, ఆటలాడడం జరుగుతుంది. మంచి ఎండవేళ ఎవరూ పడవల మీద షికారు పోవడానికి రారు. కాని చెట్లున్న గట్టువెంట చేపలు పడుతూ ఎప్పుడూ చాలమందిఉంటారు. ఎప్పుడయినా

ఒకరిద్దరు పెద్దపిల్లలు, నడివయసువారు ఈతకొట్టుతూ కనిపిస్తారు; కాని ఈసరస్సులో యీత పనికిరాదు. ఒడ్డువెంట పట్టణపు గోడవెంబడి సాధారణంగా స్త్రీలు, పడుచువారు, ముసలివారు గుడ్డలు ఉతుకుకొంటూ ఉంటారు. వారి ఎదురుగా ఈతగాళ్లు యీతకొట్టడం బాగుండదు. అందు చేతనే ఈ రేవులో యీదనివ్వరు. బట్టలు ఉతికేవేళ స్త్రీలు రంగు రంగు దుస్తులతో పాటలు పాడుకుంటూ బట్టలు ఉతుకుతుండగా చూడడానికి కన్నులపండుగగా ఉంటుంది. ఆ పాటలలో అద్భుతమయిన కవిత్వం కూడా ఉంటుంది. వసంతకాలం మొదలు వర్షకాలంవఱకు కియాకియాంగ్ ప్రజలంతా ఈ సరస్సుఒడ్డున ఆడుతూనే ఉంటారు. ఆ రోజు లలో మరపడవలు లేవు. అదీ ఒక మేలే.

మా నాన్నకు కాంటంగ్ సరస్సులో పడవషికారు వెళ్ళడం చాలయిష్టం. బౌద్ధదేవాలయంలోఉన్న సన్యాసి మా నాయనను బాగా యెఱుగును. మానాయన రాత్రి షికారు పోవాలనుకుంటే బౌద్ధ దేవాలయంలోనే నిద్ర పోయేవాడు.

మానాయన స్నేహితులంతా సాధారణంగా చిత్ర కారులు. లేదా మంచి జాలరులు. సరస్సుపై షికారు పోయినప్పుడు చాలామంది కనిపించేవారు. మానాయనకు వెన్నెలచూస్తూ కూచోవడం చాలయిష్టము. అందుకని ఆ గుడిఎదురుగాఉన్న చెట్టుక్రింద కూర్చొని, సన్యాసితో పాటు సారా త్రాగుతూ వెన్నెల ఆనందిస్తూ ఉంటాడు.

మానాన్నకు, సన్యాసికి అందుకనే అంతస్నేహం ఏర్పడి ఉంటుంది.

వేసవికాలంలో ఇంట్లో ఉండలేనంతవేడి. మానాన్న ఒకనాడు మమ్ములనందరిని సరస్సుపై షికారుకు తీసుకొని వెళుతానన్నాడు. మేమందరము ఆనందించాము. సాయం కాలము ఆరుగంటలకు మేము ఎనమండుగురము ఆయనతో బయలుదేరాము. సూర్యాస్తమయమయినా వేడిమాత్రం తగ్గలేదు. మాఅక్కయ్యతో మానాన్న పిల్లనగ్రోవి, చిన్న వెదురుబుట్టలు తీసుకురమ్మని చెప్పాడు. సరస్సు చేరు కున్నాము. పడవతో ఒకసరంగును మాట్లాడుకున్నాము. మేము పడవ నడపకూడదనుకున్నాము. పడవలో గూడు క్రిందఉన్న బల్లచుట్టూ మేము కూర్చున్నాము. సరంగు మావెనుకకూర్చొని పడవ నడుపుతున్నాడు.

మానాన్న పడవసరంగుతో ముందు లోపలిసరస్సులో పడవత్రిప్పుతూ జనం అంతా వెళ్ళిపోయినతర్వాత బయటి సరస్సులోనికి పడవ పోనివ్వవలసిందిగా చెప్పాడు.

పడవ మెల్లగా నీటిమీద నడచిపోతుండగా చల్లని పిల్లగాలి వీచింది. లోపలిసరస్సు మధ్యలోనికి మా పడవ చేరినతర్వాత పడవసరంగు తెడ్లువేయడం మానివేశాడు. అది కలువపూలు పూచేకాలం. సరస్సుదగ్గరలో ఉండేవారు ఆ పూలు కోస్తూఉంటారు. కాంటంగ్ సరస్సులో యీ కలువపూలు ఎవరూ నాటకుండా పెంచకుండా పెరుగుతూఉంటాయి. ఇదే ఇలాటిపూలు అమెరికాలోగాని,

యూరపులోగాని పూచేటట్లయితే ఒక పెద్దకంపెనీవారు వాటిని గుత్తకుతీసుకొని వ్యాపారం మొదలుపెట్టేవారే. ఎవరిష్టమొచ్చినట్లు వారు కోయరాదనికూడ శాసించేవారే. కాని మా దేశంలో అటువంటి వ్యాపారదృష్టి లేనేలేదు. తొట్టిలాంటి పడవలో కూర్చుని పల్లెవాని భార్యయో, కూతురో యీ కలువపూలు కావలసినన్ని ఏరుకుంటారు. సూర్యాస్తమయం వేళ ఆ దృశ్యం చాల అందంగా కనుపిస్తుంది. నేను అప్పుడే ఇటువంటి ప్రకృతిదృశ్యాలు చిత్రించడం నేర్చుకొంటున్నాను. మా నాన్న యీ దృశ్యం చూపించి ఎంత అందంగాఉన్నదో చూడు అన్నాడు.

మా అన్నయ్య యీ దృశ్యాన్ని వర్ణిస్తూ పద్యాలు వ్రాయడానికి ఆలోచిస్తున్నాడు. నేను మేముకూర్చున్న పడవ అంచు మీదుగా తొంగి చూచాను. మా పడవ కలువ పూల మధ్యగానే పోతున్నట్లు గ్రహించాను. పడవ వాటి మధ్యగా దూసుకుపోతూ ఉంటే వింతయినధ్వని వినిపిస్తోంది. నేను కొన్నిపూలు కోయాలనుకున్నాను. కాని కేకలు వేశారు. మా అక్కయ్య, వదినె మాత్రం కొన్నిపూలుకోసి నాకు ఇచ్చారు. క్షణంలో వాళ్ళు ఒకగంపెడు పూలు కోశారు. పడవ నిలకడనీటిలో పోయినంతసేపు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

తొట్లలాంటి గుండ్రని పడవలలో పూలు ఏరుకొనే స్త్రీలు, పిల్లలుపాడే పాటలు మాకు వినిపించాయి. వారు ఏపాట పాడుతున్నారో సరిగా వినిపించలేదు గాని నీటిమీద

వచ్చే కూనిరాగాలుమాత్రం వినిపించాయి. మావదినె దాది తన చిన్నతనంలో యిలా కలువపూలు ఏరుతూ ఉండేదట. ఆ దాదిదగ్గర మా వదినె ఒకపాట నేర్చుకున్నదట. ఆపాటకు 'కలువ పూలు ఏరేపాట' అని కూడా పేరు. మేమంతా మా వదినెను ఆపాట పాడవలసిందిగా కోరాము. ఆమె పాడింది. అది చాల పెద్దపాట. అందుచేత నాకు జ్ఞాపకంలేదు. మా అన్నయ్య తామరగింజలు ఏరేపాటకూడా ఒకటి ఇటువంటిదే ఉన్నదన్నాడు. ఈ మాటలువిని సంతోషంతో చప్పట్లు కొట్టి మా నాన్న మా అన్నయ్యను ఆ పాట పాడుమన్నాడు. ఇంతలో మా పడవ లోపలిసరస్సు చివరలోకి వచ్చింది. అక్కడ చాల ప్రశాంతంగాఉంది. చుట్టూకొండలు ఎత్తుగా ఉన్నాయి. అక్కడక్కడ పచ్చని ఆకులమధ్య ఎఱ్ఱ తామరలు తలఎత్తి ఉన్నాయి. అక్కడకు వచ్చేసరికి మా అక్కయ్య ఒక తామరపువ్వు కోసుకొంటానన్నది. 'నీటిలో ఉన్నప్పుడే చాల అందంగా ఉంటాయి, కోయవద్ద'ని మా నాన్న అంటే మానివేసింది. ఇంతలో మా అన్నయ్య 'తామరగింజలపాట' పాడాడు. మా అన్నయ్య పద్యాలు, పాటలు చదువుతూ పాడుతూఉంటే వినాలని నాకు ఎంతో కోరిక. ఈ పాట బాగా సంగీతంతో పాడలేక పోయినానని మా అన్నయ్య అన్నాడు. ఆ పద్యం ఎక్కడుందోచెప్పి ఇంటికి వెళ్ళాక చూడుమన్నాడు.

చీకటిపడింది. చందమామ మా నడినెత్తినేఉన్నాడు. వెన్నెల నీటిమీదపడి మెరుస్తోంది. నీలకడనీటిలో చంద్ర

బింబంకూడా కనిపిస్తోంది. మా పడవ కొండవాలులవెంట మెల్లగా వంతెనక్రిందుగా బయటి సరస్సులోకి ప్రవేశించింది. అక్కడ ఇంకా ఎవరో చేపలుపడుతూనే ఉన్నారు. వెన్నెలలో ఆయనరూపం మాకు కనిపిస్తూ ఉంది. ఈ సరస్సు భాగంలో ఉన్న దృశ్యం పూర్తిగా లేదు.

సరస్సులలోని నీరుమాత్రం నిలకడగా ఉన్నా గట్టులలోనున్న ఇండ్లలోని దీపాలు సరస్సు నీటిలో ప్రతిఫలించినా పట్నవాసపు గడబిడ, శబ్దము ఇవన్నీ అక్కడే కనుపించాయి. చంద్రుని వెన్నెలలో దీపాలకాంతి ఎఱ్ఱగా కనిపించింది. మా పడవ ఒడ్డువదలి సరస్సుమధ్యలో ఉన్న ఒక దిబ్బదగ్గరకు చేరుకున్నది. ఆ దీవిమీద చెట్లు దట్టంగా ఉన్నాయి. ఆ సరస్సు దేవతకొక దేవాలయం అక్కడున్నది. విద్వాంసులు, కవులు, చిత్రకారులు అందరు ఆ దేవాలయం దగ్గర కలుసుకొంటూ ఉంటారు. మేము అక్కడ ఆగడానికి ప్రయత్నించలేదు. అప్పుడప్పుడు మాపడవ ప్రక్కగాపడవలు వెళ్లేవి. అలావెళ్లే పడవలలో ఒకదానిలోనుంచి 'షై' అనే వెదురుగొట్టపు వాయిద్యపుధ్వని మాకువినిపించింది. వెంటనే మా అక్కయ్యకూడా తన పిల్లనగ్రోవి బయటకుతీసి మా కొక పాట వినిపించాలని అనుకొన్నది. ఆమెకు అదివాయించడం బాగా చేతకాదు. కాని మాలోకల్లా కొద్దిపాటయినా ఊదగలది ఆమె ఒక్కతే. ఆమెకు వచ్చిన పాటలుకూడా ఎక్కువలేవు. కొద్దిపాటి జానపదగేయాలు, కొన్ని ప్రేమ గీతాలున్నా అవి యీ సమయంలో పాడటానికి బాగుండ

వని మా నాన్న అన్నాడు. అప్పుడు మా అన్న 'ట్వ్యాచింగ్' అనే పేరుగల పాతకాలపుపాట ఒకటి పాడవలసిందన్నాడు. ఆపాట పన్నెండు చరణాలతో ఉండేపాట. పల్లవిమాత్రం అదే. మా అన్నయ్య సన్ననికంఠంతో ఆపాటపాడడం ప్రారంభించాడు. మా అక్కయ్య ఆ పాటకుతగినట్లు పిల్లనగ్రోవి వాయించింది. ఆమె వాయిద్యాన్ని ఎక్కువగా మెచ్చుకోక పోయినా పాట పూర్తిగా వాయించింది. ఆ రాగం వాయించ గలిగింది – ఫరవాలేదు. సన్నని కంఠాలు ఆసాయంత్రపు చల్లగాలిలో కలిసి హాయిగా ఉన్నాయి. పడవసరంగుకూడా ఆపాటకు మెచ్చుకొనికాబోలు పడవ జోరుగా నడిపాడు.

మాలో ప్రతిఒక్కరము ఒకపాటపాడడమో లేదా కథ చెప్పడమో జరిగింది. నావంతువచ్చింది. నే నొక పద్యం వ్రాశానని చెప్పేసరికి అంతా ముగ్ధులైనారు. అది వేళాకోళానికి అన్నాననుకొని అంతా పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వారు. మా నాన్నమాత్రం నేనువ్రాసినపద్యం చదువు మన్నాడు. నేను ఇలా చదివాను.

సరసు మధ్యను పడవ
సాగిపోతోంది
ఆకాశమున చంద్రుడు
డదె వెలుగుచున్నాడు

సరసులోపల కూడ
చంద్రుడగుపించు
ఈవైపు ఆవైపు ఏవైపు చూచినా
నాచుట్టు పూలుంటె నాకేల చింత ?

మా అన్నయ్య ఇది విన్న వెంటనే నన్ను కోపపడ్డాడు. ఇటువంటిది వ్రాయకూడ దన్నాడు. ఇందులో ఛందస్సు లేదు, ప్రాసలేదు. ఇటువంటివి వ్రాయడ మెందు కన్నాడు. కాని మా నాన్న మాత్రము పద్యాలు వ్రాయడం నాకు బాగా తెలియకపోయినా భావం చెప్పడంమాత్రం చేతనయిందని మెచ్చుకొన్నాడు. మిగిలిన విషయాలు మా అన్నయ్య నడిగి నేర్చుకోమన్నాడు. ఇంతలో మా జట్టులోవారే ఒకరన్నారు గదా చైనాపద్య సాహిత్యంలో 'పూవు' అంటే కన్య అని అర్థం అని. నా పద్యంలో చివరిపంక్తిలో పూవులను గురించి చెప్పడం ప్రమాదం వచ్చింది. వారంతా ఆమాట పట్టుకొని నన్ను వేళాకోళంచేయడం ప్రారంభించారు. ఆ పద్యం వ్రాసే వేళ నీకు ఏ కన్యలు జ్ఞాపకంవచ్చారని నన్ను ఉడికించడం ఆరంభించారు. ఈ వేళాకోళంతో నాపని కన్నీటిపర్యంతం అయింది. మా నాయన యీ సందర్భంలో అన్నాడుగదా వాడు ఇప్పటినుంచి కష్టపడిచదివితే వాడికిమాత్రం అంద మయిన పిల్లరాదాయేమి టన్నాడు. దానితో నాకు మరింత దుఃఖంవచ్చింది.

ఈ సంఘటన అంతా నా మనసులో కొన్ని నెలల వరకు మెదులుతూనే ఉన్నది. నేను కాంటంగ్ సరస్సులో పడవలమీద వెన్నెలలో షికారు వెళ్ళినసంగతి తలచుకొన్నప్పుడల్లా ఈ పద్యం సంగతి, వేళాకోళం సంగతి తప్పకుండా జ్ఞప్తికి వస్తాయి.



పిల్లల పుస్తకాలను అమ్మేవాడు

# 13. చింగ్ మింగ్ ఉత్సవము

వానలు వెనుకబట్టి ఎండలు ముదరని అనుకూల వాతావరణంలో ఈ ఉత్సవం ఏర్పాటుచేయడం చూస్తే ఇది జనులకు ఆనందం, వినోదం కలిగించడానికే అని తోస్తుంది. ఈ ఉత్సవం సంవత్సరాది పండుగ తర్వాత మూడవ నెలలో (అంటే ఇంగ్లీషుమాసంలో ఏప్రియలు చివర లేదా మే నెల మొదలు) ఏర్పాటు చేస్తారు. వంశపు పెద్దల సమాధులను చూడడానికి అన్ని కుటుంబాలవారు ప్రతి సంవత్సరం యీ ఉత్సవంలో ఒకయాత్రగా వెళుతారు. చైనా ప్రజలు కన్‌ఫ్యూషియస్ బోధల ఫలితంగా పెద్దలను పూజించడం అలవరచుకొన్నారు. ఈ చింగ్‌మింగ్ ఉత్సవసమయం వచ్చేసరికి అన్ని కుటుంబాలలోని పెద్దలు తమ పూర్వులను స్మరించుకొంటూ ఉత్సవానికి సన్నాహాలు చేస్తారు. నిజానికి నామనసుమాత్రం పల్లెటూరి దృశ్యాలు ఇంకొకమారు చూడవచ్చుగదా అని ఉవ్విళ్ళూరుతూ ఉంటుంది. చైనా ప్రజలు తమ పెద్దలకు గౌరవంచూపే ఆచారం ఈ అనుకూల వాతావరణంలో జరగాలని నిర్ణయించిన కన్‌ఫ్యూషియస్ ఎంత ప్రజ్ఞావంతుడో!

మా కుటుంబాలలో పన్నెండు సంవత్సరాలు వయసు వచ్చిన పిల్లలనుగాని యీ ఉత్సవంలో యాత్రకు రానిచ్చేవారుకాదు. అందుకు ముఖ్యకారణమేమంటే మా పూర్వుల సమాధులన్నీ కొండలలో చాల దూరంగా ఉండడం

అక్కడకు వెళ్ళడానికి ఒక్క నడకతప్ప యేయితరసాధనాలు లేకపోవడం. ముసలివారికి మాత్రం మేనాలు ఏర్పాటు చేసేవారు. ఈయాత్ర చింగ్ మింగ్ ఉత్సవంరోజుకు పూర్వమే జరుగవచ్చుకూడా ఆ కుటుంబంవారి అనుకూలాన్నిబట్టి యీ యాత్ర నిర్ణయింపబడేది.

పదిరోజులు ముందుగానే అన్ని ప్రయత్నాలు జరిగేవి. రంగుకాగితాలు చాలా కొనేవారు. స్త్రీలు వాటిని చింపి సమాధులపై ఎగురవేసే జండాలు తయారు చేసేవారు. ఒక పొడుగాటి కఱ్ఱకు యీ రంగుకాగితాలు చుట్టేవారు. కఱ్ఱ పొడుగునా అన్నిరంగుల కాగితాలు అంటించేవారు. సమాధులపైన యీ కఱ్ఱలు పాతినప్పుడు, పొడుగాటి తోకల లాంటి కాగితాలు ఎగురుతుండేలాగు అంటించేవారు. రంగు కాగితపు జండాలు సమాధులపై పాతడం ఆ వంశపువారు వచ్చి చనిపోయినవారికి గౌరవం ప్రకటించడానికి చిహ్నం. సంవత్సరాని కొకసారి కాగితపుజండాలు పాతడం తప్ప పూలు అలంకరించడం మా ఆచారం కాదు.

మా కుటుంబంలోని ఇతర పిల్లలమాదిరే నేనుకూడా నా పన్నెండవ యేట యీ యాత్రలో బయలుదేరి వెళ్లాను. మొదటిసారిగా చేసిన యీ యాత్ర అనుభవాలు నా మనసులో హత్తుకొని పోయినవనడంలో ఆశ్చర్య మేముంటుంది ! మా తాతయ్య, నాయనమ్మ ముసలివా రయిపోయినందు వల్ల మా మూడవ పెద తండ్రి యీ యాత్రకు పెత్తనం వహించాడు. మా కుటుంబంలోని

పెద్దవారందరూ యీ యాత్రకు రారు. ఆడవారు యీయాత్రలో నడువలేరుగనుక వారురారు. నా వయసుగల పిల్లలందరితోపాటు మానాన్న, ఇద్దరు పినతండ్రులు మా మూడవ పెదతండ్రితోపాటు యాత్రలోవచ్చారు. మేమంతా ఒకేవేళకు బయలుదేరాము. సమాధులు వేరువేరుగా ఉండడంవల్ల వాటిని చూడడానికి మూడుజట్లుగావిడిపోయాం. మానాన్న మా మూడవ పెదతండ్రితో కలసి ఉన్నాడు. నేనుకూడా ఆయనవెంట వెళ్ళాను. మా పినతండ్రు లిద్దరూ మిగత రెండుజట్లులతో వెళ్ళారు. జట్లులు విడిపోకముందు మేమంతా మళ్ళీ తిరిగివచ్చేటప్పుడు మా కియాకియాంగ్ పట్టణానికీ, 'లూ' పర్వతానికి మధ్యలోఉన్న ఒక ఎడారిలో కలుసుకోవాలని నిర్ణయించుకున్నాము. ఆ ఊళ్లో ఒక మంచి అన్నసత్రం ఉన్నది. మాకు భోజనవసతికి అనుకూలంగా ఉంటుంది.

మేము యాత్రకు బయలుదేరినరోజున ఎండ ఎక్కువ లేదు. మధ్యమధ్య వానజల్లులుకూడా పడ్డాయి. (నాకు వర్షమంటే ఎంతయిష్టమో చెప్పలేను.) కొండలమీద అన్నీ పచ్చనిచెట్లు. పొలాలలో పచ్చగా బంగారు ముద్దలులా పూచిన జనుముపంట. నేలంతా బంగారము పరచినట్లుగా కనిపించింది నాకంటికి. కొన్నిపొలాలలో వరి, గోధుమ పంటలు అప్పుడే మొలకెత్తాయి. పొలాలలో రైతులు తమ వ్యవసాయపు పనిపాటులు చూసుకొంటున్నారు. కొందరు అప్పుడే తమ దున్నలను దుక్కికి తోలుకుపోతున్నారు. కొందరు తమ పనిచేసుకొంటూ పాటలు పాడుతున్నారు.

ఆ ఆరుబయల్లో రైతులపాటలు, పక్షులకిచకిచలుతప్ప, ఇంకొక శబ్దము వినబడదు. పిల్లగాలికి ఆకులుకదలిన చప్పుడుకూడా వినిపించేటంత ప్రశాంతము. మేము దాటివెళ్ళిన ప్రతిఇంటి దొడ్లోను చెట్లు బాగా పూచిఉన్నాయి. కాలువలగట్లవెంట అన్నీ పూచినచెట్లే. ఈ ప్రకృతిఅంతా చూడముచ్చటగా ఉంది. ఒక్కమాటు కళ్ళుమూసుకొని ఆదృశ్యమంతా నేను ఆలోచించుకోగలను. పంచరంగులలోఉన్న అన్నిదృశ్యాలు, పల్లెపడుచులు అందంగా అలంకరించుకొన్న దుస్తులు నా కళ్ళకుకట్టినట్లుగా కనిపిస్తాయి. మేముచూచిన జనమంతా సంతోషవిలాసాలతో ఆనందంగా కన్పించారు. ఏదారిని పోవాలో మేము అప్పుడప్పుడు అక్కడున్న రైతులను అడుగుతూ వారికి మా శుభాకాంక్షలుచెపుతూ సాగిపోతూ వచ్చాము. ఒక్కొక్కప్పుడు దారితప్పి కొంతదూరంపోయి, ఆదారికాదని తెలిసికొని నవ్వుకుంటూ అసలుదారికి వచ్చే వాళ్ళం. ఈ అమాయకపు ఆనందం, ఆసంతోషవాతావరణం వర్ణించి చెప్పలేను. మేము మా యాత్రమధ్యలో ఒక్కొక్క సారి తమ దగ్గరబంధువులను పోగొట్టుకొని విచారముతో కుములుతున్న యాత్రికులనుకూడా చూశాం.

మా మూడవపెదతండ్రి మేనాదిగి నడవాలనుకొన్నపు డల్లా ఆ మేనాలో నేను ఎక్కేవాణ్ణి. పల్లెసీమలగురించి ఎన్నోకథలు చెపుతూ, ఎన్నో చెట్లు, చేమలు చూపించుతూ నాకు విసుగురాకుండా చేసేవాడు. మానాన్న నాకు మరీ చిన్నతనంలో నేర్పిన ఒక పద్యం జ్ఞాపకంచేసి దాన్ని చదువుమన్నాడు. అంతమందిలో చదవడానికి మొదట

సిగ్గుపడ్డానుగాని, కొంత ధైర్యంతెచ్చుకొని చదువగలిగాను. అది ఒకటి యాంగ్ కవి చింగ్‌మింగ్ ఉత్సవాన్నిగురించి వ్రాసిన పద్యం.

చింగ్ మింగ్ ఉత్సవంరోజు
చినుకులయితే పడ్డాయి
దారిపోయేవారు
తత్తరము పొందారు
పానశాలనుగూర్చి
ప్రశ్నించినాను
పసుల కాపరి ఒకడు
పానశాలకు దారిచూపించినాడు.

ఈ పద్యం చదివేసరికి మావారంతా సంతోషించారు. మా మూడవ పెదతండ్రి, మా నాన్న ముఖ్యంగా త్రాగుడు అంటే ఎక్కువ ప్రీతిగలవారుగనుక ఆ గీతం మెచ్చుకున్నారు. మొట్టమొదటిసారిగా నాకుకూడా దానిఅర్థం కొంత తెలిసింది.

మేము చూడవలసిన సమాధులు రెండూ కొండల మీద ఉన్నాయి. ఉత్తరచైనానుంచి కియాకియాంగ్‌కు మా వంశాన్ని తరలించుకొనివచ్చిన పూర్వీకుని సమాధి ఒకటి. పిల్లలంమేమంతాజండాలు, గిన్నెలుమూటలలోనుంచి ఊడదీశాము. ఈసమాధిమీద కొన్నిజండాలు ఎగురవేశాము. కొన్ని గిన్నెలలో సారా మొదలయినవి అక్కడ ఉంచాము. ధూపం వెలిగించి వయసువారీగా సమాధియెదుట నమస్కరించాము. ఆ సమాధికి ఒకవైపున రాతిపలకమీద చనిపోయిన వారి పేరు, ఆయన జననం, మరణం, ఆయన భార్యపేరు,

ఆయన మా వంశాన్ని ఉత్తరచైనానుంచి కదలించుకొని వచ్చినతీరు అన్నీ చెక్కబడి ఉన్నాయి. అటుతర్వాత మిగిలిన సమాధులదగ్గరకు బయలుదేరి వెళ్ళాము.

మా అమ్మ సమాధి ఇంకొక కొండమీద ఉంది. మానాన్న మా అక్కయ్యను, అన్నయ్యను, నన్నుమాత్రం ఆ సమాధిదగ్గరకు తీసికొని వెళ్ళాడు. మిగతవారంతా ఒక కుటీరంలో విశ్రాంతి తీసుకున్నారు. దారిలో నేను మా నాన్నను అడిగినాను: "ముందుగా మా అమ్మ సమాధికి ఎందుకు రాలేదు" అని. దానికి సమాధానంగా ఆయన వంశంలో పూర్వీకులయినవారిని ముందు గౌరవించాలని చెప్పాడు. మా నాన్న పెద్దల యందుండే గౌరవంకొద్దీ అలాచెప్పినా మా తల్లికంటె నాకు గొప్ప ఎవరు అని మాత్రం అనిపించింది. మానాయనముఖం చాల విచారంతో కూడి ఉండడం చూచాను. అందుచేత యింకేమీ ప్రశ్నలు అడుగలేదు. మేమంతా మా అమ్మ సమాధిదగ్గరకు చేరు కున్నాము. సమాధిచుట్టు ఉన్నచెట్లు బాగా ఎదుగు తున్నందుకు మా నాన్న సంతోషం ప్రకటించాడు. ఆ చెట్లు మా అమ్మను సమాధిచేసినసమయంలో మానాన్ననాటినవే. ప్రక్కనఉన్న కొండవాలులమీద ఆకుపచ్చని చెట్లు పర్వతాల ఎట్టనిరంగు – ఇవి ఎంతో అందంగా కనుపించినా మా నాయనమాత్రం ఉండి ఉండి ఒక వేడినిట్టూర్పు విడుస్తూనే ఉన్నాడు. సమాధి యెదుట ధూపం వెలిగించి, టపాకాయలు పేల్చిన తరువాత మా నాన్న తలవంచి సమాధికి మాత్రమే మూడుసార్లు మ్రొక్కాడు. కాని

ఆ చనిపోయినవ్యక్తికి పిల్లలమయిన మేముమాత్రం అక్కడ నేలమీద మూడుసార్లు సాష్టాంగనమస్కారాలు చేశాము. ఈ సమయంలో మా నాయన ఏమీ మాట్లాడలేదు. సమాధి రాతిమీద వ్రాసిఉన్న సంగతులు చదువుమని చెప్పాడు. మేమంతా కొద్దిక్షణాలు మౌనంగా నిలుచున్నాము.

మేము కొద్దిసేపట్లో మావాళ్లు విశ్రాంతితీసుకొంటున్న కుటీరందగ్గరకు వచ్చాము. ఆ కుటీరంలో ఉన్నవాళ్లు మా వంశంవారి సమాధులను చూస్తూ ఉంటారు. మా మూడవ పెదతండ్రి ఆ కుటీరంలోనివారికి సమాధుల కాపలాగురించి ఏవేవో చెప్పాడు. అవన్ని అయినతర్వాత మా అమ్మ సమాధిని గురించి మా నాన్న మరికొన్ని సంగతులు చెప్పాడు. మేము దారిలో అందంగా కనిపించిన చెట్ల కొమ్మలన్ని విరుచుకొని పట్టుకువచ్చాము. ఈ పచ్చని కొమ్మలు తేవడంలో ఒక అర్థంఉంది. మా పూర్వులు మమ్ములనందరిని ఈ కొమ్మలులాగా పచ్చగా కాపాడుతూ ఉంటారని ఒక నమ్మకం. వసంతకాలపు గుర్తులుగా మేము యీ కొమ్మలను ఇంటికి తెచ్చుకోవడంకూడా ఆచారం.

ఇంకొక రెండు గంటలు దాటేసరికి మిగిలిన రెండు జట్టులవారు విశ్రాంతి తీసుకొంటున్న అన్నసత్రానికి చేరుకున్నాము. ఆ జట్టులవారుకూడా అంతకుముందే అక్కడ చేరుకున్నారు. ఆ సత్రమంతా మా వాళ్ళతోనే నిండి పోయింది. మాలాగుననే మిగతజట్లవాళ్ళు కూడా పచ్చని కొమ్మలు ఏరుకువచ్చారు. అంతా పిచ్చా, పాటి కబుర్లాడు

కున్నాము. పూ అందరికి మా నాన్న భోజనం ఏర్పాటు చేశాడు. కడుపునిండుగా భోజనంచేశాము. నేనుమాత్రం ఏమీ మాట్లాడకుండా ఉన్నాను. నేను అలిసిపోవడం ఒకకారణం. అదీకాక నా చుట్టూ సంతోషంగా ఉన్న వారినిచూచి ఆనందించాలనుకోవడం ఇంకొక కారణం. మా మూడవ పెదతండ్రి నేను నడువలేక పోయినానని వేళాకోళం చేశాడు. కాని నేను ఇంటిదాకా నడువగలనని బింకంగా పలికాను. మేమంతా సంజవేళకు ఇల్లు చేరుకొన్నాము.



పిల్కు_గుడ్డలు అమ్మేవాడు.

# 14. ప్రేమబంధము

మా అక్కయ్యపెళ్ళికి ప్రయత్నం చాలరోజులు ముందునుంచే జరుగుతున్నది. కుట్టుపనులు, ఇతరపనులు కూడా చాలముందుగానే మొదలుపెట్టింది మా అక్కయ్య. కొన్నాళ్లు బడికివెళ్ళడం మానిందికూడాను. అయినప్పటికీ పెళ్ళిముహూర్తమునాటికి పనులు పూర్తికావేమోనని తొక్కిడిపడవలసి వచ్చింది. మా అమ్మగనుక బ్రతికిఉంటే ఇంత తొక్కిడిపడ నక్కర్లేదు. మా అక్కయ్య ఒక్కతే కాబట్టి ఆమెయే అన్నిపనులు చేసికోవలసివచ్చింది.

పెళ్ళి రేపనగా మగపిల్లవాని బంధువులు, స్నేహితులు వచ్చి పెళ్ళికూతురుకుట్టిన కుట్టుపనులన్నీ చూడడం మాలో ఒక ఆచారం. ప్రతి పెళ్ళికూతురుకూడా తాను బాగా కుట్టాననిపించుకోవాలని అనుకొనేది. మా అన్నయ్యపెళ్ళికి ముందుకూడా మా వదినె మా యింటికి తరుచు వస్తూ ఉండేది. మా అక్కయ్యనడిగి కుట్టుపనులు నేర్చుకొనేది. ఆమెవిషయంలో మాత్రం చివరకు తనకుట్టుపని అంతా ప్రదర్శించనక్కరలేకపోయింది. కుట్టుపనిలో మా వదినె అందెవేసినచేయి. రంగులు ఎన్నికచేసి జతపరచి కుట్టడంలో ఆమెకు ఆమెయే సాటి. మా నాన్నకూడా మా వదినె కుట్టుపనిచూచి చాలా మెచ్చుకునేవాడు.

మా అక్కయ్యకూడా బాగా కుట్టేది. మా వదినె అంత తొందరగా కుట్టలేకపోయేది. రంగుల ఎన్నికలో

మాత్రం కొంచెంచిక్కు వచ్చేది. ఈ విషయంలో ఆమెదేమీ తప్పులేదు. బజారులో సిద్ధంగా అమ్మే నమూనాలు ఆమెను కొనసీయక మా నాన్న ఆమెకోసం కొత్త నమూనాలు తయారుచేసి ఇచ్చేవాడు. ఈ కొత్తరకం నమూనాలు కుట్టడం మామూలువాటంత తేలికకాదు. కొట్లలో అమ్మేవి అయితే రంగులు ఎన్నుకోవడం తేలిక. మా నాన్న గీసియిచ్చే నమూనాలుకూడా అటువంటివేఅయినా గీతలు, వంపులుమాత్రం చాలకష్టం. కొన్ని నెలల ముందునుంచి కూడా మా వదిన మా అక్కయ్యకు కుట్టుపనిలో సాయ పడుతూనే ఉంది.

కాని యింకా పూర్తికావలసినది చాలాఉంది. మాదేశ ఆచారం ప్రకారం మగపిల్లవారు శోభనపుగదిలో ఒకకొత్తమంచము, ఒకటి రెండు బల్లలు, వానికితగ్గ కుర్చీలు మాత్రమే అమర్చేవారు. మిగిలిన అలంకారాలన్నీ పెళ్ళికూతురువారు ఏర్పరచవలసిందే.

మా విషయంలో మాత్రం పెళ్ళికొడుకు నాజూకయిన కొత్త కంచుతో చేసిన మంచము కావా లన్నాడు. కాని మా నాన్న పెళ్లికొడుకు తండ్రితో ఆలోచించి మిగత సామానుతో సరిపడే పూర్వకాలపు మంచమే ఏర్పాటు చేశాడు. ప్రక్కపై వ్రేలాడగట్టటందుకు మూడు చిత్రాలు తానువ్రాసి వాటికి చట్రాలు కట్టించాడు.

మా అక్కయ్య చేసినపని మరింత కష్టమయినది. ప్రక్కమీదికి ఒక దుప్పటి, పందిరిగుడ్డ, తలగడ గలీబులు,

రెండు సన్నని తెరలు, వీటన్నిటికి కుట్టుపని ఆమె చేసింది. ఇవిగాక వాకిటి తెరలు, కిటికీ తెరలు, మెత్తలకు గలీబులు, అద్దాల తొడుగులు, ఆమె దుస్తుల కన్నిటికి నగిషీలు – ఇవన్ని కూడ ఆమె కుట్టవలసినవే. ఆమె కాలిజోళ్లుకూడా ఆమెకుట్టి అమర్చుకోవాలి. ఈ పెద్దపనులుకాక సిల్కు-జేబురుమాళ్లు, పుస్తకాలలో పెట్టుకొనే సిల్కు-దారాలు, పెళ్ళిసమయంలో పెళ్ళికొడుకువైపు చుట్టాలకు పంచిపెట్టే పూలబుట్టలు మొదలయినవన్నీకూడా ఆమె చూచుకోవలసిన పనులే. వీటన్నిటిమీదకుట్టే నమూనాలు సాధారణంగా ప్రేమకు, సంతోషానికి, సుఖానికి చిహ్నాలుగా ఉండాలి. తామరపూల చాటున ఉన్న చక్రవాకాలు, పిట్టల జంటలు, నెమిళ్లు, గులాబిపూలు, సీతాకోక చిలుకలు, ఒకే తామరతూడుకు రెండు పూవులు, దూముడి గుర్తు, ఇవన్నీ కుట్టుపనిలో ఉండే కొన్ని నమూనాలు. ఇవన్నీ మనం కోరినవిధంగా అమర్చుకోవచ్చు.

మా నాన్నకు ఈ అమరిక అంటే చాలఇష్టం. కొన్ని చాల తేలికయినవి, కాని కొన్ని చాల కష్టమయినవి. ఒక వాకిటి తెర, ఒక పూలబుట్ట కలిసిన నమూనా మానాయన తయారుచేయడానికి కొన్నిరోజులు పట్టడం నేనెరుగుదును. ఆ నమూనాప్రకారం కుట్టడానికి మా అక్కయ్యకు ఇంకెన్ని రోజులు పట్టిందో చెప్పలేను. ఈ కుట్టుపని దారాలతో సంబంధించినది. అన్నికాలాలలోను యీ పని చురుకుగా సాగదు. హేమంతము, వసంతంలోనే ఇది బాగా సాగు

తుంది. కనుకనే మా అక్కయ్య పెళ్ళికి రెండు సంవత్సరాల ముందే యీ కుట్టుపనులు ప్రారంభించింది.

పెళ్లికి చేసేపనులు ఏవీకూడా చిక్కులు, పేచీలు లేకుండా సాగిపోవాలని మాలో ఒక నమ్మకము. ఒకప్పుడు మా అక్కయ్య కుట్టుపనికి కావలసిన నమూనా ఒకటి గీసిపెట్టుమని నాకుచెప్పారు. నేను ఆగీతలలో ఒకటి తప్పాను. అది మానాన్న దగ్గరకు తీసుకువెళ్లి తప్పులేకుండా ఇంకో కాగితంమీద గీస్తానన్నాను. మానాన్న అందుకు ఒప్పుకో లేదు. మొదలుపెట్టినది మార్చకూడదని ఆయన నమ్మకం. నాచేతిలోకాగితం తీసికొని ఆతప్పుగీత కమ్ముకు పోయేటట్లుగా మరికొన్ని గీతలు పెంచాడు. ఆ తప్పుగీత కనిపించ లేదు. అప్పుడే మా అక్కయ్యకుకూడా చెప్పాడు. ఒకవేళ ఏదయినా రంగుదారము తప్పుగ వాడినట్టయితే దాన్ని తీసి వేయవద్దని. వారినమ్మకము ఇటువంటిది కాబట్టి పెళ్లిపను లన్నీ ఎంతోజాగ్రతతో సాఫీగా పేచీలు, చిక్కులు లేకుండా సాగిపోయినాయి. మానాన్నకూడా ఏదైనా నమూనా గీయాలంటే ఎంతో ఆలోచించి ఎక్కడ తప్పువస్తుందోనని చాలజాగ్రతగా గీచేవాడు.

ఈ నమూనా లన్నింటిలో జారుముడి ఉపయోగించే నమూనా విషయంమాత్రం నాకు ముఖ్యంగా జ్ఞాపకం. ఈ నమూనా కుట్టుపనిలో చాలచోట్ల ఉపయోగింప బడుతుంది. కాని ఒక్క ప్రత్యేక సమయంలో మాత్రం యీ ముడి పెళ్లికూతురు తన చేతులతో తానే వేయడం

నేర్చుకోవలసిన అవసరముంది. ఇది మాలో బాగా పురాతన మయిన ఆచారం. అప్పటికే చాలమంది యీ ఆచారం గురించి పట్టుపట్టేవారుకాదు. కాని మా నాన్నమాత్రం మా అక్కయ్య యీముడి తాను స్వయంగా నేర్చుకోవాలని కోరాడు. పెళ్లికూతురు తొడిగే దుస్తులకు పూర్వకాలంలో బొత్తా లుండేవికావు. ఎఱ్ఱని పట్టుత్రాళ్లు రెండు ఉండేవి. దుస్తులు ధరించినప్పుడు ఆపట్టు బొందుత్రాళ్లు రెండూ దగ్గరగా లాగి గుండెకుదగ్గరగా ఱొమ్ముపై జారుముడివేసుకొనేవారు. శోభనపురోజున పెళ్లికొడుకు యీముడిని ఊడదీయాలి. ఈ జారుముడి ఊడదీయడంవల్ల ఆయన తనవంటి యింకొక హృదయం కనుగొంటున్నాడని నమ్మకం. ఈ జారుముడి చాల తేలికయినది. చాల అందంగా ఉంటుంది. పెళ్లికొడుకు ఈ ముడిని తేలికగా ఊడదీయగలడు. పెళ్లికూతురు ముడి సరిగా వేయకపోవడంచేతనో, పెళ్లికొడుకు కంగారుపడడం చేతనో ముడి తేలికగా ఊడకుంటే నూతనదంపతుల కాపురం అనుకొన్నంత సాఫీగా సాగదని ఒక నమ్మకం.

మా అక్కయ్య రెండు పట్టుపీలికలు తీసికొని యీ జారుముడి తప్పురాకుండా వేయడం నేర్చుకొన్నది. ఈ జారు ముడిని గురించిన అభిప్రాయ మొక మూఢనమ్మకమయినా ఎంతోభావంతో కూడుకొన్నదని నా నమ్మకం.

మా అక్కయ్య కిచ్చిన కట్నంలో రొక్కం తక్కువ. చాలమటుకు ఆమె దుస్తులు, కొద్దిపాటి నగలు, మానాయన రచించిన చిత్రాలు. పెళ్ళయిన మూడవనాడు పెళ్లికొడుకు

కుటుంబంవారు ఇద్దరుముత్తయిదువలను పిలిచి పెళ్లికూతురుకు గల దుస్తులు, నగలు లెక్కపెట్టించడం ఇంకొక ఆచారం. వస్తువులసంఖ్య ఎక్కువయితే పెళ్లికూతురికి పొగడ్తలు ఎక్కువ వచ్చేవి. మొత్తంమీద కట్నం ఎక్కువ యియ్యకుండా కూతురిపెళ్ళి చెయ్యడం చాలకష్టమే! సాధారణంగా కుటుంబానికి కావలసిన దుస్తులన్నీ సంవత్సరానికి రెండుసార్లు దర్జీలను పిలిపించి కుట్టించేవారు. కాని మా అక్కయ్య పెళ్ళికి కావలసిన దుస్తులన్నీ నలుగురు దర్జీలను పిలిపించి కొన్ని నెలలపాటు కుట్టించారు. మా అమ్మ తనకు కట్నంగా తెచ్చిన సిల్కులలో చాలభాగం వాడకుండా మిగిలిపోయినవి. ఈలోపలే ఆమె చనిపోయింది. అవన్నీ మా నాన్న మా అక్కయ్యకు కట్నంగా ఇచ్చాడు.

ముహూర్తానికి ముందుగా పెళ్ళిపనులు చేయడం ప్రారంభించారు. పెళ్ళికిముందురోజున మా అక్కయ్య కుట్టు పనులన్నీ ప్రదర్శించడం జరిగింది. మా కాబోయే బావగారి యిల్లు మాయింటికి రెండుమూడువందల గజాలదూరంలోనే ఉన్నప్పటికీ ఒక ఊరేగింపు ఏర్పాటుచేశాము. ఒక్కొక్క వస్తువు ఒక్కొక్కరితలపై ఉంచి పెద్ద ఊరేగింపుచేశాము. ఈవస్తువులన్నీ వీలయినంత ఎక్కువమంది చూడాలనే యీ ఏర్పాటు. ఊరేగింపుకుముందు ఇద్దరు రెండు పెద్ద ఎట్టిని దీపాలు పట్టుకునడువగా, భజంత్రీలు బాజాలు వాయించుతూ నడిచారు. ఇళ్ళలోనివారంతావచ్చి ఊరేగింపు చూడాలని యీ వాయిద్యాలు. ఊరేగింపు పెళ్ళికొడుకువారి యిల్లు

చేరేసరికి బాణాసంచ ప్రేలడం మాకు వినిపించింది. మా నాయనమ్మ ఊరేగింపువెంట నమ్మకమయినవారినొకరిని పంపి సారెనుగురించి ఎవరేమనుకుంటున్నారో విని రమ్మన్నది.

పెళ్ళినాటి ఉదయం పెళ్లికొడుకువారు పెళ్లికూతురు కోసం చక్కగా అలంకరించిన ఒక మేనా పంపేవారు. పెళ్ళి కూతురు స్నానమాడి, కొత్తదుస్తులుధరించి వెళ్ళేది. ఆ సమయంలోధరించే దుస్తులన్నీ ఎఱుపు, లేదా తోపురంగులో ఉండాలి. దగ్గరబంధువుచేత పెళ్లికూతురికి తలదువ్వి జడ వేయించేవారు. నుదుటిమీదనున్న పిల్లజుత్తుతీసివేసి సరిదిద్దే పని యిప్పుడే జరిగేది. దీనికి 'కైలీన్' అనిపేరు. ముఖం విశాలంగా కన్పింపజేసే కార్యక్రమమిది. పెళ్లికూతురు ఆనాడు మెత్తని ఎఱ్ఱకాలిజోళ్ళు తొడగాలి. ఆనాడు తన పుట్టినింటిలోగూడ ఆమె నేలపై కాలుపెట్టి నడువ గూడదు.

ఆమె బయలుదేరి వెళ్ళేముందు నలుగురు ఆడవారిని పిలిచి వారితో విందు జరిగేది. మా అక్కమనసు వేరే ఆలోచనతోనిండి ఉన్నందువల్ల కడుపునిండా తినలేక పోయింది. ఆ తర్వాత మా అన్నయ్య ఆమెను అలంకరించిన మేనా దగ్గరకు తీసుకువచ్చాడు. చుట్టాల యువకులు నలుగురు ఆ మేనావెంట వెళ్లారు.

పెళ్లి అయిపోయిన తర్వాత మా యింటిపనులలో సహాయపడినవారికి పెద్ద విందుచేశాము. వారంతా సంతోషంతో పెళ్లినిగురించి పొగడుకుంటూ వెళ్లారు. వారు మా నాయనమ్మతోను, నాన్నతోను "మీ అమ్మాయి భర్తతో

సుఖంగా కాపురంచేసి వచ్చేయేటి కొక కొడుకునుకంటే మనమంతాచూచి ఆనందించుదా" మని చెప్పి వెళ్ళారు.

నామటుకు నాకు పల్లెలో మా అన్నయ్య పెళ్లి జరిగినప్పుడే ఇంతకంటె ఎక్కువవినోదం, ఆనందం కలిగాయనిపించింది. నా జీవితంలోనే నాకొక పెద్ద మార్పు కనిపించింది. చుట్టాలంతా ఎక్కడివారక్కడ వెళ్ళిపోయిన తర్వాత నాకు దుఃఖం పట్టలేనంతగా పొంగివచ్చింది. మా నాయనమ్మ యిది కనిపెట్టి "ఆడపిల్ల పుట్టింటిలోనే ఉండి పోతుందా నాయనా? కొత్తయింటి కాపురంలో మీ అక్కయ్య సుఖంగా కాలం గడుపుతుంది. అదీ ఒక యింటికి యజమానురాలు అవుతుందిలే!" అని నన్ను ఓదార్చింది.

మరునాడు మధ్యాహ్నం మా నాయనమ్మ ఒక అగరునూనె సీసాయిచ్చి నన్ను మా అక్కయ్యగారి యింటికి పంపింది. పెళ్ళి అయినతర్వాత ఆడపిల్లతమ్ముడు అగరు నూనె తెచ్చియివ్వడం ఆచారం (నౌకరులు తెచ్చినా నేను వెంటవెళ్ళి యివ్వాలి). నేను మా అక్కయ్యను చూచాను కాని బంధువులంతా చుట్టుముట్టి ఉన్నందువల్ల మేము మాట్లాడుకోవడం పడలేదు.

నాలుగవనాడు మా అక్కయ్య, బావ మా యింటికే వచ్చారు. మా నాయనమ్మ మా అక్కయ్య స్నేహితురాండ్రను పిలిచి ఒకవిందు చేసింది. అప్పుడు మా అక్కయ్య మాటకారితనానికి నేనే ఆశ్చర్యపోయాను. అందరికంటె మా అక్కయ్యదే పైగొంతు. మా బావే చాల సిగ్గుపడు

తున్నాడు. మా అక్కయ్య స్నేహితురాండ్రు అందిచ్చే సారా తాగలేకపోయినాడు కూడా. సారా అందిచ్చినప్పుడు తిరస్కరించడం మర్యాదకాదు. అందుచేత విందుఅయ్యేసరికి మా బావ తప్పత్రాగాడు. మర్యాదలన్నీ జరిగాయి. నేను మాత్రం మా అక్కయ్య యింతమాటకారిగా మారిపోయి నందుకు ఆశ్చర్యపోయాను.



అగరువత్తులు అమ్మేవాడు.

# 15. దేవకన్యక

"ది సైలంట్ ట్రావెలర్ ఇన్ లండన్" అనే పుస్తకంలో నే నీకథ వ్రాశాను. అది యేమిటంటే, "స్వర్గానికి రాజైన ఇంద్రుని మనుమరాలు ఒకతె వెండినదికి తూర్పుగా కాపురముంటున్నది. ఆమె దేవతావస్త్రాలు నేస్తుంది. ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఇంత నేర్పుగల తన మనుమరాలు ఒంటరిగా ఉండిపోయినదని ఆలోచించి ఆ వెండినదికి పడమరగాఉన్న ఒక గొల్లవానికిచ్చి పెళ్లి చేశాడు. దురదృష్టంకొద్దీ ఆమె తెలివితేటలు క్షీణించాయి. చివరకు నేతపని మానివేసింది. రాజు కోపగించుకొని ఆమెను తన పూర్వపుచోటికే చేర్చాడు. సంవత్సరానికొకమారే ఆమె తన భర్తతో కలిసి ఉండాలని దేవేంద్రుని ఆజ్ఞ. సంవత్సరంలో ఏడవనెల ఏడవరోజునే కలవాలని శాపం. భూలోకంలో ఉన్నవారు, కన్నెలు తమ స్నేహితురాండ్రను పిలుచుకొని ఆ దేవకన్యనుగురించి పూజలు, ప్రార్థనలుచేస్తారు. తమకు నేతలోను, కుట్టుపనిలోను మంచి తెలివితేటలు కలిగించాలనివారు ఆమెను ప్రార్థిస్తారు. మంచిభర్తలను ప్రసాదించుమనికూడా కన్యకలు కోరుతారు. అందుకనే ఈ ఉత్సవానికి 'కన్యకల ఉత్సవము' అని పేరువచ్చింది.

ఈ ఉత్సవానికి సంబంధించిన విందు పూర్తిఅయి పోయినతర్వాత మగపిల్లలకు మిగత కార్యక్రమంతో పని ఉండదు.

కాని ఒక సంవత్సరం మాత్రము మా బంధువుల అమ్మాయి ఒకతె యీ ఉత్సవం చేస్తుండగా మేము చివరి వరకు ఉండడం తటస్థించింది. ఆమె చాలకాలంగా కుట్టుపని నేర్చుకుంటున్నది. ఆమె శరీరం చాలా లావు. చేతులుకూడా లావే. చేతివ్రేళ్లు ఉండ్రడంముక్కలంత లావుగా ఉన్న కారణాన ఆమె సూది పుచ్చుకొని అల్లికపనులు చేయ గలిగేదికాదు. అందరు ఆమెను ప్రోత్సహించడానికి మంచిగా చెప్పినా ఆమె పనితనాన్ని ఎవరూ మెచ్చుకొనేవారుకాదు. మా పెదతల్లి ఒకామె ఆ అమ్మాయికి 'కన్యకల ఉత్సవం నాడు నీవా దేవకన్యకు మ్రొక్కుకొంటివా నీకు మంచినేర్పు అలవడుతుంది' అని చెప్పింది. అల్లికలు, కుట్లు చేయడానికి తన శరీరం అనుకూలపడక పోయినా దేవకన్య తనకు తోడ్పడుతుందని ఆమె నమ్ముకొని కన్యకల ఉత్సవం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నది. పెద్దవాళ్ళయిన ఇతర ఆడపిల్లలు ఉత్సవానికి లాంఛనంగా వచ్చినా కుమాటుమాత్రం పట్టుదలతో పాల్గొన్నారు.

విందయి పోయేసరికి ఇంకా వెలుతురు ఉన్నది. అవసరమయితే వారికి సాయపడవచ్చు ననే ఉద్దేశంతో మేము మగపిల్లలము ఆడపిల్లలతోపాటు తోటలోకి వెళ్లాము.

మేము అక్కడున్న బల్లను నీడలోకి పట్టాము. తర్వాత ధూపంవేసేపాత్ర, కొవ్వొవత్తిదీపాలు, పిండివంటలపాత్రలు, రొట్టెలు, పండ్లు ఆ దేవకన్యకు నైవేద్యం పెట్టేటందుకు

ఆ బల్లమీద అమర్చారు. తర్వాత బాణాసంచ కాల్చారు. తోటలోని ఆరుబయట ఈ కన్యకలు మూడుమారులు సాష్టాంగనమస్కారాలు చేశారు. మగపిల్లలంతా ప్రక్కగా నిలచిఉన్నారు. నమస్కరించే కన్యకలంతా ఒక్కమాట అయినా పలుకకుండా ఎక్కువభక్తితో నిలువబడ్డారు. లావుగా ఉండే మా బంధువుల అమ్మాయి అందరికంటె భక్తితో మ్రొక్కింది. ఈ పూజ అయినతర్వాత వారంతా ఎడమ చేతితో సూదులు పట్టుకొని ఒక పట్టుదారం సూది తూము గుండా ఎక్కించాలని ప్రయత్నించారు. ఎవరు ఎంత త్వరగా దారము ఎక్కించగలిగితే వారికి అంతనేర్పు ఉన్నట్లు లెక్క. ప్రొద్దుగుంకుతున్నా దారము ఎక్కించడానికి కావలసిన వెలుతురు మాత్రం ఉన్నది. అక్కడున్న వారిలో ఇద్దరు మాత్రం వెంటనే దారం ఎక్కించారు. లావుగాఉన్న మా బంధువుల అమ్మాయిమాత్రం కళ్లు పెద్దవిచేసి పెదవులు మామూలుకంటె గట్టిగా బిగించి దారం ఎక్కించడానికి మొదలుపెట్టింది. ఆమె అనుకొన్నంత తేలికగా, సాఫీగా కాకపోయినా మొత్తానికి ఆమె మాత్రం చివరకు మిగిలి పోకుండా పూర్తిచేయగలిగింది. అయితే చిట్టచివరకు మిగిలిం దెవరో తెలుసా! నిజంగా అందరికంటె నేర్పుగల అమ్మాయి. ఏ కారణంచేతనో చివరకు మిగిలింది. బహుశా మా చుట్టాల అమ్మాయిమీది దయచేత అలా చివరకు మిగిలిపోయి ఉంటుంది.

ఈ ఉత్సవంలో ముఖ్యమయిన ఇంకొక కార్యక్రమం ఏమిటంటే కన్యకలందరు తెల్లని పింగాణిపాత్రలో కొండనీటిని నింపి తమపేరువ్రాసిన చీటితో ఒక బల్లమీద ఉంచాలి. అలా ఆ బల్లమీద రాత్రిఅంతా ఉంచాలి. తెల్లవారేసరికి పాత్రలలో సగంనీరు ఇగిరిపోయి ఉంటుంది. కన్యకలందరూ ఒకే పొడవుగల గడ్డిపోచలు కత్తిరించి ఆనీటి మీద జాగ్రత్తగా వదలాలి. ఈ కొండనీటి కొక వింతగుణ ముంటుంది. గడ్డిపోచలు మునిగిపోకుండా నీటిలో తేలుతాయి. తెలివితేటలతో నిలబెట్టితే గడ్డిపోచ నీటిమీద తేలుతుంది. గిన్నెల అడుగునఏర్పడ్డ నీడనుబట్టి ఎవరునేర్పుకలవారో నిర్ణయిస్తారు. చాలతక్కువ నీడపడితే కుట్టుపనిలో మంచినేర్పు కలదని అర్థం. లావుగాఉండే మా చుట్టాల అమ్మాయి పింగాణిగిన్నెలో గడ్డిపోచ నిలబెట్టాలని ఎంతో ప్రయత్నించింది. కాని లాభంలేకపోయింది. గిన్నె కదలిపోయి గడ్డిపోచ నీటిలో మునిగిపోయింది. ఆమెవిచారానికి అంతులేదు. చుట్టునున్న మేమంతా నవ్వకుండా ఉన్నాము. మిగిలిన ఆడపిల్లలుకూడా "ఇది ఒక పెద్దపరీక్షా యేమిటి? ఆ దేవ కన్యకకు నిజంగా వరాలుఇచ్చే శక్తి ఉన్నదా?" అంటూ ఓదార్చారు. వీరిమాటలు ఆమెకు ఓదార్పు కలిగించలేదు. ఆమె అక్కడనుంచి వారియింటికి వెళ్ళిపోయింది.

ఈ దేవకన్యకను కుట్టుపనిలో నేర్పు కలిగించుమని ఎందుకు ప్రార్థించాలి? ఆ దేవకన్యక తనప్రియుడైన గొల్లపిల్ల

వాణ్ణి చేసుకోవాలనే ఆమెకోరిక. కాబట్టి తమప్రియులను చేసుకోవాలనే కోరిక గలవారంతా దేవకన్యకను ప్రార్థించాలి. కుట్టుపనికి ఆమె యివ్వగలిగిన వరమేముంటుంది ?

అర్థంలేని యీ ఆచారాన్ని ప్రవేశపెట్టిన మా పూర్వుల మాటలలో మా దేశంలోని కన్యకలంతా మోస పోయి ఉంటారని నానమ్మకము.



గ్రుడ్లు అమ్మేవాడు

# 16. పాతివ్రత్యము

ఏ కొద్దిరోజుల్లో తప్ప 'లైమామా' మా కుటుంబంలో నలభై సంవత్సరాలుగా ఉంటున్నది. మా కుటుంబంలో మా నాన్నకు దాదిగా ప్రవేశించి ఆయన పెద్ద అయినతర్వాత మా యింటి సేవకురాలిగా ఉండిపోయింది. నాకు ప్రాజ్ఞత వచ్చిననాటికి మా యింటిలో ఆమెను మా నాయనమ్మతో పాటు గౌరవించేవారు. మేము చిన్నవాళ్లమంతా ఆమె చెప్పుచేతలలో ఉండేవాళ్లము. ఒకసారి ఎందుకో ఆమె చెప్పినపనిచేయనని నేనుమొండికి వేశాను. అలాఅన్నందుకు మా నాయనమ్మ నన్ను కేకలువేసింది. మా నాన్న నన్ను కఱ్ఱతో కొట్టడానికి కూడా సిద్ధపడ్డాడు. లైమామా నన్ను దగ్గరకుతీసికొని మా నాన్నతో దెబ్బలుతినకుండా కాపాడింది. వాస్తవానికి మా నాన్న నన్నెప్పుడూ కొట్టలేదు.

లైమామా మాయింట్లో ప్రవేశించేనాటికి ఆమెకు పాతికసంవత్సరాలు. ఆమెకు పెళ్లిఅయింది. ఆమె భర్తకూడా మా కుటుంబసేవకుడుగా ఉన్నాడు. వారిద్దరికీ చదువురాదు. కాని వారిద్దరు చాలనమ్మకంగా విశ్వాసంగా కన్‌ఫ్యూసియన్ సిద్ధాంతాలు తూ, చా తప్పకుండా పాటించేవారు. కొన్ని సంవత్సరాల తరువాత వారిద్దరూ మా భూములున్న వారి సొంతజిల్లాకు వెళ్లారు. అక్కడ మా రైతులుగా ఉన్నారు. పంటలువచ్చే రోజుల్లో లైమామా క్రొత్తపంట తీసికొని మాయింటికి వచ్చేది. ఏడాది పొడుగునా మా పొలాలలో పండిన కూరగాయలన్నీ లైమామా, మాకు తెచ్చియిస్తూ

ఉంటుంది. కూరలు తెచ్చినప్పుడల్లా పల్లెజీవితపు ముచ్చట లన్నీ మాకు చెపుతూఉండేది.

ఆమెకున్న ఒక్కకొడుకు కూడా చిన్నతనంలో చనిపోయాడు. మరికొంతకాలానికి ఆమెభర్తకూడా గతించాడు. మా నాయనమ్మ లైమామాను మా యింటికి వచ్చివేయుమని పిలిచింది. ఈ ఆహ్వానం ఆమెకు సంతోషం కలిగించినా, ఆమె భర్త, ఆమె చిరకాలం నివసించిన భూములు వదలి రావడానికి ఆమె ఇష్టపడలేదు. ఆమె ఉత్తమ ఇల్లాలుగా కన్ఫ్యూసియస్ సిద్ధాంతాలు, పతివ్రతాధర్మాలు పాటించేది. మా నాయనమ్మ ఆమెకు కబురుచేసింది : "నీ యిష్టం వచ్చినప్పుడు పొలాలదగ్గరకు వెళ్ళిపోవచ్చు. ఇంటిలో కూరగాయలు పండించవచ్చు" అని. లైమామా ఇందుకు ఇష్టపడింది. మా యింటికి వచ్చేసింది. మా యింటి వాడుకకు కావలసిన ధాన్యము, కూరగాయలు ఇవన్నీ కొనడంలో లైమామా మాకెంతో సహాయకారిగా ఉండేది. పట్టణంలో పండే కాయగూరలు మంచినేలలో పండవనీ పల్లెటిదిక్కున కాసిన కూరలరుచి పట్నవాసంవాటికి రాదని మా నాయనమ్మ అంటూఉండేది. నేనుకూడా ఈ అభిప్రాయం బాగా నమ్ముతాను. లైమామా మా పిల్లలందరితో ఆ యా కాలాల్లో వచ్చే కాయగూరలు, పండ్లు గురించి చెపుతూ వాటిని మాకు ఎలా వండిపెడుతుందో చెప్పేది. పండ్లు, కూరలు వీటిని గురించి ఏవేవో కట్టుకథలు మాకు చెపుతూఉండేది.

పండివచ్చిన క్రొత్త బియ్యమంటే మాకు ఎక్కువ ఇష్టము. పంటలు కోతల కాగానే మా రైతులు మాకు క్రొత్తబియ్యము తెచ్చియిచ్చేవారు. బాగా దంచిన బియ్యం కంటె యీ పోటుతక్కువ బియ్యము వండితే ఎఱ్ఱగా ఉండి ఏదో వింతవాసనకూడా వచ్చేది. మేము ఆ పల్లెటూరి నుంచి వచ్చిన బియ్యపుఅన్నము ఎంతో సంతోషంగా తినే వాళ్లం. మాకు ఈ పోటుతక్కువ బియ్యపు అన్నం వడ్డిస్తా రంటే మా కెంతో ఆనందం. ఏడాది కొకమాటు వచ్చేది గనుక మా కంత ఆప్యాయత అనుకొంటాను. కోతలయిన కొత్తరోజులలో వచ్చేవి. మళ్ళీ ఏడాదిదాకా మా కవి దొరకవు. మా పెద్దలు నిజానికి మా రైతులతో ఏడాది పొడుగునా ఇటువంటి బియ్యమే యిమ్మని చెప్పిఉంటారు. కాని వారేదో సాకుచెప్పి పోటు ఎక్కువవేసిన తెల్లబియ్యమే పంపుతూ ఉండేవారు. వారికి 'విటమిన్' అనేమాట తెలియక పోయినా మావాళ్ళు పోటు తక్కువవేసిన బియ్యం లో నే మంచి గుణండున్నదని చెపుతూఉండేవారు. ఆకుకూరలలో కల్లా బలమయిన ఇంకొకకూరకూడా నాకు బాగా తెలుసు. ఆకూర బంగారురంగు పూలతో ఉండేది. ఆకూర మాప్రాం తంలో పండేదికాదు. మేము ఆ కూరకొనేసరికి ఆ పచ్చని పూలు ఎండిపోయేవి. ఈ కూర చిన్నమాంసపు ముక్కలతో కలిపివండితే మంచిరుచిగా ఉండేది. రక్తంపట్టడానికి ఈ కూర చాలమంచిది కూడాను. నామటుకు నాకు యీకూర చాలయిష్టము. ఈకూర బాలెంతరాళ్లకు కూడా వండి పెట్టుతారు.

నడి వేసవికాలంలో మధ్యాహ్న భోజనమయిన రెండుగంటలకల్లా లైమామా మాకు లిలీ మొగ్గల పాయసం వండిపెట్టేది. మా ఇంటిదాసీలు లిలీమొగ్గలు శుభ్రంగా కడిగి యివ్వగా అందులో చిన్నవి యేరి, నీటితో ఉడుకబెట్టి ఇంకోక గిన్నెలో పంచదారతో ఉడుకబెట్టి పాయసం వండేది. బాగా చల్లారిన తర్వాత యీ పాయసం అమృతంతో సమానంగా ఉండేది.

లైమామా ఉత్తమ ఇల్లాలుగా ఎలా జీవితం గడిపిందో ఇదివరకు వ్రాశాను. ఆమెభర్త పోయిన తర్వాత లైమామా పరపురుషునితో మాట్లాడికూడా ఎరుగదని మా పెద్దలు చెప్పారు. మా కుటుంబంలోని మగవారయినా ఆడ నౌకరుల ద్వారానే ఆమెతో చెప్పవలసిన విషయాలుచెప్పి పంపేవారు. ఆమె పతిభక్తికి నిదర్శనమయిన సంఘటన ఒకటి నేను పుట్టక పూర్వం ఎప్పుడో జరిగిందట. కాని ఆ వృత్తాంతం నాకు ప్రాజ్ఞత వచ్చిన తర్వాత చాలసార్లు విన్నాను. నే విన్నకథ: "లైమామా పెనిమిటి చనిపోయి పది సంవత్సరాలకు పైగా అయింది. ఒక్కొక్కప్పుడు ఆమె మా కుటుంబానికి కావలసిన వస్తువులు తేవలసివచ్చేది. అప్పుడుకూడా ఆమె ఇతరులతో మాట్లాడి యెఱుగదు. కావలసినవన్నీ చీటీ వ్రాయించుకొని వెళ్ళి, దుకాణదారుకు చూపించి తెచ్చేది. ఇలా చాలకాలం సాగిపోయింది. ఒకనాడు ఆమె ఒకదుకాణం దగ్గర మానాయనకు కావలసిన రంగులు కొంటున్నది.

దుకాణదారు ఆరంగులు అందిస్తూఉంటే లైమామా చేయి తగిలింది. లైమామా ఆ వస్తువులను దుకాణంలోనే పారవేసి బోరున ఏడుస్తూ ఇంటికి వచ్చింది. ఆమె దుఃఖానికి కారణం మా నాయనమ్మ తెలిసికొన్నది. మానాన్న దుకాణదారు చేత క్షమార్పణ చెప్పించాడు. కాని ఆమెదుఃఖం మానలేదు. చనిపోయినభర్తకు అపచారం చేశానని ఆమె చాల విచారించింది. ఆనాటినుంచి ఆమె మాతోట, ఇల్లు కదలి వెళ్ళలేదు ”

లైమామా ముసలిదయినకొద్దీ మా కుటుంబంలో మనిషిగానే ఉండేది. ఆమె ఆరోగ్యవిషయమై మావాళ్లు శ్రద్ధ పూనేవారు. కాని ఆమెమాత్రం ఆమెపనులు మానకుండా చేస్తూనేఉండేది. మా కుటుంబం దయతో చూడబట్టే యిన్నాళ్లు బ్రతకగలిగానని ఆమె చెపుతూవచ్చింది. నాకు బంధువులు, వారసు లెవరూ లేరుగదా! మీా పూర్వుల సమాధుల వెంబడే నన్నుకూడా సమాధిచేయండని ఆమె చివరిసారిగా కోరుకొన్నది. మా నాయనమ్మ ఆమె కోరిక ప్రకారమే జరిగిస్తానని మాటయిచ్చిన తరువాతనే ఆమె నిశ్చింతగా ప్రాణం విడిచింది. చచ్చేనాటికి ఆమెకు డెబ్బది తొమ్మిది ఏళ్లు. అప్పటికి నాకు ఏడుఏళ్లు. ఆమెకు అంత్యక్రియలు చాలవైభవంగా జరిగాయి. పిల్లలము మేమంతా ఆమెకోసం చాల విచారించాము. మా పూర్వుల సమాధుల ప్రక్కనే ఒక స్థలంకొని అందులో ఆమెను సమాధిచేశారు. ఆమె ఆత్మశాంతికోసం మేము మా పూర్వుల సమాధులు

దర్శించినప్పుడల్లా లైమామా సమాధికూడా దర్శించేవాళ్ళం. మా కుటుంబంలో ప్రతిక్షణం ఆమె మాటలే చెప్పుకుంటూ ఉంటాము.

ఈ నాటి నవనాగరకతలో లైమామా తనవైధవ్యంలో భర్తపై చూపిన భక్తి పరిహాసంగా కన్పించవచ్చు. నిజానికి ఆమె అందరికంటె ఎక్కువ కఠినంగా గడిపిందనే చెప్పాలి. కన్‌ఫ్యూషియస్ స్త్రీ పురుషులమధ్య ఏర్పరచిన కొన్ని నియమాలను మా వారు అతికఠినంగా పాటించారు. లైమామా వాటిని తూ చా తప్పకుండా పాటించింది. ఆమె తరంవాళ్ళంతా దుకాణదారుతో జరిగిన సంఘటన మెచ్చుకొన్నారు. దుకాణదారు బుద్ధిపూర్వకంగా చేయకపోయినా తనచేయి తగిలించడం చాల తప్పని అందరూ అతనిని నిందించారు. భర్త పోయిన స్త్రీలు జీవితాంతం విధవలుగా గడపాలని పండితుల మతం. చక్రవర్తులుగూడ అటువంటి వారిని ఎక్కువ గౌరవించేవారు.

భర్తపోయిన తర్వాత పెళ్లిచేసుకొన్న స్త్రీలకు సంఘంలో గౌరవం ఉండేది కాదు. ఆ కారణంచేతనే లైమామా ఉత్తమ పతివ్రతగా గౌరవం పొందింది. నేను కూడా ఆమె పరమ విశ్వాసాన్ని, ఉత్తమ ఆదర్శాన్ని చాల మెచ్చుకుంటాను. భర్తయందు నిజమయిన ప్రేమ లేకుండా, ఉత్తమ గుణమని చెప్పారుగదా అనిమాత్రం పాటించడం నాకు నచ్చదు.

ఈ విషయమంతా ఆలోచించుకొంటే చైనాలో ప్రేమను గురించిన తత్త్వం అందరికీ అందుబాటులో లేకుండా ఎక్కడో మారుమూలలలో బంధించి ఉంచారని తోస్తుంది. చైనాసంస్కృతి అంతా ఎంత అందంగా అలంకారాలతో నిండి ఉంటుందో యీ ప్రేమతత్వంకూడా అంత చక్కని నేర్పుతో, ఆచార వ్యవహారాలనే మెఱుగులతో బంధింపబడి ఉన్నది. పైనఉన్న యీ అందమయిన మెత్తని పొరలన్నీ ఛేదించి ప్రేమతత్వం తెలిసికోవడానికి పూనుకోరు. కాబట్టి ప్రేమగల హృదయం తెలిసికోవడమంటే అతి కష్టమయినపని.

లైమామా తన భర్తను హృదయ పూర్వకంగా ప్రేమించలేదని చెప్పడం నా ఉద్దేశంకాదు. ఆమె జీవితాంతం తన భర్తను ప్రేమించింది.

ఆయన తనభర్త అని ఎఱిగినంత మాత్రం చేతనే ఆమె తన జీవితాంతం ప్రేమించి తీరాలని నిశ్చయించుకొన్నదా అని నా అనుమానం. లోకాపవాదానికి లెక్క చేయకుండా ఆమె హృదయాన్ని ఆమె విప్పి చెప్పుకొనే అవకాశమే ఆమెకు ఉండి ఉంటే, ఆమె జీవితం ఇంకొక రకంగా ఇంతకంటె ఎక్కువ సుఖంగా గడిపి ఉండేదేమో అనిపిస్తుంది. ఏలోకంలో అయినా ఆమె యీ విషయంలో ఆమెకు నేను అన్యాయం చేస్తున్నట్లు అనుకొంటే యిదే ఆమెకు నా క్షమార్పణ. ఆమె పెరిగిన ఆచార వ్యవహారాల లోనే నేనుకూడా పెరిగాను. అటువంటప్పుడు విమర్శించాలనే

అభిప్రాయం నాకు కలుగనే కూడదు. తరువాత నా జీవితంలో అనేక మార్పులు జరగడం కళ్లార చూచాను. కన్ఫ్యూషియస్ చెప్పిన సిద్ధాంతాలు ఇంత అసహజంగా ఆచరిస్తారని ఆయన గ్రహించి ఉండడనే ఊహ నాకు కలిగి తీరుతుంది. ఆయన సిద్ధాంతాలకు వ్యాఖ్యానాలు చేసినవారిని నిందించ వలసి ఉంటుందేమో. ఎందుచేతనంటే వారెవరుకూడా పురుషులు తమ భార్యలు పోయినతర్వాత వివాహమాడటం న్యాయం, ధర్మం కాదని లోకానికి చెప్పలేక పోయినారు. స్వార్థపరులై మన పూర్వులు ఎంత దిట్టమయిన ఆచారాలు సృష్టిచేసి పెట్టారో ఆశ్చర్యంగా కనిపిస్తుంది.

అయితే అటువంటి పద్ధతి ఉత్తమనీతిని బోధచేస్తుందనటంలో సందేహంలేదు. భర్త చనిపోయిన అనంతరం కూడా కఠినమైన వ్రతం జరుపాలనిచెప్పినప్పుడు భర్త జీవితకాలంలో ఆయనయెడ భార్య ఎంత ప్రేమవిశ్వాసాలు ప్రకటించాలో వేరే చెప్పాలా? దృఢమయిన శీలంతో, ఏ ప్రలోభాలకు మోసపోని స్త్రీలు ఎంతో పూజింపబడేవారు. నిబ్బరంలేని స్త్రీలు తప్పుదారులబడినవారు, సంఘంలో గౌరవం గోల్పోయి అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకొన్న ఘట్టాలుకూడా ఉన్నాయి.

అన్యాయమార్గంలో అంతులేని మొత్తాలు సంపాదించిన పురుషులు వేశ్యలను పోషించగలరు. సంఘంలో వారికి ఏమాత్రం గౌరవం ఉండదు. శీలంలేని స్త్రీలెవరో వ్యభిచారంతో జీవితం గడపడానికి ఒప్పుకొంటారు. వారికి

సంఘంలో స్థానంలేదు. కన్ఫ్యూషియస్ సిద్ధాంతాలలో పెరిగిన స్త్రీలు, బాలికలు వ్యభిచారాన్ని ఆజన్మాంతం వ్యతిరేకిస్తారు. వేలసంవత్సరాలుగా చూచినా ఎందరో ధనానికి, దాష్ట్యానికి లోబడక ప్రాణాలు గోల్పోయినారు. ఈ విషయంలో లైమామాను తప్పకుండా మెచ్చుకోవాలి. మా ఇంటిలో ఉండక ఇంకెక్కడ ఉన్నా, ఆమె దారిద్ర్యం అనుభవిస్తూ అయినాసరే కష్టాలు అనుభవిస్తూ పతిభక్తితో జీవించేదనే నా గట్టి నమ్మకం. ప్రపంచసుఖాల నన్నిటినీ కాలదన్నిపారవేసి పాతివ్రత్యంతో కాలం గడుపగల శక్తి సామర్థ్యాలు ఎంతమందికి ఉంటాయి?

ఈ చర్చలంతా ముగించి, మా కుటుంబంలో ప్రతి ఒక్కరి మనసులోను మరపురాకుండా మెదలుతున్న లైమామాకు నా కృతజ్ఞత చెప్పుకోవాలి. మాపెద్దలు ఏవిషయంలోనయినా లైమామా ఆదర్శజీవితమే పొగడుతూ ఉండేవారు. ఇంట్లో, తోటలో అన్నీ సరిగాఉన్నాయని చూడందే ఆమె నిద్రపోయి యెఱుగదు. ఆమె ఎంతో ఓపికతో రుచియైన కూరలు, వంటకాలు వండిపెట్టేది. మా అక్కయ్య, ఇతర ఆడపిల్లలు ఆమెదగ్గర ఎన్నోరకాల వంటలు నేర్చుకొనేవారు. రుచియైన కూరలు, పిండివంటలు తిన్నప్పుడల్లా లైమామా ముచ్చట చెప్పుకోకుండా ఉండలేము.

మా కాలిజోళ్ళ విషయములో కూడా మేము లైమామాను మరచిపోలేము. వర్షకాలములో తప్ప మేము

ఎప్పుడూ తోలుచెప్పులు తొడుగుకొని ఎఱుగము. మా జోళ్ళు పట్టుతోను, గుడ్డలతోను చేస్తారు. జోళ్ళ అడుగుభాగంకూడా గుడ్డలే. కనుక కుట్టడంలో మంచినేర్పు కావాలి. మా పినతల్లులు, పెదతల్లులు, అక్కయ్య, ఇతర ఆడపిల్లలు తమతీరిక కాలంలో కుటుంబంలోని మగవారందరికీ జోళ్లు తయారుచేస్తారు. ఆడవారు, పిల్లలజోళ్ళమీద పూలు కుడతారు. మా అక్కయ్య, ఇతర ఆడపిల్లలు జోళ్లు కుట్టడానికి చాల కుతూహలపడేవారు. అడుగుభాగాలు మాత్రం లైమామా కుట్టవలసిందే. ఏడాదిలో ఆమె యెన్ని జోళ్ళుకుట్టేదో లెక్కలేదు. రాబోయే తరమువారు చేతితో కుట్టిన జోళ్ళు అంటే అసలే ఎరుగకుండాపోతారుగదా అని నా విచారము.



అన్నం అమ్మేవాడు

# 17. దీపాల పండుగ

నేను చైనాలో పుట్టకపోతే దీపాలపండుగకు జరిగే వినోదం నేను ఎరుగకపోయేవాణ్ణి. సంవత్సరంలో మొదటి నెల పదిహేనవరోజున యీపండుగ జరుగుతుంది. కాని మా కియూకియాంగ్ పట్టణంలో పదమూడవ రోజు మొదలు పదిహేనవ రోజుదాకా ఇది జరుగుతుంది.

సంవత్సరాది పండుగ మొదలు ఈ పండుగవఱకు పట్టణములో చాలా దుకాణాలు మూసే ఉండేవి. ఎక్కడ చూచినా జనం వస్తూ పోతూ ఉండడం, క్రొత్తసంవత్సర అభివందనాలు తెల్పుతూ ఉండడం జరిగేది. దీపాలపండుగ దగ్గరపడేకొద్దీ వీథులవెంట రకరకాల దీపాలు అమ్మకానికి వచ్చేవి. నాకు బాగా జ్ఞాపకం. మాయింటి ముందుగా ఒక దీపాల వర్తకుడు మేము పిల్లలమంతా చూచి కొనుక్కోవాలని కేక వేస్తూ వెళ్ళేవాడు. అతనిదగ్గర పక్షులు, జంతువులు, పూలు, ఒకటేమిటి అన్ని ఆకారాలలోనూ దీపాలు ఉండేవి. సందులలో, వీథులలో పెద్ద పెద్ద దీపాల ప్రదర్శనాలుండేవి. మాయింటి కెదురుగా బజారులో జరిగే ప్రదర్శనానికి మాకుటుంబమే ఖర్చు భరించేది. ఈదయ్యపు దీపాలు పెద్ద పెద్దవి. వెదురుపుల్లలతోను, పల్చని రంగు రంగుల సిల్కుగుడ్డలతోను వీటిని తయారుచేసేవారు. పంచ రంగులలో ఇవి ఉండేవి. ఈ దయ్యపు ఆకారంగల దీపాలను పదముగ్గురు లేదా పదిహేనుమంది కలసికట్టుగా మోసుకు రావాలి. తలదగ్గర, తోకదగ్గర ఉండేవాళ్లు ప్రత్యేకంగా

మంచి దండపుష్టిగలవాళ్ళు అయిఉండాలి. అంతటిలోకి తల పెద్దది. బరువుగా ఉంటుంది. అక్కడే ఏభై లేక యింకా ఎక్కువ క్రొవ్వువత్తులు వెలుగుతాయి. ఈ వత్తులన్నీ వెలిగేటట్లు చూడడంతోపాటు తలదగ్గర పట్టుకొన్నవాడు ఆ దయ్యాలనాట్యం బాగా తెలిసినవాడయి ఉండాలి. విశాలమైన స్థలముంటే ఈ జట్టువారు ఆ యింటిలోనే యీ ప్రదర్శన మిచ్చేవారు. ఈ దయ్యపుదీపానికి ముందుగా ఎఱ్ఱని సిల్కుబంతి ఆకారంలోఉన్నది ఒకటి పుచ్చుకొని నలుగురు మనుష్యులు వస్తారు. ఈ బంతి కదలినకొద్దీ దానిని పట్టుకోవడానికి దాని మీదికి దూకుచున్నట్లు ఈ దయ్యం కదిలేది. బంతులు అటూ ఇటూ కదులు తుంటే దయ్యం కూడా దానితోపాటు కదులుతుండేది. ఈ సందడికితోడు చుట్టూఉన్నజనం కేకలు పెట్టేవారు. దాని వెంటవచ్చిన వాయిద్యాలవారు పెద్దపెట్టున వాయించేవారు. ధ్వని హెచ్చినకొద్దీ నాట్యం వేగంగా సాగుతుంది. నా చిన్నతనంలో యింత ఆనందం కలిగించిన ఆట యింకొకటి లేదు. అటువంటిది ఏడాది కొక మాటయినా చాలు. ఒకే రాత్రి మేము కావాలంటే అటువంటి నాట్యాలు ఎన్నయినా చూడవచ్చు. ఇంటికి వచ్చిన ప్రతి జట్టువారు ఇటువంటి నాట్యాన్నే చేసేవారు.

ఈ నాట్యప్రదర్శనలో ముఖ్యమయినభాగము ఒకపెద్ద ఊరేగింపు. దానిచివర ఆకాలానికి అనుకూలమైన, అందమైన దుస్తులు ధరించి కఱ్ఱలమీద నడిచేవారు కొందరుంటారు. పగటిపూట వేరువేరు జట్టులవారు తమప్రదర్శనము ఏర్పాటు

చేయించండని కోరడానికి ఇంటింటికి వచ్చేవారు. ఈ సందడి అక్కర్లేదనుకొన్నవారు ఊరికే ఉండేవారు. మా నాయనమ్మ మాత్రము రోజుకు రెండేసి చొప్పున మూడురోజులూకూడా యీ నాట్యాలు ఏర్పాటు చేసేది. ఈ దయ్యాపు దీపం రాబోతున్నట్లు చెప్పడానికి ఒకడు ముందు వచ్చేవాడు. ఆ వచ్చినవానికి ఎఱ్ఱని క్రొవ్వువత్తులు, పొడుగాటి ఎఱ్ఱసిల్కు పీలికలు బహుమతిగా యిచ్చేవారు. ఆ వెనుక బంతులు ధరించిన నలుగురు సింహద్వారందగ్గరకు వచ్చేవారు. వారి వెనుక దీపం పట్టుకొన్నవాళ్ళంతా వచ్చేవారు. మా యింట్లో విశాలమైన స్థలం కావలసినంత ఉన్నది కనుక మా మూడవ చావడిదాకా లోపలికి వచ్చేవారు. ఆ దయ్యాపుదీపం తల, తోకకూడా మా చావడిలో ఇమిడేది. ఈ సంగతి మాకు చాల గర్వకారణం. ఈ దయ్యాపుదీపానికి స్వాగతపుగుర్తుగా మా చావడిలోని దీపాలన్నీ వెలిగించి బాణాసంచ కాల్చేవారము. తరువాత బంతులు పట్టుకొని ముందువచ్చిన వారిలో ఒకడు మాకుటుంబానికి జయం, సంతోషం కలుగాలని ఆశీర్వదిస్తూ ఒక గీతం పాడేవాడు. ఆ గీతంలో అంతా పొగడ్తలే ఉంటాయి. మానవ సహజంగనుక మేము ఆ పొగడ్తలువిని ఆనందించే వాళ్ళం.

ఈ దయ్యాపు దీపాల ప్రదర్శనంలో మరొక ముఖ్యమైన ఆకర్షణ సింహం ఆట. ఇందులో ఒక పెద్దసింహాపు ఆకారం గుడ్డతో చేసేవారు. ఒకడు తలవైపు, ఇంకొకడు తోకవైపు లోపల దాగిఉండి నోరు, తోక ఆడించుతూ ఉంటారు. మూడవవాడు సింహానికి ఎదురుగా ఒక పెద్ద పూలుగల

గుడ్డతో కుట్టిన బంతి చూపించుతూ సింహాన్ని ఆడిస్తూ ఉంటాడు. ఆ బంతికోసం ఆ మనిషిమీదికి యీ సింహం దూకుతూ ఉంటుంది. మా యింటికి సింహంఆటలో పేరు పడ్డ జట్టు ఒకటి రావడం నాకు బాగా జ్ఞాపకం. మాయింట్లో రెండవ చావడిలోను, మూడవ చావడిలోను పెద్ద బల్లలు వేసేవాళ్ళము. సింహాన్ని ఆడించేవాడు ఒక బల్లదగ్గరనుంచి ఇంకొక బల్లదాకా సింహాన్ని తీసుకు వచ్చేవాడు. ఒక చావడిలోనుంచి ఇంకొక చావడిలోకి కూడా తీసుకు వచ్చే వాడు. ఆటగాళ్ళు బహు చాకచక్యంగా ఆట చూపించేవాళ్లు. సింహంలో ఉండే రెండుభాగాలు చాల పొందికతో కదలాలి. ఈ సింహం ఆట చాల ఉత్సాహంగా ఉండేది.

దీపాలతో ఈ ప్రదర్శనాలన్నీ పెద్దవారికి, పిన్నవారికి ఆనందం కలిగించడంకోసం ఏర్పాటయినవే. చిన్నపిల్ల లందరూ తలాఒకదీపం కొనుక్కునేవాళ్ళు.

నా పదకొండవయేట మాకుటుంబానికి వ్యాపారంలో బాగా కలిసివచ్చింది. పంటకూడా బాగాపండింది. అందుచేత ప్రతియేడాదికంటె ఆ సంవత్సరం మరింత ఆనందంగా యీపండుగ చేయాలని అనుకొన్నారు. మానాన్న, మా ఇద్దరు పెదతండ్రులు, పిల్లలం మేమంతాకలసి ఒక దీపాలఆట మేమే ఏర్పాటుచేయాలనుకున్నాము. నా యీడువాళ్ళం మాయింట్లో చాలామంది ఉన్నాం. ఈ పండుగకు చాల ఖర్చుఅవుతుందని వారికి తెలుసు. మామూలుగా ఆటగాళ్ళ దగ్గర దీపాలుకొంటే డబ్బు చాలా అయిపోతుందని మాకు

మేమే తయారుచేయాలన్నారు. పల్లెలో నివసించే మా బంధువునొకణ్ణి యీపనికోసం ప్రత్యేకంగా పిలిపించారు. సంవత్సరాదిపండుగకు ముందే కావలసిన వస్తువులన్నీ కొన్నారు. సంవత్సరాదిపండుగ తరువాత యీపని ప్రారంభించాము. పదిరోజులలో దీపాలన్నీ తయారయినాయి. కాని పండుగరోజుదాకా ఎవరికీ చూపించలేదు.

మాచెల్లెళ్లు నలుగురూ ప్రదర్శనానికిముందునడిచారు. వాళ్ళు నలుగురూ పూలదీపాలు పట్టుకున్నారు. తర్వాత మాతమ్ముళ్ళు ముగ్గురూ ఐదుసంవత్సరాలు, ఏడు సంవత్సరాలవారు గుఱ్ఱపుదీపాలు పట్టుకొనివచ్చారు. ఈ గుఱ్ఱపు దీపాలుకూడా మధ్య ఒక వెదురుకఱ్ఱతో ఏర్పాటుచేస్తారు. తల, తోక – రెండు భాగాలుగా ఉంటాయి. ఈ రెండు భాగాలలోకూడా మధ్యలో కూర్చొనిఉన్న మనిషి నడుముకు తాడు, తోక కడతారు. ఒక్కొక్క భాగంలో క్రొవ్వొత్తి వెలుగుతూ ఉంటుంది. మేము అయిదుగురము దయ్యపుదీపం చిన్నసైజులో తయారుచేశాము. మాముందు ఒకడు ఎఱ్ఱ బంతిదీపం పుచ్చుకున్నాడు. ఒక్కొక్కప్పుడు నేను, తలవైపు ఉన్న కుఱ్ఱవాడు మారేవాళ్ళము. మాలో ఎవరికీ నాట్యం చేతకాదు. కనుక ఎవరు ఎక్కడఉన్నా ఒకటే. తోక వైపున పట్టుకున్న మా తమ్ముడొకడు తనతోపాటు ఒక తాడుకుకట్టి కుందేలు ఆకారంలో ఉన్న దీపం తీసుకు వచ్చాడు. తెల్లని కుందేలు ఆకారంగల ఆదీపం పైభాగంలో ఐదు చిన్న కుందేళ్ళు ఏర్పాటుచేయబడ్డాయి. వాటన్నిటిలో క్రొవ్వొత్తులు వెలిగించారు. మొదటి రెండురోజులు

మా యింటిలోనే యీ దీపాలను మేము ప్రదర్శించాము. బయటి కెక్కడకు పోలేదు. చివరిరోజున మాత్రము మేమంతా మా యింటికి దగ్గరలోనే ఉన్న మా అక్కయ్య గారి యింటికి వెళ్ళాము.

మా ఊరేగింపులో ముందు నాలుగు పూల దీపాలు నడిచాయి. ఊరేగింపు చాల పొడుగుగా సాగింది. తరువాత మూడుగుజ్జుపుదీపాలు, వాటివెనుక యీ దయ్యాపు దీపం, దానివెనుక కుందేలుదీపం నడిచాయి. మేమంతా యీ ప్రదర్శనాన్ని అమితంగా ఆనందించాము.

మేము ఇంటికి తిరిగివచ్చాము. అన్నిదీపాలను వెలిగించాము. ఈ ఉత్సవంలో పెద్దవారుమోసినా, చిన్నవారు మోసినా అన్నిదీపాలూ వెలిగించడం ఆచారం. మరునాటి నుంచి సంవత్సరపు కార్యక్రమము ప్రారంభమవుతుం దనడానికి ఏర్పాటయిన ఉత్సవమిది. ఈ పండుగ వేడుకలన్నీ అయిపోయినతర్వాత మా పెద్దవాళ్ళంతా మమ్మల్ని బడికి పోయి చదువుకోమని చెప్పేవారు. ఏడాదికిసరిపడ్డ వినోదం గడిపేశాముగనుక యిక చదువుకోమనడం మాకేమీకష్టంగా తోచలేదు. ఉత్సవంనాటి రాత్రి పదిగంటలదాకా మేలుకొని ఉండేవాళ్ళము. అయిదు గంటలకల్లా ప్రొద్దుగుంకేది. దీపాలపండుగ పెందలాడే మొదలు పెట్టేవారు.

అంతాసంతోషంగా ఉండేఆసమయంలో మగపిల్లలం, ఆడపిల్లలం అంతా పండుగవేడుకలు చూడడానికి బజారుల వెంట వెళ్ళేవాళము. వీథులలోజనం క్రిక్కిరిసి ఉండేవారు.

ఆనందానికి లోటులేదు. ఈ పండుగ సమయంలో ఒక కవయిత్రి వ్రాసినపద్యం చదువుకొనేవాణ్ణి.

ఈ దీపాలపండుగ రెండువేల సంవత్సరాల నాడు హాన్ వంశపు రాజులు అధికారంలో ఉండగా ఆరంభింపబడి నట్లు చెపుతారు. నాచిన్నతనంలో కూడా యీ పండుగ అమిత ఉత్సాహంతో జరిగేది. కాని యీ దయ్యపుదీపాల ప్రదర్శనం మా పట్టణంలోజరిగి అప్పుడే ఇరవై సంవత్సరాలు దాటిపోయింది. ఈ పండుగ అంతరించిపోవడానికి కారణ మేమిటో ఊహించుకోలేను. మళ్ళీ యీ దీపాలపండుగ మా పట్టణంలో జరుగుతుందని ఎవరు చెప్పగలరు ?

నిజమయిన శాంతిసౌఖ్యాలు మనకు కలిగినప్పటికే యీ పండుగకూడా జరుగుతుందని ఆశిద్దాం !



పిల్లల బొమ్మలు అమ్మేవాడు

# 18. డెబ్బది సంవత్సరాలు

పుట్టినరోజు పండుగకు సాధారణంగా కొద్దిపాటి వేడుక జరపడం అలవాటు. పెద్దల స్మృతిచిహ్నాలముందు ధూపం వెలిగించడం ఆచారం. తమ వంశంలో ఒకరికి ఇంకొక ఏడాది వయసు పెరిగిందని తెలుపడానికి ఈ ఆచారం పాటిస్తారు. రేపు పుట్టినరోజుపండుగ అనగా కుటుంబంలోని ప్రతివారికి రాత్రిభోజనంతర్వాత కోడిపలావుతోకూడిన ప్రత్యేకవంటకము ఇవ్వడ మింకొక ఆచారం. మా కుటుంబం వంటి పెద్దకుటుంబాలలో నెలకు కనీసం నాలుగైదు పుట్టినరోజు పండుగలు వస్తూ ఉంటాయి. అందుచేత యింతకంటె ఘనంగా జరపడం సాధ్యం కాదు.

కాని మా తాతయ్య, నాయనమ్మలు ఇద్దరూ డెబ్బయ్యో పుట్టినరోజు పండుగకు మాత్రం ప్రత్యేకంగా ఏర్పాటులు చేశాము. తాతయ్యలకు డెబ్బయ్యోయేట, నాయనమ్మలకు అరవయ్యోఏట ప్రత్యేకంగా ఉత్సవాలు జరపడం మాలో ఆచారం. మా తాతయ్య నాయనమ్మల విషయంలో మాత్రం నాకు జ్ఞాపకమున్నంతవఱకు క్రొత్త గుడ్డలు కట్టుకోవడం, మంచి పిండివంటలు తినడంమాత్రమే. కొంతకాలమయిన తరువాత తెలిసింది. మా తాతయ్యకు డెబ్బదినాలుగేళ్లు. అప్పటికి మా నాయనమ్మ వయసు అరవై ఆరు. ఇద్దరికీ కలిసివచ్చేటట్లుగా డెబ్బయ్యోపడి పూర్తయిన ఉత్సవం జరుపుకొన్నారుగ.

ఆ ఉత్సవం మా నాయనమ్మ పుట్టినరోజున జరిగింది. మా తాతయ్య పుట్టినరోజు వెళ్ళిపోయి అప్పటికి నెల అయింది. మూడు చావడులకుకూడ వెల్లవేశారు. మూడవ చావడిలో పెద్దలస్మృతిచిహ్నలకు క్రిందుగా ఎఱ్ఱని శాటిన్ సిల్కుమీద బంగారురంగుకాగితంతో 'దీర్ఘాయువు' అని అర్థమిచ్చే అక్షరము అంటించి వ్రేలాడదీశారు. గోడలమీద వ్రేలాడే బొమ్మలు తీసి క్రొత్త బొమ్మలు తగిలించారు. తగిలించిన బొమ్మలన్నికూడా దీర్ఘాయువును తెలిపేవే. మా పెదతండ్రుల స్నేహితులు, మా నాన్న స్నేహితులు వ్రాసి పంపిన పద్యాలు, శుభసందేశాలు చావడిలో గోడలకు తగిలించారు. చావడిలోని కుర్చీలకు మెత్తలు, తొడుగులు క్రొత్తవి వేశారు. మూడవ చావడిలో ఒక ఎఱ్ఱని తివాచీ పరిచారు. మొదటిదొడ్డిలో పెద్ద ఎఱ్ఱ క్రొవ్వొవత్తులు దూలాలకు వ్రేలాడదీశాము. ఒక్కొక్క క్రొవ్వొవత్తిపైన బంగారురంగు అక్షరాలలో దీర్ఘాయువు, సౌఖ్యముకలుగాలని వ్రాసిఉంది. రెండవచావడిలో ఒక కుట్టుపనితో అలంకరించిన తెర, దానిమీద ఒక కథతో వ్రేలాడుతూ ఉంది. ఒక్కొక్క చావడిలో నాలుగు మూలల నాలుగు పట్టుగుడ్డల దీపాలు, మధ్యలో ఒక పెద్దదీపం వ్రేలాడుతున్నాయి. స్తంభాలకు ఎఱ్ఱకాగితపు పేలికలు చైనాభాషలో అక్షరాలు చెక్కినవి అంటించారు. సింహద్వారంలోనుంచి చూచినట్లయితే యీ అలంకారమంతా కన్నులపండువుగా కనుపిస్తుంది.

ఎఱ్ఱని శుభలేఖలు అచ్చువేసి పంపారు. పుట్టినరోజు పండుగకు రెండురోజులు ముందునుంచే ఒక ప్రవాహంగా

కానుకలు రావడం మొదలుపెట్టాయి. చైనాభాషలోని కవిత్వము, చైనాచిత్రాలు కాక పుట్టినరోజుకు వచ్చే బహుమతులలో దీర్ఘాయువు, సౌఖ్యము – వీటికి చిహ్నాలుగా వండ కుండా పంపే రెండు ద్రవ్యాలు ఉంటాయి. వాటిని చక్కగా తయారుచేసి అందంగా అలంకరించి పంపుతారు. ఈ బహుమతులు లెక్కలేనన్ని వచ్చి చేరాయి. అన్ని బహుమతులు చావడిలో బల్లమీద అలంకరింపబడి ఉంటాయి.

రేపు పుట్టినరోజు పండుగ అనగా ఒక ప్రత్యేక బహుమతి వచ్చింది. ఒక కఱ్ఱపలకపైన "డెబ్బదికి పైబడిన దాంపత్యజీవితము" అని వ్రాసి కుడిప్రక్కన మా తాతయ్య నాయనమ్మల పేర్లు, ఎడమవైపున ఆ బహుమతి పంపినవారి పేర్లు వ్రాసి పంపారు. అక్షరాలన్నీ బంగారంతో చెక్కారు. బహుమతి పంపినవారంతా మాకుటుంబపు అల్లుళ్లు. మాబావ పేరు ఆపేర్లలో రెండవది. ఈ పలకను మా రెండవచావడి వెనుకగోడకు పైన వ్రేలాడదీశాము. దీనితర్వాతనే పుట్టిన రోజు వేడుక ప్రారంభమయింది. పగలుచేసిన పనితో అలసిపోయి నేను పెందరాడే నిద్రపోయినందువల్ల ఏమిజరిగినదీ నాకు తెలియదు.

మరునాడు మధ్యాహ్నంవేళకల్లా అతిథులు రావడం ప్రారంభించారు. సింహద్వారంలో వాయిద్యగాండ్రు కూర్చుని ఒక్కొక్క అతిథి వచ్చినపుడల్లా ఒకగంట వాయిస్తూ ఉండే

వారు. ఆ గంటవిని లోపలఉన్న మా పెద్దవారువచ్చి అతిథు లకు స్వాగతం పలికేవారు. మా అన్నలు అందరు అన్ని చావడులలో ఉండి అతిథులకు మర్యాదలు చేస్తూఉండేవారు.

అతిథులంతా వచ్చినతర్వాత రెండవ చావడిలో 'బొమ్మలాట' ఒకటి ఏర్పాటుచేశాము. ఒక బల్లమీద ఒక కొయ్యచట్రం అమర్చి దానికి ఒక పల్చని గుడ్డ తెర మేకులతో బిగించుతారు. బొమ్మలాటగాడు ఈ తెర వెనుక కూర్చుని గట్టి అట్టతో చేసిన బొమ్మలను కథ చెపుతూ ఆడించుతాడు. ఒక్కొక్క వేషం చెప్పే మాటలను ఒక్కొక్కరు వెనుక నుంచి పాడుతూ ఉంటారు. కథలో ఎన్ని పాత్రలుంటే అంత మంది పాటగాళ్లు ఉండాలి. సూత్రధారి మాత్రం చాక చక్యంతో ఆట నడిపించేవాడు. అతిథులంతా యీ బొమ్మ లాట చూచి ఎక్కువ ఆనందించారు. కథ ఆరంభం పుట్టిన రోజు పండుగకు సంబంధించినదే. పాటకులంతా మామూడవ పెదతండ్రికి చుట్టాలు. చక్కని ప్రదర్శనమివ్వాలని వారు ఎంతో శ్రమపడ్డారు. మా తాతయ్య, మా నాయనమ్మలకు అభినందనగా మా మూడవ పెదతండ్రికూడా యీ ప్రదర్శ నలో పాల్గొన్నాడు.

ఈ బొమ్మలాట ప్రదర్శన మయిన తర్వాత సందడి ఎక్కువయింది. అతిథులంతా తాము స్వయంగా వెళ్లి మా తాతయ్యకు, నాయనమ్మకు అభినందనలు తెలుపాలని,

వారి నివాసాలు చూడాలని కోరారు. మా పెదతండ్రులు, మానాన్న వీరందరిని సర్ది ఏర్పాటులు చేద్దామనుకొన్నారు. తొక్కిడిలేకుండా ఉండాలని సింహద్వారానికి ఎదురుగా మా మూడవ చావడిలో 'దీర్ఘాయువు' అన్న అక్షరాలకు క్రిందుగా రెండు కుర్చీలు వేశారు. మా నాయనమ్మ, తాతయ్యకూడా వాటిలో కూర్చున్నారు. మా కుటుంబంతో పరిచయ మున్నవారు వారి వయసునుబట్టి గౌరవము తెలుప డానికి వరుసగా వచ్చారు. మా తాతయ్య, నాయనమ్మల స్నేహితులు, మా మూడవ పెదతండ్రి స్నేహితులు వచ్చి వృద్ధులకు నమస్కరించారు. తరువాత మానాన్న స్నేహితులు, మా అన్నయ్య స్నేహితులు వచ్చి నమస్కరించి వెళ్ళారు. తరువాత ఇతర కుటుంబాలవారు వచ్చారు. చివరకు మా పెదతండ్రి నమస్కరించిన తరువాత మా కుటుంబంలోని చిన్నవారమంతా నమస్కరించాము.

మా నాన్న నా యీడువారిని నాతో కలిపి ఎనమండు గురుని తాయ్ కథలోమాదిరి ఎనమండుగురు దేవతలుగా ఎన్నిక చేశాడు. ఆ కథలో యీ ఎనమండుగురు దేవతలు స్వర్గరాజధానిలో రాణుల తల్లి పుట్టినరోజు పండుగకు వెళ్ళారు. కథలో స్త్రీపాత్ర ఒకటే. కాని మా నాయన ఎన్నుకొన్నవారిలో ముగ్గురు ఆడపిల్లలు. కాబట్టి ఇద్దరు ఆడపిల్లలు మగవేషాలు వేయవలసి వచ్చింది.

మేమంతా కాగితపు టోపీలు పెట్టుకున్నాము. పంచరంగుల సిల్కు బట్టలు కట్టుకున్నాము. నేను నా మూతికి అడ్డంగా ఒక నల్లగడ్డము కట్టుకున్నాను. ఆ గడ్డము గరుకుగా ఉండి నాకు కొంత నొప్పి పుట్టించింది. కాని నా చేతిలో ఉన్న చిన్న విసనకఱ్ఱతో విసురుకుంటూ యీ నొప్పిమాట మరచి పోయాను. కథలో ఒక దేవత కుంటివాడు. ఊతకఱ్ఱలతో నడవాలి. దేవతాస్త్రీ పొడుగాటి పూర్వకాలపు గౌను ఒకటి తొడుగుకోవాలి. ఆ వేషం వేసిన మా చెల్లెలు అంతపొడు గాటి గౌను ఎప్పుడూ తొడుగుకోలేదు. మేము చావడిలో ప్రవేశించేసరికి అక్కడున్నవారంతా కడుపుబ్బ నవ్వారు. మేమంతా కథలో మా పాత్రలు మరచిపోయి ముందుకు పరుగెత్తుకొని వెళ్ళాము. దేవతాస్త్రీ వేషంవేసిన పిల్ల పొడు గాటి గౌను కాళ్ళకు అడ్డంతగిలి, ముందుగా ఉన్న తివాచి మీదికి పడిపోయింది. మేము ఏమి చేయాలో మరచిపోయి చివరకు మా తాతయ్య, నాయనమ్మల ఎదుట నమస్కా రాలు చేశాము. ఆ దృశ్యం చూచి అంతా ఆనందించారు. మళ్ళీ పైకిలేచి చూతునుగదా! నేను కట్టుకొన్నగడ్డం ఊడి పోయింది. ఇంకొకరికి టోపీ ఊడిపోయింది. మరొకరి చేతిలో పూలబుట్ట విరిగిపోయింది. ఇంకొకరికి వేషం ఊడిపోయింది.

పుట్టినరోజు పండుగ వేడుకలన్నీ రెండు మూడు గంటలసేపు జరిగాయి. చివరకు ముసలివాళ్ళిద్దరూ శ్రమను

ఓర్చుకోలేక అక్కడనుంచి వెళ్ళారు. ఆ తర్వాత అతిథు లందరికి విందు ఏర్పాటుచేశారు. అందరూ వేళాకోళాలతో, సారా త్రాగడంతో ఆనందించారు. పుట్టినరోజు పండుగకు చిహ్నంగా అతిథులందరికి అన్నానికి బదులు ప్రత్యేక పిండివంట మాత్రం వడ్డించారు.



జ్యోతిషం చెప్పేవాడు

# 19. మా అన్నయ్యగారి అబ్బాయి

నాకు పధ్నాలుగు సంవత్సరాలు. చిన్నతనములో ఇంట్లో అటూఇటూ తిరిగినట్లుగా ఇక తిరగడానికి వీలులేదు. వయసు వచ్చినకొద్దీ మర్యాదలు తెలిసికొని నడవాలి. పగటిపూట ఇంట్లో తలుపులన్నీ తెరిచేఉంటాయి. కాలానుకూలంగా గుడ్డతెరలో, పట్టుతెరలో, వెదురుచాపలో తలుపులకు వ్రేలాడుతూ ఉంటాయి. కుటుంబ నియమాలు అంత చక్కగా పాటింపబడేటప్పుడు ఇంతకంటే యెక్కువ అనవసరము. మాయింట్లో చాల గదులున్నాయి. వాటిలో చాలవాటిని నేను సంవత్సరాది పండుగనాడు తప్ప మళ్లీ చూడను. తలుపులు తెరచిఉంచినా ఎవరూ కుటుంబ నియమాలు తప్పి నడువరు. మేము పిల్లలము, ఎప్పుడూ తోటలోను, వసారాలలోను, బడిలోను ఉంటూఉంటాము.

నాకు పన్నెండేళ్ల వయసువచ్చింది. మా అన్నయ్య ప్రధానాచార్యుడుగా ఉన్న పాఠశాలలో నన్ను చదివించుమని మా అన్నయ్య మా నాన్నతో చెప్పాడు. స్థానికంగా ఉన్న పెద్దలు ఆ పాఠశాలను స్థాపించారు. నవీనపద్ధతులలో దాన్ని నడిపిస్తున్నారు. నేను ఆ బడిలో చేరినతర్వాత మాయింటిలోని వారితోనే నానడవడి మారింది. వారుకూడ నాతో మునుపటికంటె భిన్నంగా నడుచుకొంటున్నారు. పధ్నాలుగు సంవత్సరాలు వచ్చినతర్వాత నేను కియూకియాంగ్‌లోని థర్డ్‌మిడిల్‌స్కూలు (పాశ్చాత్యుల మిడిల్

స్కూలుతో సమానమయింది) లో చేరాను. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే, నేను ఆ పాఠశాలలో చేరినది మొదలు ఇంటిలోని ఆడువారి ప్రమేయమే లేకుండాపోయింది. మగపిల్లలు ఆడుపిల్లలతో మాట్లాడకూడదనే నిర్బంధం యేమీలేదు; కాని సహజంగానే ఆ సిగ్గు తెలిసివచ్చేది. మా అన్నయ్య పెళ్ళి అయిన కొద్ది సంవత్సరాల వఱకు మావదినెను నేను రోజూ చూచిఎరుగను. పూర్వాచారాలు పాటించేది గనుక, మా పెద్దవాళ్ళంతా ఆమెను చాలా మెచ్చుకొనేవారు. ప్రతి సంవత్సరాది పండుగకు మా నాయనమ్మ, పెదతల్లులుకూడా మావదినెకు పిల్లలుకలగాలని ఆశీర్వదించేవారు. ఈ ఆశీర్వచనాలతో నాలుగు సంవత్సరాలు గడచిపోయినాయి. కాని మా వదినెకు పిల్లలు కలుగలేదు.

ఒకనాడు మా వదినె మాతో భోజనానికి రాలేదు. ఆమెకు ఒంట్లో బాగుండలేదని మా మూడవ పెదతండ్రిని అడిగి వైద్యపుసలహా తీసికోవాలని, ఎవరో అన్నారు. ఆ తరువాత మా వదినె తరచుగా మాతో భోజనానికి వచ్చేది కాదు. ఆమెకు పులుపువస్తువులంటే ప్రీతి హెచ్చిందని విన్నాను. మా మూడవ పెదతండ్రి మా నాయనమ్మతో మా వదినెకు వేవిళ్ళని చెప్పాడు.

పెద్ద అట్టహాసమేమీ చేయకపోయినా ఇంటిలో వారందరికీ ఈ వార్త తెలిసింది. వారంతా సంతోషించారు. మా చిన్నతమ్ముళ్ళందరినీ మా వదినె గదిదగ్గర అల్లరి

చేయవద్దని మా పెద్దవాళ్ళు చెప్పారు. మా నాయనమ్మ మా వదినెగదిలోకి తరచు వెళ్ళివస్తూఉండేది. మామూలుగ మా వదినె తన ఇంటిపనులన్నీ ఒక దాసీ సహాయంతో మా అక్కయ్య, చెల్లెళ్లు సాయపడుతూంటే చేసుకొనేది. ఇప్పుడు మావదినె సౌకర్యం చూడడంకోసం ఇంకొక దాసిని కూడ ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. ఎగుడు దిగుడు స్థలాల్లో కూర్చోవద్దనీ, ఇంటిపనులేవీ ముట్టుకోవద్దనీ చెప్పారు. తన గదిలోనే రోజూ కొద్దిసేపు నడవాలని సలహాఇచ్చారు. మా అక్కయ్యలు ఇద్దరు అన్నివేళలా ఆమెతో ఉంటూ వచ్చారు. ఆమెతో ఉద్రేకం కలిగించే సంభాషణలు చేయ కూడదు. దయ్యాల కబుర్లు, చావుసంగతి ఆమెదగ్గర ఎత్త టానికే వీలులేదు. ఆమెకు ఏ మాత్రం అలసట కలుగనీయ కూడదు. పుట్టబోయే శిశువు గురించి ఇన్ని జాగ్రత్తలు తీసికొన్నారు.

ఈ నియమాలు పాటించడం చాల కష్టమనిపించింది. మా అక్కయ్యలు మాత్రం యిదేమీ కష్టంకాదన్నారు. మా అక్కయ్య పెళ్లయి కాపురానికి వెళ్లింది గనుక మా వదినెను చూడడానికి వచ్చి మామూలుకంటె ఎక్కువ రోజులు మా యింట్లోఉన్నది. మా పెదతల్లులుకూడా మా వదినెను చూచి వెళుతున్నారు. వారంతాకూడా పుట్టేశిశువుకు ఏవో తయారు చేస్తూనే ఉన్నారు. మా అక్కయ్యలుకూడా కాలి జోళ్లో, గౌనులో కుడుతున్నారు. అన్నిటికంటె ఆశ్చర్య మేమంటే నాకుకూడా తీరికలేదు. మా అక్కలు, చెల్లెళ్లు

నా దగ్గరకువచ్చి కుట్టుపనికి కావలసిన బొమ్మలు గీచిపెట్టు మని నన్ను అడుగుతూండేవారు. ఎప్పుడూ మా యింటికి అమ్మవచ్చే కుట్టుపని నమూనాలు వారు కొనవచ్చు; కాని నా చేత బొమ్మలు గీయించుకోవడమే వారికి ఎక్కువ యిష్టం.

మా అన్నయ్య అత్తగారు జీవించి ఉండలేదు. లేకపోతే మా వదిన గర్భిణీ సమయంలో ఆమెవచ్చి మాయింట్లోనే ఉండేది. మావదినెకు ఒక అక్కగారు ఉంది. ఆమె మాత్రం వచ్చి మా యింట్లో కొన్ని నెలలు ఉన్నది. ఇతర బంధువులంతా వచ్చి మా వదినెకు సూడిదలు తెచ్చి యిచ్చేవారు. గర్భిణీస్త్రీలకు హితవయిన పదార్థాలన్నీ వారు తెచ్చి యిచ్చేవారు. మా అన్నయ్య మామగారు ఇంకొక రాష్ట్రంలో ఉద్యోగి. ఆయనకూడా మా వదినెకు సూడిదలు, బలమిచ్చే మందులు పంపించారు.

ఒకనాడు నేను మావదినెగదిదగ్గరగా వెళుతున్నాను. నన్ను లోపలికి రమ్మని పిలిచారు. ఆ గదిలో చాలమంది ఉన్నారు. మా వదినెమాత్రం నన్నుచూచి నవ్వింది. ఆ సమయంలో నేను ఏమనాలో అర్థం కాలేదు. అక్కడ ఉన్నవారిలో ఒక పెద్దఆమె మాత్రం నాతో "మీ వదినె యిప్పుడొక రాణి. మేమంతా ఆమె సేవ చేస్తున్నాము" అన్నది. అదివిని నేను 'మా అన్నయ్య ఒక రాజన్నమాట!' అన్నాను. అక్కడున్నవారంతా మనసార నవ్వారు. మా వదినెకూడా పక్కన నవ్వింది. ఇంకా నేను మాట్లాడుతుంటే

మా వదినెకు అలసట కలుగుతుందని నేను అక్కడనుంచి వెళ్లాను. తరువాత రెండునెలలకు పురుడు వచ్చింది.

మా అన్నయ్యకు ఈ గొడవే తెలియదు. రోజూ పాఠశాలకు వెళ్లిరావడం, తనగదిలో తాను నిద్రపోవడం–ఇది ఆయన కార్యక్రమం. కాని మా నాన్నమాత్రం తీరిక లేకుండా ఉన్నాడు. ఆయన మానాయనమ్మతో సంప్రదించి పురిటికి చేయవలసిన ఏర్పాట్లు చేస్తూ, మావదినె ఆరోగ్యం గురించి శ్రద్ధ పూనేవాడు.

మానాన్నకు ప్రత్యేకంగా ఇంకొకపనికూడా ఉంది. మావదినెగదిలో ఉంచదగిన పటాలను ఆయన చిత్రించి యివ్వాలి. నేను యీ చిత్రాలలో కొన్నింటిని గీసియిచ్చే వాణ్ణి. మానాన్న యీసందర్భంలో కొన్ని విషయాలు చెప్పాడు. మా పూర్వీకులు ఒకపద్ధతి ఏర్పరిచారట. దానికి 'తాయ్‌చియో' అనిపేరు. శిశువు తల్లిగర్భంలో ఉండగానే మంచిగుణాలు అలవరచేపద్ధతి వారు కనుగొన్నారట. తల్లికి సరియైన వాతావరణం ఏర్పరిస్తే మంచిగుణాలు కలిగి తెలివితేటలుగల శిశువు కలుగుతుందని వారి సిద్ధాంతము. తల్లిచూచేవస్తువులు, వినేమాటలు, ఆమెమనసులో కలిగేభావాలు – ఇవన్నీ గర్భంలోఉన్న శిశువు రూపు రేఖలూ, గుణాలు తీర్చిదిద్దుతాయని వారుచెప్పారు. కాబట్టి గర్భిణీస్త్రీలు ఎంతోజాగ్రత తీసికోవలసి ఉంటుంది. ఆమె అందమయిన వస్తువులనే చూడాలి. మంచి సంభాషణలు వినాలి. కన్‌ఫ్యూషియస్ సిద్ధాంతాల ప్రకారమే ఆలోచిం

చాలి. కాబోయేతల్లులు నెమిళ్ళనుచూస్తే చురుకైన బుద్ధి కలవారు; ముత్యాలు, వజ్రాలుచూస్తే చాల అందమయిన వారు; ఎగిరేపక్షులు, పరుగెత్తే మృగాలు చూచినట్లయితే ఆరోగ్యవంతులు, బలిష్ఠులయిన పిల్లలుకలుగుతారని నమ్మకం.

ఇవన్నీ మా వదినె చూడడం వీలుగాదుకనుక మా నాన్న యీ చిత్రాలన్నీ గీసి ఆమెగదిలో ఉంచే ఏర్పాటు చేశాడు. ఈ చిత్రాలకు ఇంతటి శక్తి నిజంగా ఉంటుందా? అని నేను ఎప్పుడూ సందేహించలేదు. మా వదినెగది బాగా అలంకరింపబడినదనిమాత్రం విన్నాను. పురుడు రాకమునుపు నేను ఆ గది చూడనేలేదు.

పురిటికి అన్నిఏర్పాట్లుజరిగాయి. తల్లిదగ్గర పాలుండక పోతే, పాలు ఇవ్వడానికి ఒక దాదినికూడా మాట్లాడి ఉంచాము. పసిపిల్లలకు ఎప్పుడూ మేము ఆవుపాలు పోసి యెరుగము. పోతపాలు ఆరోజుల్లో అసలు లేనేలేవు.

రెండువారోజులపాటు మాయింటిలో అంతా సంతోషంతో హడావిడిగా ఉన్నారు. సంవత్సరాదిపండుగ వెళ్లిన నెలరోజులకు ఒకనాటి ఉదయం నేను బడిలోనుంచి వచ్చేసరికి మా అన్నయ్యకు కొడుకు పుట్టాడని చెప్పారు. "మా అన్నయ్యకు కొడుకు! మా అన్నయ్యకు కొడుకు" అనుకుంటూ నేను కొంతసేపు ఆనందించాను.

ఇంటిల్లిపాదీ చాల సంతోషించారు. ముఖ్యంగా మా ముసల్లి ఇద్దరి సంతోషానికి మేరలేదు. అవునుమరి! వారి

కళ్లతో వారు మునిమనుమలను చూడడం ఎంత ఆనందమో ఆలోచించుకోండి !

శిశువు కలిగిన వెంటనే తండ్రి వెళ్ళి పెద్దల విగ్రహాల ఎదుట ధూపంవేసి నమస్కరించి రావడం ఆచారం. ఆ వంశంలో యింకొకరు జన్మించారని పెద్దలకు నివేదించడమే దాని ముఖ్యోద్దేశం. కొడుకు కలిగే వేళకు మా అన్నయ్య పాఠశాలలో ఉన్నాడు. కాబట్టి మా అన్నయ్యకు బదులు మా నాన్న వెళ్లి పెద్దల విగ్రహాల దగ్గర ధూపం వెలిగించి వచ్చాడు. నేను యీ పురిటి కబురు విన్న తరువాత మా నాన్నగది దగ్గరకు వెళ్ళాను. ఆయన మా అమ్మపటం వైపు చూస్తున్నాడు. నేను రావడం చూచి నన్ను దగ్గరకు తీసికొని "మీ అమ్మ బ్రతికి ఉంటే ఇప్పుడు ఎంతసంతోషించేదో గదా!" అన్నాడు. మా నాన్నకు కన్నీళ్లు గిర్రున తిరిగాయి. మేము కొంచెంసేపు మాట్లాడకుండా నిలిచి ఉండిపోయినాము.

పురుడు వచ్చినతరువాత మావారందరికి తీరుబడిలేని పని. మా వదినెగారి పుట్టింటికి ఈ సంతోషవార్త తెలుపడానికి మనిషిని పంపారు. అతనితో ఎఱ్ఱరంగు కోడిగుడ్లు అనేకం యిచ్చి పంపారు. ఇలా పంపడంలో ప్రత్యేక అర్థమేమిటో నాకు తెలియదు. ఎఱ్ఱరంగు శుభసూచకమని అనుకుంటాను. ఈ ఆచారానికి 'పోషి' అని అంటారు. "సౌఖ్యాన్ని తెలుపడం" అని అర్థం. మేముపంపిన మనిషి వారికి కబురు చెప్పిన తర్వాత మావదినెగారి యింటినుంచి ఎవరో ఒకరు

వస్తారు. వారొక పెద్దఊరేగింపుతో పుట్టినశిశువుకు కానుకలు తీసుకువస్తారు. ఆ వచ్చినవారికి మా నాన్న ఎదురుగా వెళ్ళి స్వాగతం చెప్పి మర్యాద చేయాలి. ఆ రోజులలో మా పట్టణంలో చక్రాలబళ్లు లేవు. అన్నీ నౌకరులు తేవలసిందే. మా నాయన ముందు చావడిలో వారి రాకకు ఎదురు చూస్తూఉన్నాడు. మా నౌకరు ఒకడు ఒక పెద్ద కట్టకు టపాకాయలు వ్రేలాడగట్టి సిద్ధంగాఉన్నాడు. మా వదినెగారి యింటినుంచి ఊరేగింపుతో మనిషి వచ్చేసరికి నౌకరు బాణాసంచ ప్రేల్చాడు. మా నాన్న సింహద్వారం దగ్గరకు వెళ్లి స్వాగతం చెప్పాడు. ఒకరి కొకరు నమస్కారంచేశారు. మా వదినెగారి కుటుంబంలో పెద్దవారు వ్రాసిపంపిన శుభ సందేశాన్ని ఆ వచ్చిన ఆయన అందించాడు. ఆయన వెనుక యిద్దరు నౌకరులు, ఒక పెద్దపెట్టె నాలుగు అరలుగలది కట్టతో మోసి పట్టుకువచ్చారు. ఇంకోయిద్దరు నౌకరులు ఒక పెద్దగంప తెచ్చారు. వారంతా క్రొత్తదుస్తులు కట్టుకొన్నారు. తెచ్చిన కానుకలన్నీ మా లోపలిచావడిలో దించారు. మా నాయనమ్మ, పెదతల్లులు అంతా అక్కడ చేరారు.

మానాన్న, మాపెదతండ్రి పెట్టెదించి మొదటిఅరలో ఉన్న పెద్దకవరువిప్పి చూచారు. అందులో ఒక మడత పెట్టిన ఎఱ్ఱకాగితంమీద శుభసందేశం వ్రాసిఉంది. "మీ వంశం తామరతంపరగా వృద్ధిపొంది, నూతనశిశువు మీ వంశానికి పేరుకీర్తులు గడించేవాడుగా, తెలివితేటలు, సంపద కలిగి వృద్ధిలోనికి రావలె" నని శుభాకాంక్షలు అందులో

ఉన్నాయి. నాకు అందులో వ్రాసిఉన్న మాటలన్నీ జ్ఞాపకంలేవు. అవన్నీ మర్యాదలే. ఏ గ్రంథం చూచినా అవి వ్రాయవచ్చు. (ఆడపిల్ల కలిగినపుడు వ్రాసిపంపే శుభ సందేశం వేరొకరకంగా ఉంటుంది. ఆడశిశువు అంద చందాలతో వృద్ధిపొంది పుట్టింటికి, మెట్టినింటికి పేరుకీర్తులు గడించాలని వ్రాస్తారు.)

మావదినెగారి కుటుంబంలో పెద్దవారిపేరు, మా అన్నయ్య . మామగారిపేరు వ్రాసిఉంటాయి. ఊరిలో లేకపోయినా వారిపేరులు వ్రాసిపంపుతారు. ఇక రెండవ అరలో వస్తువులు, చదువుకొనే గదిలోకి కావలసినవస్తువులు; ముఖ్యంగా సిరా, సిరాబుడ్లు, కుంచెలు, కాగితాలు మొద లయిన పరికరాలు, మరికొన్నిపుస్తకాలు ఉన్నాయి. మూడవ అరలో లాగులు, చొక్కాలు, గౌనులు, జోళ్లు, టోపీలు, వెండి, బంగారువస్తువులు శిశువు చిన్నతనంలో పెట్టుకొనేవి అనేకం ఉన్నాయి. నాలుగవ అరలో పుట్టిన శిశువుకు దుస్తులు కుట్టి యివ్వడానికి కావలసిన గుడ్డలు, సిల్కులు పెట్టి పంపారు. (ఆడపిల్లకయినట్లయితే అద్దాలు, పౌడర్లు, కుట్టుదారాలు, లోలకులు, కంఠహారాలు పంపుతారు.) దాసీలు తీసికొనివచ్చిన గంపలలో ఒకదానిలో బ్రతికి ఉన్న కోడిపిల్లలు, బాతులు ఉన్నాయి. ఇంకొక దానిలో మంచి నీటి చేపలు పంపారు. ఇవన్నీకూడా బాలెంతకు పుష్టికరమైన ఆహారము. మా వదెనగారి కుటుంబంనుంచి వచ్చిన కానుక లన్నీ గ్రహించి మానాన్న ఆ వచ్చినవారిచేతి కొక ఎఱ్ఱని

కవరులో వందనా లర్పించిన కాగితంపెట్టి పంపాడు. దాని మీాద మా తాతయ్యా, మా పెదతండ్రులు, మా నాన్న, మాఅన్నయ్యా సంతకాలు ఉన్నాయి. మేము పంపిన పెట్టె లోపలిభాగమంతా ఎఱ్ఱని కాగితం అంటించాము. ఒక అరనిండా మానాయనమ్మ ఎఱ్ఱరంగుగుడ్లు పెట్టి పంపించింది. మా నాన్న యీా కానుకలు తెచ్చిన వారందరికి నమస్కరించాడు. అంతా శెలవుతీసికొని వెళ్ళారు.

ఆతర్వాత మాబంధువులంతా మావదినెకు, పిల్లవానికి కానుకలు అనేకంగా పంపారు. మా నాయనమ్మ, పెదతల్లులు ఈ కానుకలు పుచ్చుకొని వారికి మర్యాదలు జరపడంలో తీరికలేకుండా ఉన్నారు.

కానుకలు తెచ్చేవారు సాధారణంగా నౌకరులయినా వారికి మంచి టీ, కోడిపలావు యిచ్చి మాతోపాటు వారు ఆనందించేటట్లు మర్యాద చేసేవారు. వారు తిరిగి వెళ్లేటప్పుడు తెచ్చినవారికి మంచి బహుమతి, పంపినవారికి కొన్ని ఎఱ్ఱనిగుడ్లు యిచ్చి పంపడం అలవాటు. ఈ పనికిగాను ఎన్ని గుడ్లకు రంగు వేసేవారమో చెప్పలేను. ఇల్లంతా చాల సందడిగా ఉండేది. నేను పధ్నాలుగేళ్ల వాడనే అయినా చాలమంది నాకు అభినందనలు చెప్పేవాళ్లు. మా అన్నయ్యకుఅబ్బాయి అంటే నాకు ఎంతోఆనందం! ఇంటిలో ప్రతివారికి ఆనందం; – పిల్లలు మాకంటేకూడా మా యింటి నౌకరులు, దాసీలు వారికికూడా అంతులేని సంతోషం. దాసీలుకూడా పిల్లవానికి కానుకలు ఇచ్చేవారు.

ఒక నెలరోజులుదాకా యీ కానుకలు వస్తూనే ఉండేవి. బంధువులు స్వయంగా చూడడానికి వచ్చేవారు. వచ్చినవాళ్లు ఒకపూటయినా ఉండకుండా వెళ్లరు. మా నాయనమ్మకు, పెదతల్లులకు తీరికలేదు. మగవాణ్ణి గనుక నేను యీ ఆడవాళ్ళు యీ చాకిరీ ఏలాచేయగలుగు తున్నారో అనుకొనేవాణ్ణి. కాని ఆడవాళ్లుమాత్రం ఎక్కువ సంతోషంతో యీ చాకిరీ అంతా చేసేవాళ్ళు. ఈ రోజుల్లో మా నాయనమ్మ తనలోతాను ఎంత సంతోషం పొందేదో నేను ఊహించుకోగలను.

కానుపు వచ్చినప్పుడు దగ్గరున్నవారు తప్ప మూడు రోజులవఱకు పురిటిగదిలోకి ఎవరినీ వెళ్ళనిచ్చేవారు కారు. మూడురోజుల తర్వాత మంత్రసాని శిశువుకు శుభ్రంగా నీళ్లుపోసేది. శిశువుకుపోసే నీళ్ళలో 'అయ్' అనే ఆకువేసి కాచేవారు. ఆ ఆకు చర్మవ్యాధులను రానీయదట. నీళ్లు పోసిన శిశువును మెత్తని పొత్తిగుడ్డలలోపెట్టి మంత్రసాని పెద్దల పవిత్రగృహానికి తీసుకువెళ్ళేది. అక్కడ ధూపంవేసి తనచేతుల్లో ఉన్నబిడ్డను పెద్దల స్మృతిచిహ్నాల ఎదుట ముమ్మారు మ్రొక్కించేది. ఈ ఆచారానికి 'షీసాన్' అని పేరు. ఆనాడే కుటుంబమంతటికీ ప్రత్యేక విందు ఏర్పాటు. మరీ దగ్గరచుట్టాలనుమాత్రం పిలిచేవారు.

నాలుగవనాటి నుంచి పురిటిగదిలోకి ఎవరయినా వెళ్ల వచ్చు. నేను పుట్టినశిశువు పినతండ్రిని గనుక నన్ను ముఖ్యంగా ఆహ్వానించారు. మా వదినె పరుపుకు ఆనుకొని కూర్చున్నది.

ఆమె సుఖంగా నవ్వుతున్నది. తన ప్రక్కనే పడుకొని ఉన్న పాపాయిని నాకు చూపించింది. నేను ఆ పాప చెక్కిలిమీద వేలితో చిటిక వేశాను. అంతే. ఏమీ అనలేదు. ఆ వేళ నా మనసులో అనిపించింది మా చిట్టితమ్ముళ్లు అందరి కంటెకూడా వీడే నాకు దగ్గరవాడని. మా అన్నయ్యగారి అబ్బాయి, ఆగదిలో యింకా అయిదుగురు పెద్దవాళ్లుకూడా ఉన్నారు. వారంతా నన్ను చూచి "మీ అబ్బాయికి ఏంతెచ్చి పెడతావో" అని నా సమాధానంకోసం వేచి ఉన్నారు. నాకు అంతమంది పెద్దవాళ్ల యెదుట మాట్లాడడం అలవాటు లేదు. ఏమనాలో తోచలేదు. "మావాడికోసం ఏమయినాచేస్తాను" అన్నాను. వారంతా నవ్వుకొన్నారు. వెంటనే గదిలోనుంచి వెళ్లిపోదా మనుకున్నాను. కాని మా ఆచార ప్రకారం పురిటిల్లు చూడవచ్చినవారికి పాయస మిచ్చి పంపాలి. ఆ పాయసం చాలరుచిగా ఉంది. కాని అంతమందిముందు తాగడానికి సిగ్గువేసింది.

ఒక నెలరోజులవఱకు మావదినె గది కదిలిరాదు. ఆమె తన గదిముందు కొద్దిగా నడిచేది. ఒంటికి బలంపట్టి పిల్లడికి పాలు సరిపోవడమే ఆమె ఆలోచన. పిల్లడికి ఆమెపాలే సరి పోయేవి. చూలింతగా ఉన్నప్పుడు ఎన్నో జాగ్రత్తలు తీసి కొన్నారు. బాలెంతగాకూడా ఆమెకు చాల జాగ్రత్తగా ఆహార మిచ్చేవారు. పాలుపడేటందుకు పుష్టికరమయిన ఆహారం ఆమెకు పెట్టేవారు. ఆమెకు చాలరోజులవఱకు అన్నం పెట్టేవారుకాదు. బియ్యపుజావ, తేలికగా జీర్ణమయ్యే

పదార్థాలు ఇచ్చేవారు. మా నాయనమ్మ మా మూడవ పెదతండ్రినడిగి బాలెంత పథ్యంవిషయంలో చాల శ్రద్ధ పూనేది. నెలపురుడు వెళ్లిపోయేసరికి మా వదినె ఇంట్లో మామూలుగా తిరుగగలిగేది. ఆనాడు బంధువులు, స్నేహితులు, కానుకలు పంపినవారు – వీరందరికీ ఒక పెద్ద విందుజరిగేది. దీనికి నెలపురుడని పేరు (మన్ యో). మా అన్నయ్యఅత్తగారు ఉంటే యీ నెలపురిటినాడు ఆమెకు చాల గౌరవం జరిగేది. ఆమెకు బదులుగా ఒకపెద్ద ముత్తయిదువను పిలిచారు. ఈ విందు అంతా ఆడవాళ్ళ ప్రమేయమే. మర్యాదకోసం మగవారిని పిలిచినా ఎవరూ రారు. నేను కూడా పెద్దవాడ నయినానుగనుక ఆడవారితో కలసి ఉండడం నాకు యిష్టంలేదు. అందుచేత యీ నెల పురిటి విందులో ఏమిజరిగిందీ ప్రత్యక్షంగా తెలియదు. కాని సంతోషంతో అనుకునేమాటలు, పెద్దగానవ్విన నవ్వులు వినిపించాయి. ఇల్లంతా సంతోషంతో, సంబరాలతో నిండిఉంది.

మా అన్నయ్యకొడుకుకు జరిగిన పెద్దఉత్సవం వాని మొదటి పుట్టినరోజుపండుగ. మాలో మొదటి పుట్టిన రోజుకున్నూ, ఏబదియేళ్లు దాటినతర్వాత జరిగినవాటికిన్ని ప్రాముఖ్యం ఉన్నది. ఆ సమయాల్లోనే ప్రత్యేకంగా ఉత్సవాలుజరిపి, కానుకలు ఇవ్వడం జరుగుతుంది. ఇతర పుట్టినరోజు పండుగలకు సాధారణవేడుకలు తప్పితే కానుకలు ఇవ్వడం ఉండదు.

ఏడాది నిండేలోగా మా పెదతల్లులు, అక్కయ్యలు మా అన్నయ్యగారి అబ్బాయికి చొక్కాలు, లాగులు, టోపీలు కుట్టడంతో తీరిక లేకుండా ఉన్నారు. పిల్లవానికి మేనత్త గనుక మా అక్కయ్య ఇంకా ఎక్కువ కానుకలు తయారు చేయవలసిఉంది. మొదటి పుట్టినరోజు పండుగనాడు మొత్తమన్నీ కలిసి పురిటినాడు వచ్చినన్ని కానుకలు వచ్చాయి. మా వదినెగారి కుటుంబంవారు ఈ మాటు తినుబండారాలు కాకుండా దుస్తులు ఎక్కువ పంపారు. పుట్టినరోజు పండుగకు చాలమందిని విందుకు పిలిచాము. మా అన్నయ్యగారి అబ్బాయికి ఎఱుపు, ఆకుపచ్చ సిల్కులు కుట్టుపని నగిషీతో నిండినవి తొడిగారు. కాలిజోళ్ళు క్రొత్తవి పులితలలు కుట్టినవి మా అక్కయ్య ఇచ్చింది. పిల్లవాని నడినెత్తిన ఉన్నజుట్టు ఒక సిల్కు రిబ్బనుతో ముడివేయ డానికి వచ్చింది. మా పెద్దల స్మృతిచిహ్నాల ముందు ధూపం వేసిన తర్వాత పిల్లవానిచేత ముమ్మారు మ్రొక్కించింది మా వదినె. తర్వాత ఒక పెద్ద గుండ్రని బల్లమీద వాడు చదువ దగిన చదువులన్నిటికి సంబంధించిన వస్తువులన్నీ చుట్టూ అమర్చి, మధ్యలో పిల్లవాణ్ణి కూర్చోబెట్టారు. సిరాలు, కుంచెలు, పూసలచట్రము, కత్తి, కత్తెర, సుత్తి, ముద్ర ఇంకా ఎన్నోవస్తువులు బల్లమీాద ఉంచారు. వీటన్నిటిలోను పిల్లవాడు తన కిష్టమయిన వస్తువును చేతితో అందిపుచ్చుకొంటాడు. మొదటి ఏడాది చివరజరిగే యీా ఉత్సవానికి 'చా చౌ' అని పేరు.

మొదటి పుట్టినరోజునాటి పండుగకు అంతా సిద్ధం చేశారు. బల్లచుట్టూమూగిన జనంవేపు చూడడంతప్ప వాడేమిచేయాలో పిల్లవానికి తెలియదు. మేమంతా వాడేమి చేసేది చూడడానికి వచ్చామనుకొన్నట్లుగా తనకు దగ్గరగా ఉన్న వస్తువును రెండుచేతులూ ఎత్తి పట్టుకోబోయినాడు. కాని పట్టుకోకుండా చేతులు వెనుకకులాగి మావైపు చూచి నవ్వాడు. ఇదిచూచి చుట్టూమూగినవారంతా నవ్వారు. నాకుకూడా యీ సంఘటన సంతోషం కలిగించింది. ఆ నవ్వు వర్ణించడానికి నాకు మాటలు చాలవు. కొంతసేపటికి వాడొక మూలికను, చాలదూరంగా ఉన్నదాన్ని చేతితో పుచ్చుకొన్నాడు. మా నాయనమ్మ అదిచూచి "వీడు పెద్దయితే వైద్యుడు కాబోతాడు" అన్నది. మా కుటుంబంలో మా మూడవ పెదతండ్రి వైద్యుడే. ఈ మాటవిని ఆయన చాల సంతోషించాడు.

ఆ పిల్లవాడు ఇప్పుడు పెరిగి పెద్దవాడయినాడు. మా అన్నయ్య నిరుడు చనిపోయేముందుకూడా వైద్యం చదువుమని చెప్పాడు. కాని కుఱ్ఱవాడు మాత్రం వైద్యం చదువ దలచుకోలేదు. చిన్ననాటి సంఘటనకున్నూ, మా అన్నయ్య తనకొడుకును వైద్యంచదువుమని చెప్పడానికీ ఏమీసంబంధం ఉన్నదని నేను అనుకోను.

పిల్లవాని పినతండ్రిగానేను వాడు పెద్ద అయినతర్వాత కంటె, వాని బాల్యంలో కంటె, శిశువుగా ఉన్నప్పుడే వానికి ఎక్కువ సేవచేశాననుకొంటాను.

మా వదినె, యీ పిల్లవాని దాదికూడ నేనంటే ఎక్కువ దయతో ఉంటారు. నేనుకూడా అవకాశం దొరికి నపుడల్లా వారికి సహాయపడడానికే ప్రయత్నించాను. నేను బడినుంచి ఇంటికి రాగానే వారు నన్ను ముఖ్యంగా కోరేది ఒకటే. నిద్రపోతున్నపాపాయిదగ్గరనేనుఉంటే వారు కొంచెం విశ్రాంతి తీసుకోవాలని కోరేవారు. వారికోరికను నేను కాదన లేదు. ఆ సమయంలోనే నేను మా భాషలో ప్రసిద్ధికెక్కిన నవలలన్నీ చదువుకొనేవాణ్ణి.

మా కుటుంబంలో మగపిల్లలకు, ఆడపిల్లలకు పెంప కంలో ఏమీ భేదం చూపేవారుకారు. పదియేళ్ళు దాటే వఱకు అందరినీ సమానమైన శ్రద్ధతోనే పెంచేవారు. మా మూడవ అన్నయ్యకు మొదటగా కూతురుపుట్టింది. మా అన్నయ్యగారి అబ్బాయిని, ఆ ఆడపిల్లను ఒకేశ్రద్ధతో పెంచారు. మొదటి పుట్టినరోజు పండుగకూడా ఇంత వైభ వంగా జరిగింది. కాని ఆనాడు ఆమె పట్టుకొన్నవస్తువు ఆమె భర్తచేయబోయే ఉద్యోగాన్ని సూచిస్తుందట.

ఇదంతా ఇరవై సంవత్సరాలనాటి సంగతి. అప్పటి నుంచీ చైనాలో అనేకమయిన మార్పులు వచ్చాయి. మా కుటుంబంలోని ఆడువారే చిన్న పిల్లలకుఇచ్చే బహుమతులు తాము తయారుచేయడం మానివేసి కొనడంమొదలుపెట్టారు. మా చుట్టాలలో ఒక ఆమె కానుపుకుముందు ఒక వారం రోజులు ఆస్పత్రిలోచేరి కన్న మరుసటినాడే స్త్రీల ఆటలో పాల్గొన్నదని విన్నాను. నా ఆలోచనలన్నీ పూర్వకాలపు

తరహాకు చెందినవి కావచ్చు! ఇటువంటి మార్పులన్నీ నా మనసుకు తృప్తిగా ఉండవు. నా చిన్నతనంలో జననం, వివాహం, మరణం వీటికి ఎక్కువ ప్రాముఖ్యము ఉండేది. ఈ కాలంలో వాటి ప్రాముఖ్యం తగ్గిపోయినమాట వాస్తవం.



కాగితపువూలు అమ్మేవాడు

# 20. పూలదేవత పుట్టినరోజు

ఈ ఉత్సవం టియాంగ్ వంశం కాలములో ఏర్పడింది. చైనాదేశం వివిధ ప్రాంతాలలో ఇది జరుపుతారు. రెండవ నెలలో రెండవరోజు, పన్నెండవరోజు, పదిహేనవరోజు జరుగుతుంది. మొదట్లో పదిహేనవరోజునే జరిపేవారు. కాని ఇటీవల పన్నెండవరోజే జరుపుతున్నారు. కారణమేమిటో తెలియదుకాని కియూకియాంగ్‌లో యీ ఉత్సవం జరిపే ఆచారం లేదు. బహుశా మా పట్టణంలో పెద్దగా చెప్పుకో దగిన తోటలు లేకపోవడమే కారణమయి ఉండవచ్చు. మా యింటిలోని తోట నామమాత్రపుదే. రకరకాల పూలు మాతోటలో లేవు. పూలపందిళ్ళుగాని, విహారమంది రాలుగాని మేము నిర్మించలేదు. మాదగ్గరప్రాంతంలో వారు ఆరోజున ఏదోఉత్సవం చేసేవారు. కాని యీ పూలుపుట్టిన రోజు ఉత్సవానికి, దానికి ఏమీసంబంధంలేదు. సూచౌనుంచి మా యింటికి ఒక బంధువురాలువచ్చిన సంవత్సరంమాత్రం మా కుటుంబంవారు యీ ఉత్సవం చేశారు.

చైనాదేశం మొత్తంమీద సూచౌ పూలతోటలకు పెట్టింది పేరు. దేశానికంతకీ పేరుమ్రోగిన పూలతోటలు యీ పట్టణంలో పెంచుతారు. పూలపెంపకంలో ఆ పట్టణం వారికిఅమితమైనశ్రద్ధ. మాబంధువురాలుకూడా ఆపట్టణంలో పుట్టి పెరిగినందువల్ల పూలరకాలను గురించి విశేషంగా ఆమె ఎరుగును. ఆమె యాంగ్‌ట్సీనది దాటిపోవడం ఇదే

మొదటిసారి. వారిప్రాంతానికీ, మాప్రాంతానికీ ఆచారవ్యవహారాలలో ఉండే అన్ని భేదాలు ఆమె అతిజాగ్రత్తగా పరిశీలిస్తూఉంది. ఆమెకు మా అక్కయ్య వయస్సుఉంటుంది. వారి కుటుంబమంతా ఆమె వివాహం కాకపూర్వమే 'లూ' పర్వతపు సౌందర్యాన్ని చూడాలనే కోరికతో వేసవికాలం దాకా మాయింట్లో ఉండడానికి వచ్చారు.

సూచౌలోని ఆడపిల్లలు చైనాకంతటికీ అందమయిన వారని చెపుతూఉండడం నాబాల్యంనుండీన్నీ వింటూ వచ్చాను. మా బంధువుల అమ్మాయి ఆ ప్రతీతికి తగ్గట్టుగానే ఉన్నది. ఆమె ముఖమెప్పుడూ చిరునవ్వుతో కూడి ఉండేది. మా పిల్లలంతా ఆమెచుట్టూ మూగి ఉండేవారు. వారు ఎప్పుడూ ఆమెను జుట్టు అలంకరించుకొనే విషయంలో, దుస్తులు తొడుగుకోవడంలో, పూలఅలంకరణలో వారిఆచారాలను గురించి ఎన్నో ప్రశ్నలు వేసేవారు. ఒకనాటి సాయంకాలము ఆమె మాతో "ఈరోజే పూలదేవత పుట్టినరోజు. మన మూ ఉత్సవం చేద్దా" మన్నది. ఆ ఆలోచన మా అందరికి మంచి ఉత్సాహం కలిగించింది. మా నాయనమ్మతో చెప్పి ఆమెను ఒప్పించడానికి నన్ను పంపించారు. మా యింటికి క్రొత్తగావచ్చిన బంధువుల అమ్మాయి మనసు చిన్నపుచ్చడానికి మా నాయనమ్మ ఒప్పుకోదు. కనుక యీ పూలదేవత పుట్టినరోజు జరపడానికి ఆమె తప్పకుండా ఒప్పుకొంటుందని మా గట్టి నమ్మకం. అప్పటికప్పుడే అది పన్నెండవరోజు. ఆనాడే

ఉత్సవానికి ప్రయత్నంచేయడానికి వ్యవధి చాలదు. కనుక పదిహేనవనాడు యీ పూలదేవత పుట్టినరోజు జరపడానికి నిశ్చయించాం.

ఈ ఉత్సవపు ఏర్పాట్లన్నీ మాచిన్నపిల్లలు, అందులో ముఖ్యంగా ఆడపిల్లలు చేయవలసి వచ్చింది. మా వారు తొమ్మండుగురు ఈ పనులు మొదలుపెట్టారు. ఆడపిల్లలు రంగురంగు సిల్కుగుడ్డల పీలికలన్నీ ప్రోగుచేసుకొనివచ్చారు. మేము మగపిల్లలము చెట్టుమీది కెక్కి ఆ పీలికలను కొమ్మలకు వ్రేలాడగట్టాము. క్రిందికొమ్మలు మాత్రం మా ఆడపిల్లలకు కొందరికి అందాయి. మా తోటలోని పళ్ళచెట్టు అప్పుడే మొగ్గలు తొడుగుతున్నది. మరికొన్నిచెట్లు అప్పుడే చిగుళ్ళు చిగురుస్తున్నాయి. తోటలోని చెట్లన్నీ పూస్తూ, చిగిరిస్తూ ఆనందం కలిగించాయి.

మేము మాతోటలో ఒక చిన్న కుటీరం నిర్మించాము. అందులో ఒక పొడుగాటి బల్ల వేశాము. మాలో పెద్ద కుట్టివాడొకడు ఒక ఎఱ్ఱకాగితపు పేలికమీద "పూలదేవతకు సింహాసనం" అని వ్రాశాడు. ఎఱ్ఱకాగితపు పేలికలు పన్నెండు తీసికొని వాటిమీద ఆ దేవతకు పన్నెండు నెలలలోను ఉన్న పన్నెండుపేర్లు వ్రాశాము. ఈ పూలదేవతలలో పురుషులు, స్త్రీలుకూడా ఉన్నారు. చైనా సారస్వతంలో ఈ దేవతల పుట్టుకనుగురించి ఇలా వ్రాసిఉంది. "ఒక్కొక్క పూవును ఎక్కువగా ప్రేమించినవారు వారు మరణించిన తరువాత

ఆ పూవుపేరుతో అది పుష్పించే నెలకు పూలదేవతగా మారిపోతారు" అని.

మా బంధువుల అమ్మాయి మేము వ్రాసిన రంగుకాగితపు పేలికలన్నీ ఒకబల్లమీద అలంకరించింది. పూలదేవత పేరున్నది మధ్యనూ, నెలవారీ పేరులుగలవన్నీ దాని చుట్టూ అమర్చింది. వాటికి ఎదురుగా చిన్న గిన్నెలలో పండ్లునింపి పెట్టింది. బాణాసంచ కాల్చి ధూపం వేసిన తర్వాత ఆమె వంగి నమస్కరించి ఏవోమాటలు చాల మెల్లగా పలికింది. అవి మాకు వినిపించలేదు. మిగిలిన వారమంతా మాకు తెలిసినా, తెలియకపోయినా ఏవో గొణిగాము. అటుతర్వాత మమ్మల్ని అందరినీ అన్ని చెట్ల దగ్గరకు, పూలచెట్లదగ్గరకు తీసికొనివెళ్ళి మాచేత మ్రొక్కించి ఏవో చెప్పించింది. తర్వాత ఆమె తాను చెప్పిన వాక్యాలు పూలదేవతలకు నమస్కారవాక్యాలు అని చెప్పింది. కాని ఆమె మాట్లాడిన సూచౌభాష మాకు అర్థం కాలేదు. మేము మాత్రం మనసార భక్తితో నమస్కరించి యీ పూజ జరిగినంతసేపు మాట్లాడకుండా ఉన్నాము.

పూజలు అయిన తర్వాత మేము కబుర్లు చెప్పుకుంటూ తోటలో నడుస్తూ వెళ్లాము. నేను మా బంధువులఅమ్మాయి వెంట వెళ్లాను. ఆమె నాకీ కథ చెప్పింది. "పూలదేవత స్వర్గంలో ఉంటుంది. ఆమె వేర్వేరు పూలకు దేవతలుగా ఉన్నవారందరిమీద అధికారం కలిగిఉంటుంది. ఒక్కొక్క పూవుపూచే కాలంలో ఆ దేవతను పిలిచి, ఆమె 'నీవు

భూలోకానికి వెళ్ళి తోటలలో పూలు పూయించు' మని ఆజ్ఞ యిస్తుంది. ఏకాలంలో పూయవలసినపూలు ఆకాలంలో పూసేటట్లు పూలదేవత చూస్తుంది. ఏదయినా పొరపాటు వచ్చినట్లయితే స్వర్గంలో ఉండే రాణులతల్లి యీ పూల దేవతను శిక్షిస్తుంది. ఒకసారి ఇతర దేవతలతోపాటు పూల దేవతకూడా రాణులతల్లి పుట్టినరోజుపండుగకు వెళ్ళింది. రాణులతల్లీ, మిగిలినవారందరుకూడా యీ పూలదేవత వచ్చి నందుకు చాల సంతోషించారు. ఆ ఉత్సవంలో చంద్ర దేవత యీ పూలదేవతను పొగడుతూ 'ఇటువంటి సంతోష సమయంలో పూలదేవత అన్నిపూలను పూయించితే చాల బాగుంటుంది' అన్నది. ఆ మాటలకు పూలదేవత 'ఒక్కొక్క పూవు పూయవలసిన కాలం వేరే ఉంటుంది. దాని ధర్మం తప్పి అది పూయదు' అన్నది. చంద్ర దేవతకు యీ సమాధానం నచ్చలేదు. 'రాజు కోపగించుకొని అన్నిపూలు యిప్పుడే పూయవలెనంటే ఏమవుతుంది ?' అన్నది. పూల దేవత 'ఏ చక్రవర్తి అయినా అంత ధర్మంతప్పి నడుస్తాడా?' అన్నది. ఈ సంభాషణ వారిమధ్య లేనిపోని అసంతుష్టి కలిగించింది. పూలదేవత తాను స్వర్గంలో ఉన్నప్పటికీ పూలన్నీ భూలోకంలో రాజుల రక్షణలో పెరుగవలసినవే కదా! అనే సంగతి తెలుసుకొన్నది. ఈ సంభాషణ జరిగినట్లుగానే కొంతకాలానికి సుప్రసిద్ధురాలయిన రాణి ఉంటాన్యుయిటీన్ పూలన్నీకూడా నడిశీతాకాలంలో పూయ వలెనని ఆజ్ఞాపించింది. రాణిఆజ్ఞ శిరసావహించితీరవలసించే. పూలదేవతలు వేరువేరుగా తమ పెద్దపూలదేవత ఆజ్ఞ పొందే

అవకాశంకూడా లేదు. కనుక మరునాడు తెల్లవారేసరికి పూలదేవతలన్నీ పూలు పూచినట్లు చేసింది.

రాణి తన రాణివాసపుతోటలోని పూలన్నీ తన ఆజ్ఞ ప్రకారం పూచినందుకు చాల సంతోషించింది. ఒక్క పూవుమాత్రం పూయలేదు. ఆ పూలు పూయనిరకం చెట్లు రాణిగారి తోటలో అయిదువేల మొక్కలున్నాయి. ఆ మొక్కలన్నిటినీ నరికివేసి తగులబెట్టవలసిందిగా రాణి ఆజ్ఞ యిచ్చింది. రాజసేవకులు అలాగే చేస్తున్నారు. ఆ పూలమొక్కలగుట్ట సగం కాలగా మిగిలినమొక్కలు పూలు పూచాయి. ఆ పియోనీ పూలదేవత యీ బాధ భరించలేక అకాలంలోనయినా పూచింది. కాబట్టి రాణి ఆజ్ఞప్రకారం అన్నిపూలుకూడా కాలంగాని కాలంలో పూచాయన్నమాట. ధర్మం తప్పినందుకు పూలదేవతకు శిక్షతప్పలేదు. పైగా చంద్రదేవత ఉన్నవి, లేనివి కల్పించి చెప్పిందికూడాను. అందుచేత ఆ పూలదేవత భూలోకంలో ఒక మనుష్య స్త్రీగా పుట్టాలని శపించారు. స్వర్గంలో ఉండేవారెవరూ భూలోకంలో స్త్రీ పురుషులవలెకష్టపడరు."

మా బంధువుల అమ్మాయి చెప్పిన యీకథనే నేను చైనాభాషలోని పెద్దనవల "చింగ్‌హువా యువాన్" లో కూడా చదివాను.

చైనా జాతివారికే పూలంటే ఎక్కువప్రీతి. నా చిన్న తనంలో నేను పూలమొక్కలు పెంచడం గురించి తెలిసి కొనకపోయినా కొంతకాలానికి పూలపై మక్కువ కలిగింది.

నిత్యజీవితంలో వాడే ప్రతివస్తువుకూడా ఏదో పూలగుత్తుల ఆకారం కలిగిఉండవలసిందే. మా నాయనకు పూలచిత్రాలు చిత్రించడం ఎక్కువప్రీతి. మా మూడవ పెదతండ్రి పూల మొక్కల పెంపకంలో మిక్కిలి నేర్పు సంపాదించాడు. మా అక్కయ్యలు, పెదతల్లులు వారంతా మా పట్టణంలోకి అమ్మకానికి వచ్చిన పూలన్నీ కొంటూ ఉండేవారు. మా అక్కయ్య, చెల్లెళ్లూ తమ దొడ్లలో పూలరకాలన్నీ పెంచి తమ జడలోను, దుస్తులపైన అలంకరించుకొనేవారు. మా నాన్న పడకగదులలో అలంకరించుకొనే పూలబుట్టల నమూనాలు చాలా గీసేవాడు.

ఇందులో 'బాల్సమ్' పూలు గోళ్ళకు రంగుపూసు కొనేటందుకు పనికివచ్చేవి. ఆ పూలతో గోళ్ళరంగు తయారు చేయడం శ్రమతోకూడినపని. అయినప్పటికీ మా ఆడపిల్లలు దానికి లెక్కచేసేవారు కాదు.

పూలు ముమ్మరంగా పూచినకాలంలో పూలు, వాటితోపాటు ఆకులు కోసి జాడీలలో ఎండబెట్టేవారు. అలా ఎండినతర్వాత వాటిని సన్నముక్కలుగా కోసి నూటికి అయిదుపాళ్లు పచ్చపొగాకు, అంతేప్రమాణంలో పొంగించిన పటిక ఇవన్నీ కలిపి కల్వంలో మెత్తగా నూరుతారు. ఇలా ఏడెనిమిదిసార్లు మెత్తగా నూరి, నిద్రపోయేముందు గోళ్లకు పట్టించేవారు.

తెల్లవారేసరికి గోళ్లు ఎఱ్ఱబడి ఉండేవి. ఇలా వరుసగా రెండుమూడు రాత్రులు గోళ్లకు పట్టించితే ముదురు ఎరుపు

రంగు వచ్చేది. ఆ గోళ్లరంగు చాలకాలం నిలిచి ఉంటుందని నమ్మకము. అలా గోళ్లకు పట్టించిన రంగులో రెండు సుగుణాలు ఉన్నట్లు చెబుతారు. గోళ్లకువచ్చే వ్యాధిరాదట. కడుపులో పుట్టే వ్యాధులనుకూడా యీ గోళ్లరంగు రానీయదట. ఈ రంగు తయారుచేయడం చాలా శ్రమతో కూడినదని చెప్పాను. ఆ శ్రమకు తగినఫలితంగా యీ సుగుణాలు చెప్పిఉంటారు. లేకపోతే యీ సుగుణాలు మా మగపిల్లలకు కూడా కలుగునుగదా! మగపిల్లలను యీ గోళ్లరంగు ఎందుకు వేసుకోనీయరు?



పుచ్చబద్దలు అమ్మేవాడు

# 21. పట్టుపురుగులు

ఈ అధ్యాయం వ్రాస్తున్నానుగదా అని నేను నా చిన్న తనంలో ఒక వృత్తిగా పట్టుపురుగులను పెంచానని మాత్రం పాఠకులు అనుకోగూడదు. మా కుటుంబంలో ఇతరపిల్లలు లాగుననే – ముఖ్యంగా ఆడపిల్లలు – నేనుకూడా ఒక సరదాగా పట్టుపురుగులను పెంచాను. మాకు పట్టుపురుగుల పెంపకానికి ప్రత్యేకంగా గదులేమీ లేవు. మేము ఆ పురుగులను గూళ్ళయినా కట్టుకోనివ్వము. మొత్తమన్నీకలిసి మాకు ఒక వంద పట్టుపురుగులయినా లేవు. నేను గట్టిగా పది పన్నెండు పురుగులనుమాత్రమే పెంచాను.

చైనాదేశమే పట్టును కనుగొన్నట్లు చరిత్రలో చెపుతారు. 'ఎల్లో ఎంపరరు' అను పేరుగల చక్రవర్తి (క్రీ. పూ. 2698) ముఖ్య అనుయాయుడు పీలింగ్‌వాసి 'లెయ్‌ట్సూ' అనే ఆయన యీ పట్టుపురుగుల పెంపకం, పట్టునేత మా దేశంలో ప్రవేశపెట్టినట్లు గ్రంథాలలో ఉన్నది. ఆ చక్రవర్తి పరిపాలనకాలంలో సంవత్సరాని కొకమారు వ్యవసాయం, పట్టుపరిశ్రమలకు సంబంధించిన ఉత్సవాలు జరిగేవి. ఈ ఉత్సవాలలో చక్రవర్తి నాగలిపట్టి ఒకచాలు దున్నేవాడట. రాణి మల్బరీఆకులు, పట్టుపురుగుకాయలు పెద్దల స్మృతిచిహ్నాలయెదుట ఉంచి నైవేద్యం పెట్టేదట. అటువంటి రాజపోషణమూలంగా కొన్ని శతాబ్దాలపాటు పట్టుపరిశ్రమ వృద్ధిపొందింది. కియాంగ్సూ, చెకియాంగ్

రాష్ట్రాలు పట్టుపరిశ్రమకు ప్రధాన కేంద్రాలుగా పేరు పొందాయి. మా జిల్లాలో యీ పట్టుపరిశ్రమ వ్యవసాయానికి తోడుగా వృద్ధిపొందింది.

పల్లెప్రాంతాలలో నివసించే మా పెదతల్లి ఒకతె చాల పట్టుపురుగులను పెంచేది; కాని పట్నవాసంలో ఉన్న వాళ్ళము వాటికి ఆహారంపెట్టడం మాత్రమే నేర్చుకున్నాము. గ్రామీణజీవితపు పద్ధతులు నేర్చుకోవడం మేలని మా నాయనమ్మ ఎప్పుడూ చెపుతూఉండేది. ఈ పట్టుపురుగుల పెంపకంవల్ల మేము పెద్దపెద్ద వ్యవహారాలు నేర్పుగా నిర్వహించడం ఎలాగో తెలుసుకోవాలని మా వాళ్ళ ఉద్దేశం. మేము పట్టుపురుగులను పెంచితీరాలని నిర్బంధం లేదు. మాలో ఆడపిల్లలు ఎక్కువగా వీటిని పెంచేవారు. మా తమ్ములళ్ళు చాలమందికి యీ పని యిష్టంగా ఉండేది కాదు. నా మట్టుకునాకు యీ పట్టుపురుగులపెంపకం చాల సంతోషం కలిగించేది.

పట్టుపురుగు పెట్టిన గ్రుడ్లను కాపాడడమే మిక్కిలి కష్టమయినపని — ఈ గ్రుడ్లుపెట్టే కాలంలో మా పెదతల్లి పల్లెలనుంచి పట్నవాసానికి యీ గ్రుడ్లు తీసికొని వచ్చేది. నేను పదికిమించి కొద్దిగా ఎక్కువ అడిగేవాణ్ణి. ఎందుకంటే అన్నీ పురుగులు కావు. ఆమె మా తోటలోని మల్బరీచెట్లు వేసిన క్రొత్తచిగుళ్ళు కోసి పట్టుకురమ్మని చెప్పేది. ఈ గ్రుడ్లను వెచ్చనిప్రదేశంలో పెట్టాలనికూడా చెప్పేది. దీపాలపండుగ అయిపోయినతర్వాత మాగదులల్లో

నిప్పు ఉండదు. కనుక నేను నా పడకగదిలో మంచము క్రింద వాటిని జాగ్రత్తగా ఉంచేవాణ్ణి. మొదట్లో యీ గుడ్లు పసుపుపచ్చరంగులో ఉండి కొంతకాలానికి నలుపు – నీలం కలిసిన రంగులోకి మారేవి. నేను రోజురోజు వాటిని చూచేవాణ్ణి. వాటిలోనుంచి సన్నని నల్లచీమలవంటి పురుగులు బయటికి వచ్చేవి. వాటిని ఒకపెట్టెలో దాచి ఉంచేవాణ్ణి. మల్బరీచెట్టు చిగుళ్ళను చిన్నచిన్న ముక్కలుగాకోసి వాటికి ఆహారంగా పడవేసేవాణ్ణి. ఆచీమలవంటివి యీఆకు చిగుళ్ళను మేసేవి. ఈ ఆకుల మేతతో కొన్నాళ్లు బ్రతికేవి. ఆకులలో ఎక్కువ తడిఉంటే పురుగులకు జబ్బు. ఆకులను కొంచెం ఎండబెట్టి పడవేయాలి. చీమలవంటి పురుగులు క్రమంగా పెరిగి, ఒళ్లుచేసి, బూడిదరంగుగా మారేవి. చీమలరూపం పోయేది.

మొదట్లో మా తోటలోఉన్న ఒక్క చెట్టుఆకులవల్ల పనిగడుపుతూ వచ్చాం. కాని అటుతర్వాత మా నౌకరు, మా తమ్ముళ్ళుకూడా ఎక్కువ మల్బరీఆకులకోసం బయటకు వెళ్ళవలసి వచ్చేది. రైతుల దగ్గరనుంచి మల్బరీఆకులు కొనేవాళ్ళము. కియాంగ్సు, చెకియాంగ్ రాష్ట్రాలలో మల్బరీ ఆకులు ఏరేజనం వేరేఉంటారని, అధికంగా మల్బరీతోటలను వేసి పెంచుతారని విన్నాము. ఈ ఆకులు ఏరేటందుకు స్త్రీలు, పురుషులు, బాలబాలికలు అంతా జట్లుగా వెళ్ళి పాటలు పాడతారట కూడా. వారినిగురించి ఎన్నో కథలు చెపుతారు. మా తమ్ముళ్లు కొందరు యీ ఆకులు ఏరి

తేవడానికి పనికివచ్చేవారు. అంటే వారు ఆటపాటలతోను, ఆ దృశ్యాల శృంగారంతోను సంబంధమున్నవారని కాదు సుమండీ!

వారంరోజులు పెరిగేసరికి అరంగుళానికి పైగా యీ పురుగులు ఎదిగేవి. వాటి రంగు తోపుగా మారేది. తలలు అటూ ఇటూ త్రిప్పుతుండేవి. క్రమంగా ఆహారం తీసికోవడం తగ్గించి చివరకు పూర్తిగా మానివేసేవి. తల ఊపడం కూడా పోయేది. క్రమంగా చలనంలేనిస్థితికి వచ్చేది. ఈ నిద్రావస్థలోనే ఆ పురుగులు తమశరీరాలను మార్చుకొనేవి. ప్రాతశరీరానికి అడుగున క్రొత్త శరీరం పెరుగుతూ ఉంటుంది. తలకు దగ్గరగా ఒక ఎఱ్ఱని చుక్కపుట్టి అక్కడ నుంచే క్రొత్త పట్టుపురుగు పాతశరీరాన్ని చీల్చుకొనివచ్చేది. రెండుగంటలుతర్వాత ఆ పురుగులు మళ్లీ ఆహారం ఇదివరలో కంటె ఎక్కువగాతినడం ప్రారంభిస్తాయి. త్వరగా ఎదగడానికి యీ ఆహారమే ముఖ్యం. నిద్ర, క్రొత్తశరీరం రావడం-ఇలా రెండు మూడు రోజుల కొకమాటు చొప్పున నాలుగుసార్లు జరుగుతుంది. పట్టుపురుగులన్నీ ఒక్కమాటుగా ఇలా నిద్ర, క్రొత్తశరీరం తొడగడం చేయవు. కాబట్టే ఎక్కువసంఖ్యలో పట్టుపురుగులు పెంచేవారికి చాలకష్టం. నాకుమాత్రం కష్ట మనిపించలేదు. నేనొక జత క్రొత్తవెదురుపుల్లలతో మెల్లిగా యీ నిద్రావస్థలోఉన్న పురుగులను ఎత్తి వెదురుజల్లెడలో ఉంచేవాణ్ణి. ఇంతకాలం యీ పురుగులను వెచ్చనిగదిలో ఈగలు చేరకుండా, పెద్దగాలి వీచకుండా దాచి ఉంచాలి.

చివరిసారిగా నిద్రనుంచి లేచేసరికి ఎక్కడలేని ఆకలి పుట్టి ఎన్ని ఆకులయినా చాలకుండా పోతాయి. అప్పటికి మల్బరీ చెట్ల ఆకులన్నీ రాలిపోతాయి. పురుగులకు ఆహారం తేవడం మాకు పెద్దసమస్య. మేము ఎలాగో కాలం గడిపేవాళ్లం. చివరినిద్ర అయిపోయినతర్వాత తొమ్మిదిరోజులకు పట్టు పురుగులు మూడంగుళాలు పొడుగున ఉంటాయి. వాటి శరీరం అంతా మనకు ఇవతలినుంచి అవతలికి కనిపిస్తూ ఉంటుంది. అవి ఆహారం మానివేసి పట్టుదారం చుట్టడానికి సిద్ధంగా ఉన్నాయన్నమాట. ఒక చిన్నగిన్నె తెచ్చి దాని మూతిమీద ఒక కాగితం పెట్టేవాణ్ణి. ఒకటి రెండు పురుగులను కాగితంమీద వదలిపెడితే ఆ పురుగులు ఆ కాగితము చుట్టూ పట్టుదారం వదులుతూ తిరుగుతుంటాయి. నిలువు, అడ్డంకూడ తిరుగుతాయిగనుక పట్టుగుడ్డనేత పూర్తి అవుతుంది. కాగితంమేర పూర్తిచేయడానికి రెండుపురుగులు చాలకపోతే మూడవపురుగునుకూడా వదులుతాను. నేతపని పూర్తి అయ్యేసరికి పురుగులశరీరాలు పొడుగుగా, సన్నగా ఉండడం పోయి రెండుచివరలా రెండు ముక్కులు గలిగిన గొట్టాలుగా మారిపోతాయి. అట్లా కొన్నిరోజులున్నతర్వాత వాటి కళ్లు బయటికివచ్చి రెక్కలు వచ్చేవి. నేను వాటిని తీసుకుపోయి చెట్లమీద వదిలేవాణ్ణి.

నా పట్టుపురుగులు తయారుచేసిన చిన్న పట్టుపీలికలు ముద్రలువేసే పెట్టెకు వాడుకొనేవాణ్ణి. నున్నగా ఉన్న

పట్టుపీలిక ముద్రకు సిరాను అంటుకోనీయదు. ఈ పురుగులు అల్లిన పట్టు ఎంతో అందంగా, యంత్రపరికరాలతో తీసినట్లు చాల సన్నగా ఉంటుంది. కొన్ని దారాలు స్వచ్ఛమైన తెలుపు. కొన్ని బంగారపు పసుపు. మా అక్కయ్య తన పురుగులు తయారుచేసిన పట్టుపీలికలతో పౌడరుఅద్దుకొనే బిళ్లలు తయారుచేసేది. సాఫీఅయిన పట్టు మీద అందంగా కుట్లుకుట్టి కొంచెం ముతకగాఉన్న పట్టుగుడ్డ వాటికి అడుగుభాగంలో కుట్టేది.

నావలెకాక ఆమె వందలాది పట్టుపురుగులను పెంచి పెద్దపెద్ద పట్టుగుడ్డలు తయారుచేసేది. పట్టుపురుగులు దారం వదలడానికి తయారుగా ఉన్నప్పుడు పెద్దబల్లమీదనే కాగితాలు వేసి అంతమేరా దారము అల్లగలిగినన్ని పురుగులను దానిమీాద వదలిపెట్టేది. పెద్ద పట్టుగుడ్డతో, తన కుట్టుపనులన్నీ మూట కట్టేది. అల్లనిపట్టు జిగురుగా చేతికి అంటుకుంటూ ఉంటుంది. కనుక వాటిని సరిగాఉంచడానికి మెత్తనిపదార్థం వాడాలి.

మేమింతగా శ్రద్ధతో కష్టపడి పెంచినదానికి ఇదీ ఫలితం. మా అక్కయ్య, మా చుట్టాల ఆడపిల్లలు ఒకరితో ఒకరు పోటీపడి మంచి పట్టుగుడ్డలు తయారు చేసేవారు. మా అత్తయ్య మా యింటికి వచ్చినప్పుడు యీ పట్టుగుడ్డ

లన్నీ చూచి ఎవరు మంచివి తయారుచేసిందీ చెప్పేది. మా కుటుంబంవారిలో నాతరందాటిన తరువాతితరంవారు పట్టుపురుగంటే ఎలా ఉంటుందోకూడా ఎరుగకుండా పోయినారని వ్రాయడానికి నాకు చాలా విచారంగా ఉంది.



బాతులు అమ్మేవాడు.

# 22. పిచ్చుక చుట్టాలు

ఆకురాలుకాలము వెళ్ళిపోయింది. వసంతకాలం వచ్చింది. మా ప్రాతచుట్టాలు, పిచ్చుక జంటలుకూడా తిరిగి వస్తున్నాయి. ఆకులు రాలిపోయినందుకు విచారం. పిచ్చుక జంటలనుచూచి ఆనందం. మా జీవితంలో యీ రెండు ఘట్టాలు ఎన్నడూ మరపురానివి. వసంతకాలం మొదట్లో కాముకులయినవారు యీ పిచ్చుక జంటలను చూచి ఒక నిట్టూర్పు విడుస్తారు. తమ ప్రియురాండ్రకు సందేశాలు పంపడానికి రాలిన ఆకురాయబారులు సిద్ధంగాఉన్నా ప్రియురాలులేని కొరత వారిని బాధిస్తుంది.

ఈ పిచ్చుక జంటలు తీరికలేకుండా అటూ ఇటూ తిరిగి తమ గూళ్ళు కట్టుకుంటూ ఉంటాయి. ఆ దృశ్యంకూడా చూడదగినదే !

ఈ పిచ్చుకలనుగురించి చైనాభాషలో ఎన్నో కథలున్నాయి. మా పద్యసాహిత్యంకూడా వీటిని ఎంతగానో వర్ణించింది. ఆ పిట్టలంటే మాకెంతో యిష్టం. కనుకనే వాటిని స్వేచ్ఛగా వదిలివేస్తాము.

ఆ పిచ్చుకజంటలు తమకు యిష్టమువచ్చిన ఇంట్లో గూళ్లు కట్టుకుంటాయి. వాటంతట అవి రావలసినదే గాని మనం పిలిచినా రావు. గూళ్లుకదిపి పిల్లలకు అపకారం తలపెట్టినయింట్లో మళ్ళీఅడుగయినా పెట్టవు. పిచ్చుకజంటలు

ప్రేమసౌఖ్యాలకు చిహ్నాలు. ఆ దంపతులకు ఎడబాటులేదు. పిచ్చుకజంటలు అడుగుపెట్టిన యింట్లో ప్రేమ సౌఖ్యాలకు లోటుఉండదని మా నమ్మకము. అవి సాధారణంగా యింటి మధ్య చావడిలోని పెద్ద దూలందగ్గరే గూడుకడతాయి. ఇరుకు గదుల జోలికి అవి పోనే పోవు. విశాలమయిన భవనాలే వాటి నివాసాలు. కాబట్టి పిచ్చుకజంటలు సంపదకు కూడా చిహ్నమని చెప్పవచ్చు. ఇటువంటి నమ్మకాలుకొన్ని ఏర్పడి పోవడంవల్ల చైనా ప్రజలు తమ ఇంట్లోకి పిచ్చుకజంటలు రావడం లేదంటే దిగులుపెట్టుకొని వాటిని తమయిండ్లను ఆకర్షించడానికి అనేకవిధాలకూడ ప్రయత్నించి చూచారు. కాని ప్రయోజనం శూన్యం.

ఈ పిచ్చుకజంటలు తమ పూర్వనివాసం మరచి పోకుండా మళ్లీ సంవత్సరానికిగూడా ఆ యింటికే వచ్చి తీరుతాయి.

మేము చైనా ప్రజలం. మా నిత్యజీవితాలను ప్రకృతితో ముడిపెట్టుకొని ఉంటాము. ఉదాహరణకు ఒక కథచూడండి. 'మాడమ్‌వీ' అను ఒక స్త్రీ. ఆమె చిన్నతనంలోనే భర్త చనిపోయాడు. అందం, తెలివితేటలు గలదని ఆమె తలిదండ్రులు ఆమెను మళ్ళీపెళ్ళి చేసుకోవలసిందని కోరారు. చనిపోయిన తనభర్తమీద ఉండే ప్రేమకొద్దీ ఆమె ససేమిరా నేను వివాహమాడనని చెప్పి తన దృఢసంకల్పానికి చిహ్నంగా తన చెవిఒకటి కత్తిరించుకొన్నదికూడా. వారి యింటికి ప్రతియేటా ఒక పిచ్చుకలజంట రావటం అలవాటు.

ఒక వసంతకాలంలో ఒకపిచ్చుకే వచ్చింది. 'మాడమ్‌పీ' దానికాలికి ఒక ఎఱ్ఱదారం గుర్తుగా కట్టింది. మళ్ళీ సంవత్సరానికి ఆ ఒంటిపిచ్చుక వారియింటికే వచ్చింది. దానిని చూచి ఆ స్త్రీ ఒకపద్యం వ్రాసింది. పిచ్చుక తనజోడును పోగొట్టుకొని, ఆ విచారంతో మళ్ళీజంటను వెతుకుకోవడానికి ఇష్టపడలేదన్నభావం ఆ పద్యంలో ఆమె చెప్పింది. చైనా ప్రజలు ఇంతగా తమ జీవితాన్ని ప్రకృతితో ముడిపెట్టుకుంటారు.

మా యింటికి రెండు పిచ్చుకజంటలు వచ్చేవి. ఒక జంట ముందుచావడిలోను, ఇంకొకజంట రెండవ చావడిలోను గూళ్ళు కట్టుకొన్నాయి. ప్రతిసంవత్సరం ఆ పిచ్చుక జంటలు వచ్చేసరికి మాచిట్టితమ్ముళ్ళు, మా అన్నయ్యగారి అబ్బాయి వాటికి స్వాగతం చెబుతూ గీతాలు పాడతారు.

"ఎన్‌ట్జూ ఎన్‌ట్జూ నైయూలైలో!
ఎన్‌ట్జూ ఎన్‌ట్జూ నైయూలైలో!
వచ్చారా! పిచ్చుకలారా! వచ్చారా!!"

ఆ జంటలలో ఒకటి ఎప్పుడూ సింహద్వారంలోనుంచే వచ్చేది. ఇంకొకజంట మొదటి దొడ్డిగుమ్మమువైపునుంచి వచ్చేది. ఆ రెండుజంటలకు ఎప్పుడూ పొరపొచ్చములేలేవు. ఎండలు ముదిరినప్పుడు మేము గుమ్మాలకు వెదురుపేళ్ళచాపలు వ్రేలాడగట్టేవాళ్ళము. కాని యీ పిచ్చుకలు ఎలావచ్చేవో! అవి తప్పించుకొని యింట్లోకి వచ్చేవి. చాల ఆశ్చర్యం.

వచ్చేటప్పుడు, వెళ్లేటప్పుడు ఆచాపలమీదపడిన వాటినీడలు మాకు ఎక్కువ ఆనందాన్ని కలిగించేవి. ఆ దృశ్యాన్ని చిత్రించాలని మానాన్న అతికుతూహలంగా వాటిని చూచే వాడు. నన్నుకూడా బాగా పరిశీలించుమని చెప్పేవాడు. కాని నేను అంత శ్రద్ధగా చూచేవాణ్ణికాదు.

ఈ పిచ్చుకజంటలు హాయిగా చెట్టుకొమ్మలు మానివేసి ఇళ్లదూలాలకే ఎందుకు గూళ్లు కడతాయో చాల ఆశ్చర్యంగా ఉంటుంది. అవి పగలంతా చెరువుగట్టున ఉన్న చెట్టుకొమ్మలమీదనే తిరుగుతూ ఉంటాయి. చెరువులోని బురదమట్టితో తమ గూళ్లు గట్టిగా కట్టుకుంటాయి. మేము సంవత్సరాదిపండుగకు ఇంటికి సున్నాలువేసినప్పుడు ఈ రెండు పిచ్చుకగూళ్లుమాత్రం కదిపేవాళ్ళంకాదు. పిచ్చుకలు మళ్లీ ఏడాదికివచ్చి క్రొత్తమట్టితెచ్చి గూళ్లు బాగుచేసుకొనేవి. మేము ఆ పిచ్చుకలకు ఎప్పుడూ ఏ ఆహారము పెట్టి ఎరుగము. మరి అవి ఏమితిని బ్రతికేవో మాకు తెలియదు.

మా చిట్టితమ్మునికి ఒకనికి ఒక ఆలోచన ఉండేది. ఒక పిచ్చుకగ్రుడ్డు తీసివేసి దానిస్థానంలో చేపగ్రుడ్డు ఉంచితే పిచ్చుక యీ చేపగ్రుడ్డను బాగా పొదుగుతుందని, పొదిగిన చేపపిల్లలను నీటిలోవేసి పెద్దచేపలను పెంచవచ్చునని అతని ఊహ. కాని పైకి ఎక్కి పిచ్చుకగూడు పడగొట్టేటంత సాహస పని అతడెప్పుడూ చేయలేదు. కాబట్టి అతని ఆలోచన వెఱ్ఱి ఆలోచనయే!

ఈ పిచ్చుకలమాట వచ్చేసరికి నా చిన్నతనంలో నేను చూచిన మరికొన్ని పిట్టల సంగతికూడా జ్ఞాపకం వస్తుంది. గ్రద్ద, కాకి – యివి యింటికప్పుమీద కూర్చుండి తెల్లవారు జామున నిద్రలేచేవేళగాని, ఎటయినా బయలుదేరి వెళ్ళే టప్పుడుగాని అరచినట్లయితే అది అశుభసూచకమని మా నమ్మకము. మా తోటలో చెట్ల కొమ్మలపైన శీతకాలంలో కొన్ని కాకులుండేవి. ఒకనాటి ప్రొద్దున నేను నిద్రలేచిన కొంచెంసేపటికి మా ఇంటికప్పుమీదనుంచి కాకులు 'కా కా' అని అరచాయి. నేను మా నాయనమ్మదగ్గరకు పరుగెత్తుకు పోయి కాకులు అరచాయని చెప్పాను. అప్పుడామె పీడ పోవడానికి ముమ్మారు ఏదో మంత్రం పఠించింది. "ఏంఫరవా లేదులే" అన్నది. అప్పటికి మాలో ఉన్న నమ్మకం గురించి తెలిసికొనలేకపోయినా యేమిటని ఆమెను ప్రశ్నించలేదు. రోజులో ఏవేళప్పుడయినా సరే 'మైనా పిట్ట' అరుపు చాల శుభసూచకమని మేము తలచేవాళ్లం. మేము చిన్నపిల్లలం మైనా అరుపు విని ఒక బాలగేయం పాడేవాళ్లము.

"మైనా మాటలు వినసొంపు
నాన్నకు మాటల తనియింపు
తమ్ముడు త్వరలో కలుగునులే
అన్నకు పెళ్ళి జరుగునులే."

మైనాపిట్టకూత చాల వినసొంపుగాఉంటుంది. ఎందరో కలిసి సంతోషంతో, ఏకకంఠంతో పాడినట్లుగా మైనా పలుకు

తుంది. కనుకనే మేము పాడే గేయం ఏర్పడి ఉంటుంది. నేను మా తోటలో ఒకమాటు లకుముకిపిట్టను చూచాను. అది చెరువుగట్టున ఒక పొడుగాటి సన్నని చెట్టుకొమ్మ మీద కూర్చున్నది. దాని ఆకారం, రెక్కలరంగులు నన్ను చాల ఆకర్షించాయి. మా నాన్న గీసిన బొమ్మలోని ఆకారం, రంగులనుబట్టి యీ పిట్టను నేను గుర్తుపట్టాను.

చేపలు ఎక్కువగా దొరకలేదని కాబోలు. ఆ పిట్ట మళ్ళీ రాలేదు. కొంగలు, నెమిళ్లు – వీటిని నేను నాకళ్ళతో చూడలేదు. మా నాన్న గీసిన చిత్రాలలో చూడడమే. ఆ పక్షులు రెండూకూడా చైనావారి జీవితంలో అనేకవిధాలుగా ముఖ్యమయి ఉన్నాయి. మా నాన్న తనబల్లపై అందంగా అలంకరించు కోవడానికి బాగా వికసించిన పూలగుత్తులు లేనప్పుడు పొడుగాటి నెమలిఈకలను అందంగా అలంకరించే వాడు.

మా వదినెగారి పుట్టింటికి వెళ్ళినప్పుడు నేను మొట్ట మొదటి సారిగా చిలుకను చూచాను. దానికి ఎఱ్ఱనిముక్కు; బంగారు, ఆకుపచ్చరంగు కలిసిన రెక్కలు ఉన్నాయి. ఆ చిలుకపంజరము చావడిలో వ్రేలాడుతూ ఉంది. మేము గుమ్మంలో అడుగుపెట్టేసరికి ఆ చిలుక , "కైలైలియో! కైలైలియో" అని అరచింది. ఆ మాటలకు "చుట్టాలు వచ్చారు, చుట్టాలు వచ్చారు" అని అర్థం. ఈమాటలు నామనసులో గింగురు మంటున్నాయి. పక్షి మనుష్యులవలె మాటలాడగలదని నేనుఎప్పుడూ అనుకోలేదు. మాఅన్నయ్య

మామగారు ఈ చిలుకను చైనాకు దక్షిణంగాఉన్న దేశం నుంచి తీసుకొని వచ్చారట.

చిన్నపిల్లగా ఉన్నప్పటి నుంచీ దానికి యీ మాటలు నేర్పారు. దాని పంజరంలో అది కూర్చునేపుల్లక్రిందుగా నీటితో నింపిన ఒక గిన్నె పెట్టారు. ఆ గిన్నెలో దాని నీడ పడేది. ప్రక్కన ఒక మనిషి నిలబడి మాటలు చెపుతూఉంటే చిలుక పలికేది. కాని చిలుక నీటిలో తనకు కనిపించే చిలుక పలికిన మాటలనే తాను పలుకుతున్నట్లు అనుకొనేది. మాటలు పలకడమేకాక మా చుట్టాలు మాట్లాడేభాష అంతా కూడా మాట్లాడేది. కియాకియాంగ్‌లో చలిఎక్కువ. కాబట్టి శీతకాలంలో దానిని ఒక వెచ్చని గదిలో ఉంచాలి. ఆ రోజులలో చిలుకను పెంచడమంటే చాల ఖర్చుతో కూడుకొన్న పని.

పిచ్చుకలమాదిరి కాకుండా శీతకాలంలో వచ్చి, వేసవి వచ్చేటప్పటికి వెళ్ళిపోయే పక్షులుకొన్ని ఉన్నాయి. అవి ప్రతి సంవత్సరం అదే సమయానికి కొంచెమయినా పొరపాటు లేకుండా ఎలా రాగలుగుతాయో నాకు ఆశ్చర్యం! ఆకాశంలో ఎంతోఎత్తున అవిచాల హుందాగా ఎగురుతూ ఉండేవి. ఆ పిట్టలు వాటిభాష అవి మాట్లాడుకోవడమేకాక మాభాషకూడా అర్థం చేసుకొనేవి. మేము క్రింద ఉండి—

"పక్షుల్లారా! పక్షుల్లారా!
ఏకరేఖగా ఎగరండీ
పిల్లలమంతా చూస్తామూ
ఆనందంతో చూస్తామూ"

అని కేకలుపెడితే ఆకాశంలో ఒక అడ్డుగీత ఆకారంలో ఎగిరేవి. మా భాషలో అది ఒకటికి గుర్తు. మళ్లీ మేము వాటిని చూచి :

"పక్షుల్లారా! పక్షుల్లారా!
మనిషికి గుర్తుగ నిలవండీ
పిల్లలమంతా చూస్తామూ
మీ తెలివికి సంతోషిస్తామూ"

అని అరిస్తే రెండువరుసలలోవచ్చి 'V' ఆకారంలో 'జెన్' అనే గుర్తుగా ఏర్పడేవి. ఆగుర్తుకు మాభాషలో మనిషి అని అర్థం. ఈ రెండుగుర్తులు ఆపిట్టలు తప్పకుండా పట్టేవికాబట్టి ఆపిట్టలు చాల తెలివైనవని మేము అనుకొంటాము. ఆపిట్టలు మాకంటికి కనపడినంతసేపు ఆకాశంవంక చూస్తూనే ఉండేవాళ్లం. చివరకు ఆ పిట్టలు మాకు కన్పించకుండా ఎక్కడికో ఎగిరిపోయేవి. ఈ పిట్టలుకూడా పిచ్చుకల లాగానే చాల విశ్వాసం కలవి. జంటలో ఒకపిట్ట చచ్చిపోయినా, లేదా ఎవడయినా వేటగాడు చంపినా రెండవపిట్ట ఒంటిగా జీవితమంతా గడపవలసిందే. కాబట్టి ఆ పిట్టలుకూడా దాంపత్య ధర్మానికి

చిహ్నాలు. మా పదియవ పినతండ్రి చాల చిన్నవయసులోనే మరణించాడు. మా పెద్దలలో ఒకరు యీ విచారాన్ని తెలుపడానికి నాలుగుమాటలు వ్రాశాడు. "ఎన్ చెంగ్ చిన్ గ్ హాన్". "శీతకాలపు పిట్టలగుంపు అంతా చలిని భరించలేక పోయింది" అని యీ మాటలకు అర్థం. చనిపోయిన మా పినతండ్రి యీడుగల యువకులంతా అతని మరణానికి చాల విచారించినట్లు ఆ వాక్యం తెలియజేస్తుంది. అప్పట్లో ఆ వాక్యం చాలబాగా భావాన్ని చెప్పగలిగినట్లు అంతా మెచ్చుకొన్నారు.

క్రిందటి సంవత్సరము మా అన్న చనిపోయినప్పుడు కూడా యీ వాక్యం నాకు కళ్ళకు కట్టినట్లు ఉన్నది.



పండ్లు అమ్మేవాడు

# 23. పడవ పందెములు

కాన్‌టంగు సరస్సులో జరిగే యీ పందెములకు మానాన్నతోపాటు ఎనిమిది తొమ్మిదిమంది పిల్లలము కలిసి వెళుతున్నాము. అప్పుడు మా నాన్న ఈ పందెములు ఎందుకు ఏర్పడ్డాయో మాకు వివరంగా చెప్పాడు. "ఈ ఉత్సవం సంవత్సరంలో అయిదవనెల, అయిదవరోజున జరుపుతారు. క్రీస్తుకు పూర్వం మూడవ శతాబ్దంలో 'చూ' రాష్ట్రంలో 'చా యువాన్' అనే గొప్పపండితుడు ఉండేవాడు. ఆయన తన అద్భుతమయిన తెలివితేటలతో ఆ రాష్ట్రాన్ని చక్కగా పరిపాలించాలని కోరేవాడు. రాజుగారి కొలువులో పెద్దపెద్ద ఉద్యోగాలు సంపాదించాడు. కాని చూచి ఓర్చుకో లేని కొందరు రాజుగారికి యితనిపై ద్వేషం కలిగించారు. చైనా సాహిత్యంలో ఆయన చాల ముఖ్యమయిన గ్రంథాలు వ్రాశాడు. అయితేనేమి, రాజు యితరులు చెప్పిన మాటలే విని, వాస్తవం తెలిసికోలేక పోయినాడు. ఈ పండితుడు చేయగలిగినదేమీలేక రాజుగారికి వాస్తవం తెలిపి, కళ్ళు తెరిపించే ఉద్దేశంతో 'మిలో' అనేనదిలో మునిగిపోయాడు." ఆయన చనిపోయినరోజే యీ ఉత్సవం జరిగేరోజు. చనిపోయే నాటికి ఆ పండితుని వయసు ముప్పదిమూడు సంవత్సరాలు. పండితుని మరణం తర్వాత, రాజు తనతప్పు తాను తెలిసికొని ఆ పండితుని శవం వెదకవలసిందని ఆజ్ఞాపించాడు. కాని ఏమి ప్రయోజనం!

అందుచేత ప్రతియేటా అయిదవ నెల, అయిదవ రోజున ఆ పండితుని స్మారకం కొఱకు ఒక ఉత్సవం జరపాలని కూడా రాజు నిశ్చయించాడు. ఆ నిశ్చయమే యీ పడవల పందెములకు మూలం. "ఈ ఉత్సవంరోజున సరస్సులో పడవలు జంటలు జంటలుగా ప్రవాహానికి ఎగువగా, దిగువగా తిరుగుతూ ఉంటాయి. ప్రవాహంలో మునిగిపోయినవారి శవాన్ని వెదుకుతున్నట్లుగా ఈ పడవలు తిరుగుతూ జలదేవత సహాయంవల్ల శవం దొరకుతుందని నమ్మకంతో తిరుగుతాయి" అని చెప్పాడు మా నాన్న.

ఈ కథకు, యిప్పుడు జరిగే ఉత్సవానికి సన్నిహిత సంబంధం కనిపించక పోయినా ఆశ్చర్యపడవద్దని కూడా ఆయన చెప్పాడు.

ఆ పండితుడు కియూకియాంగ్ వాడు కాడుకదా ? ఈ కాంటంగ్ సరస్సులో మునిగిపోలేదుగదా ? ప్రజలు యీ ఉత్సవం జరపడం దేనికి ? అని మాకు ఆశ్చర్యం కలిగినా మానాన్న చెప్పేకథ చాల ముచ్చటగా విన్నాము.

మేము సరస్సు ఒడ్డుకు చేరుకున్నాము. అప్పటికే జనము క్రిక్కిరిసి ఉన్నారు. మాకు నిలబడే స్థలంకూడా దొరకలేదు. అయిదారు పందెపు పడవలు సిద్ధంగాఉన్నాయి. ఆపడవలు మామూలు పడవలమాదిరేఉన్నా కొంచెంపొడుగు ఎక్కువ; సన్నంగా ఉన్నాయి. ముందుభాగంలో బాగా అలంకారంచేసిన దయ్యపు తలబొమ్మ అమర్చారు. చివరిలో

చుక్కానిదగ్గర ఒకతోకకూడా ఏర్పాటయిఉంది. పదిహేను, ఇరవైమంది పడవకు రెండువైపులాకూర్చుని తెడ్లు వేస్తున్నారు. ప్రతిపడవకుమధ్య ఒక గదివలె కట్టి అందులో ఒకడు ఒకపెద్ద డోలు వాయించుతూ, ఇంకొకడు ఒక పెద్దగంట మ్రోయించుతూ ఉన్నారు. ఇంకొకడు పడవకు ముందుగా ఒక పెద్ద వెదురుకఱ్ఱ పుచ్చుకొని నిలబడి ఉంటాడు. గట్టునఉన్న జనసమూహంలో అక్కడక్కడ ఒక పొడుగాటి వెదురుకఱ్ఱకు ఎఱ్ఱసిల్కు జండా ఒకటికట్టి ఒకరు నిలబడి ఉంటారు. రెండు పడవలు పోటీపడి ఈ జండా ఉన్నచోటికి వచ్చి జండాను పట్టుకోవడానికి ప్రయత్నిస్తాయి. జండా పుచ్చుకొన్నవారు గెలిచినట్లు; కాని యీ పందెమునకు అంతులేదు. జండా పుచ్చుకొన్న వెంటనే పడవవారు వెనుకకు వెళ్ళిపోతారు. ఒక్కొక్క పందెము జరుగుతున్నంతసేపు వాయిద్యాలు, గంటల మ్రోతలు, పడవకు తెడ్లువేసేవాళ్ళు, చూచేజనం అంతా కేకలుపెడుతూ చాల కోలాహలంగా ఉంటుంది. పడవలు జండానుసమీపించినపుడల్లా బాణాసంచ పేలుస్తారు. ఈ పందెంలో ఎప్పుడూ ఒకే పడవలు ఉండవు. తెడ్లు వేసే వారు మారిపోతూ ఉంటారు. పడవలుకూడ మార్చి పందెము జరుగుతూ ఉంటుంది.

ఈ ఉత్సవం జరిగేనాటికి వాతావరణం చాల అనుకూలంగా ఉంటుంది. మేము చూచినరోజున సూర్యాస్తమయంవేళ సూర్యకిరణాలు సరస్సులోని నీటిమీదపడి ఎఱ్ఱని రంగుకూడా అందంగా కనిపించింది. పడవ నడిపే

వారంతా ఒకేరకపు దుస్తులు; నీలమో, ఆకుపచ్చ లేదా జేగురురంగు తొడుగుకొని ఉన్నారు. పడవలకుకూడ బంగారువన్నె ఎఱుపురంగు వేసి రంగురంగుల జెండాలు కట్టారు. చూడవచ్చినవారిలో చాలమంది ఎఱ్ఱనిజెండాలు, బాణాసంచ తీసికొనివచ్చారు. మా వంతుకుకూడా మేము జండాలు పట్టుకొనే వెళ్లాము. కాని మా అన్నయ్య ఒకడు జండాను కఱ్ఱకు గట్టిగాకట్టడం మరచిపోయాడు. తీరా పడవలు జండాదగ్గరకువచ్చి దానిని పట్టుకోబోయేసరికి పట్టు జండాగుడ్డ నీటిలో పడిపోయింది. మా చుట్టుప్రక్కలఉన్న వారంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు. జండా నీటిలో పడిపోవడం శుభసూచకం కాదు. మా అన్నయ్యకు చాల అవమానంతోచింది. మానాన్న పడవలోనివారికి క్షమార్పణ చెప్పుకొన్నాడు. ఈ సంఘటన జరిగిన తరువాత మేము అక్కడ చాలాసేపు ఉండలేదు కూడా !

ఈ ఉత్సవానికిచేసే పిండివంటకుకూడా చౌయువాన్ పండితుని విషాదమరణానికి సంబంధమున్నది. 'ట్సంగ్ టజ్' అనే పిండిరొట్టె ప్రత్యేకంగా యీ ఉత్సవానికే తయారు చేయబడుతుంది. విశాలమైన పచ్చిఆకులలో, ముక్కోణా కారపు ముక్కలలో దీన్ని పెట్టియిస్తారు. ఈ రొట్టె ఆవిరి మీద ఉడుకుతుంది. దానిచుట్టు ఎఱ్ఱని పట్టురిబ్బనులు కడతారు. ప్రజలంతా యీరొట్టెను నది ఒడ్డుకు తీసికొని

వచ్చి ఆ పండితునికి కానుకలుగా నీటిలోపలికి విసరేవారట. కాని మా చిన్నతనంనాటికే యీ ఆచారం వెనుకబట్టి పోయింది. ఈ పడవపందెము లప్పుడే ఆ రొట్టె తయారు చేసేది. ఏడాదిలో యింకెప్పుడు చేయరు. తినడానికి ఎంతో రుచిగాఉన్నా తయారుచేయడానికి ఖర్చుకూడా ఎక్కువ. మేము ఆ రొట్టెను రెండు విధాలుగా తయారుచేసి ఒక దాన్ని పంచదారతోను, ఇంకొకదాన్ని కారంతోను కలిపి తినేవాళ్ళము.

ఈ ఉత్సవసమయంలోనే తయారయ్యేది నాకు చాలా యిష్టమయిన వంటక మింకొకటి ఉంది.

పందిమాంసపు ముక్కలు చిన్నచిన్న దిమ్మలుగా కోసి, ఉప్పులో ఊరబెట్టి చైనాలోని సోయాగింజలతోను, పిండితోను కలిపి పచ్చితామరాకులో పెట్టి, పైన గడ్డిపోచ లతో బిగించి ఆవిరిమీద ఉడకబెట్టిన వంటకమంటే నాకు చాలయిష్టము. తినబోయేసరికి ఆ పిండివంట పచ్చి తామరాకుల సువాసనతో కూడి చాల రుచిగాఉండేది.

ఈ ఉత్సవం జరిగేసమయం వసంతకాలము ఆరంభించు డానికి ముఖ్యసూచన. చావడిగోడలకు వసంతకాలానికి సంబంధించిన చిత్రపటాలు తగిలించే సమయము. తామర పూలు, దానిమ్మపళ్లు – వీటిచిత్రాలు గోడలనిండా అలంక

రింపబడేవి. మా నాన్నకు చదువుచెప్పిన గురువుగారు ఒక పెద్ద తామరపూవు, దానికాడమీద ఒక లకుముకిపిట్ట చిత్రం గీసారు. మా చావడిలో ఆ పెద్ద చిత్రపటం వ్రేలాడుతూ ఉంది. నేను ఆ చిత్రంలోఉన్న ఎఱుపు, ఆకుపచ్చరంగులను చూచి చాల ముగ్ధుడనై నిలుచుండేవాణ్ణి. వసంతకాలమంతా ఈ చిత్రం మా చావడిలోనే ఉండేది.

మా తోటలో తామరపూలులేవు. మేము ఈ ఉత్సవ సమయంలో పూలజాడీలలో అలంకరించుకోవడానికి రైతుల దగ్గరో, పూలుఅమ్మడానికి వచ్చేవారిదగ్గరో కొనేవాళ్లము. మా దొడ్డిలోఉన్న పూలదానిమ్మ చెట్టుమాత్రము ఈ ఉత్సవ సమయానికి తప్పకుండా పూచేది. ఒక్కొక్క దానిమ్మ పువ్వు నాకెంతో ఆనందం కలిగించేది. మా మూడవ పెదతండ్రి యీ ఉత్సవమునాడు యీ దానిమ్మపూవులన్నీ ఏరుకొని మా యింటిలోఉన్న ఆడపిల్లలంతా అలంకరించుకోవాలని అనేవాడు. ఆడపిల్లలు తమజుట్టులో ఆ పూలు తురుముకొని చాల అందంగా కన్పించేవారు.

"చైనాపండితుని విషాదసంఘటన సంతోషమైన యీ ఉత్సవానికి ఎలా కారణమయిందా ?" అని నేను ఎప్పుడూ ఆలోచిస్తాను. చైనాసాహిత్యంలో ఆ పండితునికి అగ్రస్థానముంది. పండితులయినవారుకూడా ఆయనరచనలను అర్థముచేసుకోవడానికి చాల శ్రమపడతారు. ఆయనచేసిన

సారస్వత సేవకంటె, ఆ పండితుడు ప్రకటించిన దేశభక్తి మాత్రం ప్రజాహృదయాలలో ఆయనకొక ప్రత్యేక స్థానమును కల్పించి పెట్టింది.



తామరపూవులు అమ్మేవాడు.

# 24. పక్షివాహనము

మా దేశ ప్రజలకు కొంగ చాల పవిత్రమైన, అమూల్య మయిన పక్షి. తాయిస్టు పురాణాలలో కొంగకు అతి ముఖ్య మయిన స్థానం ఉన్నది. ఆ పక్షి ఎన్ని యుగాల నుంచి వస్తున్నదో చెప్పలేము. స్వర్గలోకంలో నివసించే దేవతలు మొదలయినవారంతా యీ కొంగవాహనంమీద తిరుగుతూ ఉంటారని మాపురాణాలు చెపుతాయి. ఒకప్పుడు 'షోకాంచే' అనే సుప్రసిద్ధుడయిన వ్యక్తి ఉండేవాడు. ఒకనాటి మధ్యాహ్నం ఆయన చిన్న కునుకుపోయి లేచి యీ విధంగా చెప్పాడు. "నాకు ఒక కల వచ్చింది. ఆ కలలో స్వర్గంనుంచి ఒక కొంగ భూలోకానికి వచ్చింది. నేను ఆ కొంగవాహనముపై ఎక్కి కొండలపైకి ఎక్కడికో వెళ్లాను. నా ఆత్మ ఇక్కడినుంచి వెళ్లిపోయింది. నేనింక మందు లేవీ తీసికోవలసిన పని లేదు." ఈ మాటలు చెప్పిన కొద్దిసేపటికల్లా ఆయన ప్రాణాలు విడిచాడు. మా సారస్వతంలో ఇటువంటి కథలు లెక్కలేనన్ని ఉన్నాయి. "పక్షివాహన మెక్కి దేవతలతో కలియుట" అనేది ఒక లోకోక్తిగా వాడుకలోనికి వచ్చింది. నరకంలో పడే బాధలు లేకుండా హాయిగా స్వర్గంలో సుఖం అనుభవించడమని ఆ లోకోక్తికి అర్థం.

మా తాతయ్య తన యెనుబది రెండవయేట పక్షివాహన మెక్కి దేవతలతో కలిశాడు. ఆయనకు ఆ వయసులోకూడ యేమీ లేదు సరిగదా చనిపోయిననాటి ఉదయంకూడా మా

నౌకరును తనకు గట్టిగా నమిలే ఆహారం పెట్టుమనికూడా అడిగాడు. వంటమనిషి ఆయనకోరిన ఆహారం తెచ్చి పెట్టాడు. ఆ వంటకము రుచి చూస్తూనే, ఏదో మాట అంటూనే మా తాతయ్య ప్రాణం విడిచాడు.

మా నాయనమ్మను, ఇంట్లో ఉన్న పెద్దవాళ్లు అందరిని వెంటనే కేక వేశారు. పనిమీద బజారు వెళ్ళిన వారందరికి కబురు పంపారు. వారంతా గొల్లుమంటూ తాతయ్య గది దగ్గరకు వచ్చారు. మా కుటుంబంలోని వారంతా కూడబలుకుకొని ఎవరెవ రేమిచేయాలో నిశ్చయించారు. మా నాయనమ్మ ప్రక్కనే విడువకుండా ఉంటూ ఆమెను ఓదార్చడానికి మా పెద తల్లు లిద్దరు ఉన్నారు. చాలరోజుల క్రిందటే శవపేటిక, చనిపోయినవారికి కప్పే గుడ్డలు, తొడిగేదుస్తులు అన్నీ సిద్ధంగానే ఉన్నాయి. ఇప్పుడు చేయవలసినదల్లా మా ఆచార ప్రకారం ఉత్తర క్రియలుజరపడమే. మా ఇల్లంతా తెల్లని గుడ్డ తెరలు వ్రేలాడగట్టాము. మాలో నలుపురంగు కాదు, తెలుపు రంగే విచారాన్ని తెలియజేసేరంగు. దర్జీలను పిలిచి మాలో ప్రతిఒక్కరికి తెల్లనినూలుదుస్తులు తయారుచేయించారు. మా పెదతల్లులు, మా అక్కయ్యలు కలిసి తెల్లని టోపీలు మా అందరికి సిద్ధంచేశారు. నేను, నాయీుడు పిల్లలము కలిసి పెద్ద తెల్లకాగితాలమీద మా తాతయ్య మరణవార్త వ్రాసి పట్టణపు ద్వారాలమీద అంటించాము. మా తాతయ్య మరణవార్తను పట్టణంలోని వార్తాపత్రికలు ప్రకటించాయి.

మా తాతయ్య శరీరానికి తుదిసారిగా స్నానం చేయిం చారు. ముడిసిల్కుగుడ్డ శరీరంచుట్టూ కొన్నిచుట్లు చుట్టారు. వాటిపైన ప్రత్యేకంగా కుట్టిన పట్టుదుస్తులు తొడిగారు. ఆయనకు తొడిగిన దుస్తులు మింగ్‌వంశపు పద్ధతిలోనివి. ఆ పద్ధతే ఆయనకు మిక్కిలి ఇష్టము. మింగ్‌వంశపు పండితు డొకడు తన గదిలో నిద్రపోతున్నట్లుగా మా తాతయ్య కన్పించాడు. ఆయన తలవైపున ఒక ధూపంవేసే పాత్ర ఉంచి ఎప్పుడూ ఆపాత్రలో ధూపంవేస్తూ ఉంచారు. ఆ సాయం కాలానికి ఒక పురోహితుణ్ణి పిలిచి శవపేటిక మూసే విధిని పూర్తిచేయించారు. మూడవచావడి మధ్యలోకి పట్టి శవ పేటికను ముందు చేర్చారు. కుటుంబంలోని వారంతా విచారసూచకమయిన తెల్లనిదుస్తులు తొడుగుకొనివచ్చి శవ పేటికముందు నమస్కరించారు. నలుగురు వాహకులు తాతయ్య మృతకళేబరాన్ని ఒక పెద్ద తెల్ల దుప్పటిలోఉంచి మూడవచావడిలో ఉన్న శవపేటికదగ్గరకు చేర్చారు. శరీరం శవపేటికలో ఉంచి మా తాతయ్యకు ఇష్టమయిన వస్తువు లనేకము అందులో ఉంచారు. హృదయాన్ని కదలించివైచే విచారస్వరము వాయించారు. పురోహితు డేవో మంత్రాలు చదివాడు. వాహకులు శవపేటికలో కళేబరాన్ని కప్పి వేశారు. పెట్టెమూత మూసివేసి, మేకులు బిగించి, అతుకులలో బాగా రంగు పూసివేశారు. మా తాతయ్య ముఖం ఇక చూడబోముగదా అని మేమంతా చాలా విచారించాము.

మా పెద్దల స్మృతిచిహ్నలుండే స్థలంలో అంతేఎత్తున ఒక వేదిక నిర్మించారు. అంతా తెల్లని గుడ్డతో కప్పివేశారు. దానికి పై భాగంలో మానాన్న చిత్రించిన మా తాతయ్య చిత్రపటం ఉంచారు. పటానికి దిగువ మరణించినవారి పేరుతో ఒకపలక, దానిక్రింద ఒక బల్లపై నివేదనకుగాను పెట్టిన పిండివంటలు, రొట్టెలు ఉంచారు. తెల్లని రెండు క్రొవ్వొవత్తులు, ధూపంవేసే పాత్ర ఉంచారు.

మరునాటి ఉదయం మా బంధువులు, స్నేహితులు ఎందరో మా తాతయ్య తుది దర్శనానికి వచ్చారు. ఇలా పలకరించడానికి వచ్చేటప్పుడు ఒక నీలిరంగు సిల్కుగుడ్డపై "పక్షివాహనముపై దేవతలను కలియబోవుట" అనే అక్షరాలు బంగారు రంగులో వ్రాసి తీసికొని రావడం ఆచారం. లేదా తెల్లని సిల్కుగుడ్డమీద చనిపోయినవారి గుణగణాలు వర్ణిస్తూ ఒకగేయమైనా వ్రాసుకొని వస్తారు. చనిపోయినవారి కుమారులు తెల్లని తెరవెనుకఉండి అప్పుడప్పుడు బంధువులకు, స్నేహితులకు కృతజ్ఞత తెలుపుతూ ఉంటారు. మాబావ వంటి దగ్గరబంధువులు పలకరించడానికి వచ్చేవారిని లోపలికి తీసుకొని రావడం మొదలైన పనులలో ఉన్నారు.

నేను, మాతమ్ముళ్ళు కొందరు వేదికదగ్గరగా ఉండి పలుకరించడానికి వచ్చినవారిని వరుసలో పంపుతున్నాం. ఎవరయినా పలుకరించడానికివస్తే సింహద్వారం దగ్గరేఉన్న వాయిద్యాలవారు వాయిస్తారు. ఆ వచ్చిన వారు తిన్నగా వేదికదగ్గరకు వెళుతారు. క్రొత్తగా ఇంకొకరు వచ్చినప్పుడు

రెండు అగరువత్తులు ధూపపు పాత్రకుచేర్చి వెలిగించడం నాపని. వచ్చినవారు వేదికకు నమస్కరించి, చనిపోయిన వారి కుమాళ్ళు మ్రొక్కుతూఉన్న చోటికి నమస్కరించి వెళ్లిపోతారు. ప్రక్కనేఉన్న మావైపుచూచి వంగుతారు. మేముకూడా వారికి వంగి నమస్కరిస్తాము. ఈ సమయంలో మాటలేమీ ఉండవు. రెండవ చావడిలో ఆవెళుతున్న వారికి ఒక మడతలుపెట్టిన తెల్లగుడ్డయిచ్చి పంపుతారు. అది పలుకరించి వస్తున్నట్లు గుర్తు. రెండవ చావడిలోనే మా కుటుంబంలోని వారిద్దరు ఆ పలుకరించవచ్చిన వారిని భోజనానికి ఉండవలసినదని పిలుస్తారు. మొదటి చావడిలో కూడా ఇటువంటిపిలుపే పిలుస్తారు. ఉండడానికి వీలులేక వెళ్లిపోయేటట్లయితే సింహద్వారంలోని వాయిద్యాలు మ్రోగుతాయి. ఈ వీడ్కోలప్పుడు వాయించే వాయిద్యము వేరుగా ఉంటుంది.

ఈ వాయిద్యాన్నిబట్టే లోపలికివచ్చేది, బయటికివెళ్ళేది తెలియాలి. కనుక యీ వాయిద్యాలు తేడాగానే ఉంటాయి. పలుకరించడానికి వచ్చేవారుమాత్రం నల్లని పైజుబ్బా ఒకటి తొడుగుకొని వస్తారు. ఈ ఓదార్పు కార్యక్రమము ఆపగలు, రాత్రికూడా జరుగుతూనే ఉంది. మా కుటుంబానికి బంధువులు, స్నేహితులుకూడా ఎక్కువే. అదీకాక మా అన్నయ్య ఊరిలో మంచి పలుకుబడి కలవాడు. పాఠశాల నిర్వహణ కమిటీకి అధ్యక్షుడు. అందుచేత వచ్చే పోయేవారు మరింత ఎక్కువ. దగ్గర బంధువులు, ముఖ్యు

స్నేహితులు కొందరు భోజనానికి ఉన్నారు. వివాహ సమయాలలో జరిగినంతవిభవంగా ఇది జరుగదు. అంత ఎక్కువమంది రారుకూడా.

పలుకరించేటందుకు వచ్చేవారంతా వచ్చేశారని తోచినతర్వాత పెద్దలకు నివేదించే కార్యక్రమానికి ఏర్పాట్లు చేసేవారు వేదిక తీసివేసి, పెద్దల స్మృతిచిహ్నాల ఎదుట ధూపంవేసేవారు. కుటుంబంలోని వారంతా అక్కడకువచ్చి నమస్కరించాలి. పూర్వకాలపు పాటలపద్ధతిలో మా అన్నయ్య వ్రాసిన యీ మరణ వృత్తాంతాన్ని మాబంధువు ఒకడు బిగ్గరగా చదివాడు. మా తాతయ్యకూడా వారినిచేరుకున్నాడని, శవపేటిక మా పెద్దల సమాధుల దగ్గరకు మరునాడు చేరుస్తారని పెద్దలకు దానిలో తెలుపబడి ఉంటుంది.

అంత్యక్రియలకు ఏర్పాటుచేయడం తరువాత పని. ఇదే చాల కష్టమయినది కూడా. మా పెద్దలకు ఎవరికికూడా ఆ రాత్రి నిద్ర లేదని నాకు బాగా జ్ఞాపకం.

మరునాటి ఉదయం బంధువులు, స్నేహితులు కాక ఊరేగింపుకు రావలసిన జనమంతా మా వాకిటిముందు చేరారు. వచ్చినవా రందరికి ఒక తెల్లని కాగితపు పూవు (మధ్యలో పసుపు లేక నీలంబొట్టు ఉన్నది) చొక్కాకు తగిలించుకొనడానికి ఇచ్చారు. ఊరేగింపులో ఎవరు ఎక్కడ నిలబడాలో చెప్పారు. పురోహితుడు వచ్చాడు. మంత్రాలు పఠించిన తర్వాత కట్టెలమీద ఉంచిన శవపేటికను పదహారుగురు మోసుకొని బయలుదేరారు.

ఊరేగింపు మా యింటినుంచి మెల్లగా సాగింది. అన్నిటికంటె ముందుగా కాగితంతో చేసిన ఒక పెద్ద దేవత బొమ్మను ఒక నౌకరు చక్రాలమీద తోసుకుంటూ వెళ్ళాడు. దానివెనుక మా తాతయ్య పేరు, వయస్సు బంగారురంగు అక్షరాలలో వ్రాయబడిన ఒకఎట్టసిల్కు జండా ఒకటి నడిచింది. కాగితాలతో చేయబడిన నాలుగు జంతువులు—ఒకనీలిరంగు సింహము, ఒక తెల్లయేనుగు, ఒక పెద్దపులి, ఒంటికొమ్ము కల్గిన ఒకవింతమృగము – ఇవన్నీ ఊరేగింపులో వెళ్ళాయి. వీటి అన్నిటివెనుక మా బావ ఒక అలంకరించిన గుఱ్ఱంపైన స్వారిచేస్తూ ఉన్నాడు. ఏడుగురు బౌద్ధసన్యాసులు కాషాయరంగు దుస్తులు ధరించి నడిచారు; పన్నెండుగురు పూలదేవతల కాగితపు బొమ్మలవలె, వాటివెనుక ఎనిమిది మంది పురోహితులు, మా తాతయ్య చిత్రపటం, ఆయన పేరు, వయసు వ్రాసిన పలక – అన్నీ వరుసగా నడిచాయి. మా అన్నయ్య చనిపోయిన వ్యక్తికి మనుమడు గనుక సమాధిపై ఉంచే పలక మోసుకొని వెళ్ళాడు. చుట్టాలు, వారి వెనుక కుటుంబంలోనివారు అందరు తెల్లనిదుస్తులు తొడుగుకొని, మెడ చుట్టూ తెల్లని పట్టీచుట్టుకొని నడిచారు. వీటి అన్నిటి వెనుక చివరగా శవపేటికను మోస్తూ పదహారుగురు ఉన్నారు. శవపేటికపై సిల్కుగుడ్డ కప్పి ఉన్నది. దానిమీద మధ్యలో కొంగబొమ్మ,ఒకవైపునదయ్యాపుతల, ఇంకొకవైపునదానితోక కట్టిఉన్నాయి. నడిచిపోలేని ఆడవారంతా శవపేటికకు వెనుక మేనాలో వెళ్ళారు. మా నాయనమ్మమాత్రం ఇంటిదగ్గరే

ఉండిపోయింది. ఆమెను ఓదారుస్తూ ఉండడానికి ఇద్దరు పెదతల్లులుకూడా ఇంటిదగ్గర ఉండిపోయారు.

ఈ ఊరేగింపు పట్టణంలోని పెద్దబజారువెంట నడిచింది. బాటకు ఇరుప్రక్కలా జనం క్రిక్కిరిసి ఉన్నారు. దారిలో ఉన్న ఇళ్ళవారంతా మా తాతయ్యకు తమ గౌరవం తెలిపే టందుకు మధ్యలో అక్కడక్కడ ఆపుచేశాం. అందుచేత చురుకుగా ముందుకు సాగిపోలేదు. పట్టణపు తూర్పుద్వారం దగ్గరకు చేరుకున్నాము. అక్కడనుంచి శవపేటిక మా పూర్వుల సమాధుల దగ్గరకు చేరుకోవాలి. ఆ సమాధులు చాలదూరంలోఉన్న కొండలపైన ఉన్నాయి. ఊరేగింపుతో ఇంతవఱకు వచ్చిన చుట్టాలందరు వెనుకకు వెళ్ళి పోతారు. వారందరికి కృతజ్ఞత తెలుపుతూ మా పెద్దవా రంతా వారికి నమస్కరించారు. వారంతా వెళ్ళినతరువాత విగ్రహాలు, బొమ్మలు అన్నీకూడా వెనుకకు పంపివేశారు.

శవపేటికవెంట పెద్దవారయిన మగవారుమాత్రం వెళ్ళారు. మా పూర్వుల సమాధులవద్దకు యీ శవపేటిక చేరాలి. అక్కడ సమాధిచేస్తారు.

మా ఇంటిదగ్గర మా పూర్వుల స్మృతిచిహ్నాలుండే చోట్ల మా తాతయ్యను గురించి వ్రాసిన పలక పెట్టారు. ఒక దీపం వెలిగించి పెట్టారు. ధూపం వెలిగేపాత్ర ఉంచారు. ఈ రెండు కూడా ఎప్పుడూ ఉండేటట్లు ఏర్పాటు జరిగింది. ఇంటిలో ఎవరైనాసరే యీదీపారాధన, ధూపం ఆరిపోకుండా

చూడాలని చెప్పారు. ఒక ఏడాదిపాటు కుటుంబం యీ విచారం ప్రకటించాలి. ఆ తర్వాత యీ పలక పెద్దల పవిత్ర గృహంలో చేరుస్తారు. దానికి ప్రత్యేకంగా ఒక పెద్ద తంతు ఉన్నది. కన్‌ఫ్యూషియస్ సిద్ధాంతం ప్రకారము మూడు సంవత్సరాలు విచారం ప్రకటించాలి. కాని ఆచరణలో అది ఏడాదికి తగ్గిపోయింది.

ఈ యేడాదిలోపల కుటుంబంలోని స్త్రీలు ఎవ్వరు కూడా నగలు ధరించడం, క్రొత్తగుడ్డలు తొడగడంకూడదు; విందులేవీ పనికిరావు. మా యింటిలో పెళ్లిళ్లు జరుగకూడదు. సంవత్సరాది పండుగకూడా ఎప్పటిలా జరుపుకోరాదు. మా కుటుంబమంతా విచారంలో మునిగిఉంది.

ఈ కర్మకాండ అంతా చూస్తుంటే ఇంకొక జన్మలో నమ్మకముందనే విషయం స్పష్టమౌతూనే ఉంటుంది. నామట్టుకు నాకు చనిపోయిన తర్వాత ఏమిజరుగుతుందో ఎవ్వరికీ ఏమీ తెలియదనిపిస్తుంది. అయినప్పటికి పెద్దవాళ్లు ఒకరు చనిపోయినప్పుడు చిన్నతరమువారంతా పెద్దలకు గౌరవం ప్రకటించడం విధి అని నా నమ్మకము. పూర్వుల ఆచారాలను, విశ్వాసాలను పూర్తిగా ఖండించివైచే చైనా యువకులతో నేను ఏకీభవింపలేను. పూర్వ సంప్రదాయంలో పెరిగినపెద్దవాళ్లు తమ కాలంలో గతించిన పెద్దలకు జరిపిన విధంగానే తమ అంత్యక్రియలుకూడా జరుప బడతాయనే తృప్తికలిగి ఉండాలి.. క్రొత్తభావాలతో పెరిగిన యువకులు

తమకు అంత్యక్రియలు ఇంత అట్టహాసంగా జరుగ నక్కర్లేదని అనుకోవచ్చు. నామట్టుకు నాకు నన్ను దహనం చేయడమే ఇష్టము. కాని మన పూర్వుల అభిప్రాయాలను పూర్తిగా త్రోసివేయడం మంచిదికాదు. మా నాయన తరంవారుకూడా మా తాతయ్య అంత్యక్రియలు పూర్వ సంప్రదాయ ప్రకారం జరుపడం వట్టి భేషజానికి కాదు.

ఆనాటి ఆచారప్రకారం అలా జరిపి తీరవలసినదే. ~~సంప్రదాయ ప్రకారం~~ అంత్యక్రియలు జరుపక పోయినట్టయితే తమ తండ్రిఋణం తీర్చుకోనట్లేనని వారు హృదయపూర్వకంగా నమ్మారు. కనుకనే ఆ విధంగా జరిపారు.



పిండిరొట్టెలు అమ్మేవాడు